# చతుర ప్రపంచం

## అంకితభావం వుంటే...

కొంతమంది జీవితంలో ఎన్ని విజయాలు సాధించినా, ఎన్ని బంగారు పతకాలు పొందినా కొంచెం కూడా గర్వపడక, ఎలాంటి ఉద్రేకాలకు లోనుకాకుండా కేవలం చిరునవ్వుతో వాటిని స్వీకరిస్తారు. ఆ కోవ లోకే వస్తాడు ప్రపంచ బిలియర్డ్స్ ఛాంపియన్ గీత్ సేథీ. ఒకేఒక్కసారి .... అంటే అతను వరల్డ్ బిలియర్డ్స్ ఛాంపియన్‌గా ట్రాఫీ అందుకునే సమయంలో ఆనందంతో ఆ ట్రాఫీని ఒక్కసారి ముద్దెట్టుకున్నాడు.

"వరల్డ్ ఛాంపియన్‌గా మీకు పేరు వచ్చినప్పుడు మీరు పొందిన అనుభూతులేమిటి?" అని ఎవరో ప్రశ్నిస్తే అతడు చెప్పిన సమాధానమేమంటే "ప్రపంచ ప్రఖ్యాతి గాంచడమనేది ఎవరికైనా ఆనందం కలిగించే విషయమే... కానీ అటు పైన ఇంటికొచ్చే ఫోన్ కాల్స్‌తో విసిగి వేసారిపోవాలి. ఇదికాక ఫంక్షన్‌లో సరిగ్గా ఫొటోలు రాలేదని మరోసారి ట్రాఫీని పట్టుకునుంచోమని వెంటపడే ఫొటోగ్రాఫర్లతో మాత్రం చిక్కుగా అనిపిస్తుంది" అంటాడు గీత్ సేథీ.

13 ఏళ్ళ వయసునుంచీ గీత్ సేథీ ఆటల్లో ఉత్సాహం చూపించడం ప్రారంభించాడు. మొదట్లో ఎక్కువగా స్విమ్మింగ్‌లో పాల్గొనేవాడు. అటు తరువాత ఓసారి అతను బిలియర్డ్స్ బ్యాట్ చేతికి తీసుకున్నాక, తాను పుట్టింది బిలియర్డ్స్ ఆడటానికే అని నిశ్చయించుకున్నాడు. బిలియర్డ్స్‌తోపాటు స్నూకర్ కూడా నేర్చుకున్నాడు.




బిలియర్డ్స్ ఆడటానికి అతని తల్లిదండ్రులు విముఖత చూపించకపోయినా చదువులో ఫస్ట్ మార్క్ వస్తేనే ఆటకు వెళ్ళనిచ్చేదని ఆంక్షలు పెట్టేవారు. అలాగే అతడు మొదటినుంచీ ఎప్పుడూ క్లాసులో ఫస్ట్ మార్క్ తెచ్చుకునేవాడు. మేనేజ్‌మెంట్ డిప్లొమాలో కూడా ఫస్ట్‌క్లాసు తెచ్చుకున్నాడు.

అతడి మొట్టమొదటి బిలియర్డ్స్ విజయం 1976లో లభించింది. అదే అతడు గెలుచుకున్న మొదటికప్పు. అటు పైన మరో

కవర్‌ఫొటో: వికీహండా

అయిదేళ్ళపాటు ఎన్నో కప్పులను గెలుస్తూ వచ్చాడు. ఇవన్నీ జూనియర్ బిలియర్డ్స్ కప్పులు. 1981లో మొట్టమొదటిసారిగా అతడిని సీనియర్ బిలియర్డ్స్ కప్పు వరించింది.

స్నూకర్ ఆటకి, బిలియర్డ్స్ ఆటకి చాలా తేడా వున్నా రెండింటినీ చక్కని ప్రతిభాపాటవాలతో ఆడగలడు గీత్ సేథీ. ఓసారి సింగపూర్‌లో జరిగిన ఆసియా స్నూకర్‌కాంటెస్ట్‌లో ఓడిపోయాడితడు. దానికి కారణం... ఆ పోటీ జరగడానికి నెల ముందు అతడు ఇంగ్లాండు వెళ్ళవలసి వచ్చింది. అక్కడ స్టీవెన్ డేవిస్ స్నూకర్ ఆడే విధానాన్ని చూసి, మెచ్చుకుని, దానిని అనుకరించబోయాడు. దాంతో పరాజయాన్ని చవిచూడాల్సి వచ్చిందతనికి. అటుపైన మళ్ళీ ఎప్పుడూ అలాంటి పొరపాటు చేయక తనదైన పద్ధతిలోనే ఆడి ప్రపంచ ఖ్యాతిపొందాడు.

అతనికి బాగా నచ్చినవి మైకేల్ ఫెరిరా, అగర్వాల్‌లతో ఆడిన ఆటలు. మైకేల్‌తో ఆడినప్పుడు గెలవడమో లేక చావడమో అన్నంత పట్టుదలతో ఆడి గెలుపొందాడు గీత్ సేథీ. ఈ ఆటను తను ఎవరివద్దా అభ్యసించలేదనీ తనంతట తనే నేర్చుకున్నానని సతీష్‌మోహన్, విలియం జోన్స్ మొదలైన వాళ్లతో తరచు ఆడి అందులో నిష్ణాతుణ్ణయ్యానని అంటాడు గీత్ సేథీ.

స్నూకర్ గేమ్‌లో వరల్డ్ ఛాంపియన్ అయ్యేనమ్మకముందా అని ఎవరో అడిగినపుడు పెదవి విరిచాడు గీత్ సేథీ. ఇంగ్లాండులోని పాల్ మిఫ్‌సద్, కౌక్ సంజయ్ సావంత్ వగైరా స్నూకర్ ఛాంపియన్స్‌ని గెలవడం కష్టమంటాడు గీత్ సేథీ.

ప్రతిరోజూ అతడు రెండుమూడు గంటలు తప్పనిసరిగా బిలియర్డ్స్ ప్రాక్టీస్ చేసేవాడు. ఏదైనా పోటీ జరగబోయేటప్పుడు 8 నుంచి 10 గంటలు ప్రాక్టీస్ చేసేవాడతడు. అటుపైన ఆట ప్రారంభం కావడానికి 3, 4 గంటలముందు ఏ స్నేహితులతోనో సరదాగా గడిపి పోటీ టెన్షన్ నుంచి తప్పించుకునేవాడు. అతడు ఇష్టపడే కళ సంగీతం. అతడి తల్లి కూడా మంచి సంగీత విద్వాంసురాలు.

జ్యోతిషం, గ్రహాలు వగైరా నమ్మకాలు తనకి లేవని, తన స్వశక్తిమీదే తనకి నమ్మకమనీ అంటాడు గీత్ సేథీ. ఎవరైనా బిలియర్డ్స్ నేర్చుకోదలుచుకుంటే 12 సంవత్సరాల వయసునుంచే ప్రారంభించాలనీ, అందులో నిష్ణాతులు కావాలంటే అంకితభావంతో ఆటయందు నిమగ్నమవ్వాలని సలహా ఇస్తాడు గీత్ సేథీ.

# ఆరోగ్యాన్నిచ్చే ఆహారం

ప్రస్తుతం వస్తున్న అర్థం పర్థంలేని రోగాలు, చికిత్సకి కూడా అందని మొండిరోగాలు చూసి జనం తెగ భయపడుతున్నారు. చాలామంది ముందుజాగ్రత్తగా ఆహారపు అలవాట్లలోను, తినే పదార్థాలలోను మార్పులు చేసుకుని సాధ్యమయినంతవరకు శరీరం రోగానికి గురికాకుండా చూసుకుంటున్నారు.

మనం ఎలాంటి ఆహారాన్ని, ఏ మోతాదులో తినాలి అనేది ఓ వైద్యుడు ద్వారా తెలుసుకుని పాటిస్తే ఇబ్బంది లేదు. కానీ చాలామంది తమకు అన్నీ తెలుసుననే ఆలోచనతో ఆహారపదార్థాల పరిమాణం, గుణం మొదలైన విషయాల్లో స్వయం నిర్ణయాలు తీసుకుంటారు.

చాలామంది నూనెలోకన్న నేతిలో ఎక్కువ కొవ్వు వుందని, నెయ్యి ఎక్కువ శక్తి నిస్తుందనీ నమ్ముతారు. కానీ అది తప్పు అభిప్రాయం అంటున్నారు. 1 గ్రాము నెయ్యిలోనూ, 1 గ్రాము నూనెలోను 9 కాలరీల శక్తి మాత్రమే వుందని, రెండూ సమానమేనని తెలుస్తోంది. నూనె పదార్థాలు తేలికగా జీర్ణం కావని కొందరి అభి





ప్రాయం. కానీ అది నిజంకాదు. వేపుడు కూరలకీ, పచ్చికూరలకీ కూడా మన డైజెస్టివ్ సిస్టమ్ ఒకేలా స్పందించి పనిచేస్తుంది. మామూలు మనిషికంటే క్రీడాకారుడు ఎక్కువ ప్రోటీనులు తీసుకోవాలనుకుంటారు చాలామంది. కానీ ప్రోటీనుల ఆవశ్యకత వయసును బట్టి, బరువును బట్టి వుంటుంది. కానీ అతను సామాన్యుడా, క్రీడాకారుడా అన్న ప్రశ్నేలేదు. సాల్టెడ్ మిల్క్ క్రీమ్‌లోను, సుగర్ కలిపిన మిల్క్ క్రీమ్‌లోను కాలరీల స్థాయి సమానంగానే వుంటుంది.

కొంతమంది పొద్దున్నే అల్పాహారం తినవలసిన అవసరంలేదని, ఏకంగా భోజనం చేయవచ్చని అంటారు. కానీ ఉదయం చక్కని అల్పాహారం చేయడం, మధ్యాహ్నం




భోజనం, రాత్రి భోజనంకంటే మేలైనది. బంగాళదుంపలు, బ్రెడ్, మాంసం, పాలు ఇవన్నీ శరీరపు బరువును పెంచుతాయని అంటారు చాలామంది. నిజానికి ఏ పదార్థమయినా మన శరీరానికి కావలసిన దానికన్న ఎక్కువ తింటే అది తప్పక బరువును పెంచుతుంది.

గేదెల వద్ద పిండించుకున్న పాలలో, డెయిరీ పాలలో కంటె ఎక్కువ కేలరీల శక్తి వుందని అభిప్రాయపడుతున్నారు. కానీ అది తప్పు. రెండింటిలోను సమానమైన శక్తే వుంది. పైగా డెయిరీ పాలనుంచి హానికరమయిన సూక్ష్మజీవులను, బాక్టీరియాలను తొలగిస్తారు.

ఎక్కువ బి కాంప్లెక్స్ బిళ్ళలు వేసుకుంటే శక్తి చేకూరుతుందని కొందరి నమ్మకం. కానీ శరీరం తన కవసరమయినంతే గ్రహిస్తుంది. మిగతాది వృథాగా పోతుంది. అందుకే ఏ విషయానికయినా డాక్టర్‌ని సంప్రదించడం అవసరం. మెడికల్ చార్ట్‌ని పరిశీలిస్తే చదవడం, వ్రాయడం, తినడం, టెలివిజన్ చూడటం, రేడియో వినడం, పేకాడడం, ఆఫీసులో టైపు చేయడం లేదా కుర్చీలో మాత్రమే కూర్చుని పనిచేయడం వగైరా పనులకు గంటకి 80 నుంచి వంద కేలరీల శక్తి ఖర్చు అవుతుందని తెలుస్తోంది. వంటపని, ఇంటిని శుభ్రం చేసే పని, ఇస్త్రీపని, వగైరాలన్నిటికీ గంటకి 110 నుంచి 160 కేలరీల శక్తి ఖర్చు అవుతుంది. బట్టలుతకడం, తోటపని, వగైరా కొంచెం కష్టమయిన పనులకు 170 నుంచి 240 కేలరీలవరకు ఖర్చు అవుతుంది. ఈదడం, టెన్నిస్ ఆడడం, సైకిలు తొక్కడం, పరుగెత్తడం, ఫుట్‌బాల్ ఆట, డ్యాన్స్ వగైరా పనులలో 350కి మించి కేలరీలు ఖర్చు అవుతాయి.

ఇవి పరిశీలించుకుని మనం చేసే పనులకు ఖర్చు అవుతున్న కేలరీలకనుగుణంగా ఆహారాన్ని తీసుకుంటే అంతా ఆరోగ్యమే.

# 'సమాంతర రేఖలు'పై సమీక్షలు

మే 'చతుర'లో ప్రచురితమైన కన్హయ్యాలాల్ గాంధీ నవల 'సమాంతర రేఖలు'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## మతసామరస్య, మహిళాభ్యుదయాల ప్రతీక

(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)

కులమతద్వేషాల మత్తులో కుళ్ళిపోతున్న నేటి సమాజానికి సదాశయ, సత్సంకల్ప స్ఫూర్తితో సందేశంగా అందించబడ్డ అందమైన నవల సమాంతరరేఖలు. హిందూ ముస్లింల పరస్పర హనన సమయంలో దేశవిభజన సమయం కథాకాలంగా ఆరంభించబడిన ఈ నవలలోని సమస్యలు, కల్లోలాలు నిత్యనూతనంగా మనిషి మెదడు ఎదగని దుస్థితినే సూచిస్తాయి.

మతోన్మాదశక్తులచే మట్టుపెట్టబడాల్సిన ఓ హిందూ వనిత ఓ ముస్లిం మహనీయుని వల్ల సంరక్షింపబడి అంచెలంచెలుగా తన జీవన గమనాన్ని అందమైన అభ్యుదయాల తీరులో మలచుకొని విరాట్స్వరూపిణిగా అందరి మన్ననలందిన కథనం పాఠకులకు కనువిప్పుగా అందించారు రచయిత. కనువిప్పు అని ప్రత్యేకంగా ఎందుకనాల్సివచ్చిందంటే సీమ పరిష్కరించుకున్న తన సమస్యలు, తోడి అభాగినుల సమస్యలు నేటికాలంలో ఎదురైనా సమాజంలో అందరూ నిర్లిప్తవైఖరినే పాటిస్తారు కాని పూని పరిష్కరించరు.

కొద్దికాలం ముస్లింలతో గడిపివచ్చిందన్న కారణంగా పత్నిని పతితగా భావించే మన్‌మోహన్లే సమాజంలో ఎక్కువగా కనిపిస్తారు. అతడికి వంతపాడే తల్లిదండ్రులే ఇందులోనూ సీమ అత్తగారు, మామగారిగా ప్రత్యక్షమవుతారు. వరకట్నపు చావులకు గురిఅయ్యే ప్రమాదంలోని బల్‌వంతకౌర్‌లూ, తాగివచ్చిన భర్త చేతిలో తన్నులు తినే హమీదాలూ, ఒంటరిగా అత్యాచారానికి అయిన వాళ్లచేతే గురిఅయ్యే సూసన్లూ నేటి సమాజంలో జీవచ్ఛవాలుగా వుంటున్నారు. వీళ్ళందర్నీ ఉద్ధరించటానికి ఎంతమంది సీమలాంటి మగువలు తెగువతో సమాజ కల్యాణ సంస్థలు స్థాపించి సంస్కరిస్తున్నట్లు? అన్న ప్రశ్న అష్టకష్టాలుపడే మహిళలకు సవాలుగా వినిపిస్తూనే వుంటుంది.

సంస్కార హృదయానికి మతంతో పనిలేదు. మానవత్వమే సమ్మతం అన్న భావనకు ప్రతిరూపుగా పొదగబడిన జాహీద్ పాత్ర సీమకు పరోక్షంగా చైతన్య ప్రేరకం అవుతుంది. పరిస్థితుల ప్రాబల్యంవల్ల పతిత అయినప్పటికీ అలాంటివారిని సహృదయంతో స్వీకరించే నిర్మల, నీరజ్‌ల జంట మరో ఆదర్శ దర్పణం. సీమలాంటి ఆదర్శ వనితను ఆదరించి ప్రోత్సహించే దుర్లభ సింహ్, రాధా, సోమనాధ్‌లు చక్కని సంస్కర్తలుగా, సహాయకులుగా చిత్రితమైనారు. మొత్తంమీద సీమ కన్నకూతురు కామినితో కలిసి గొప్ప మనుగడగల మహిళగా ఎదగటానికి వీరంతా కారకులు, ప్రేరకులు అయిన





న్నైనాన్ని రసవత్తరంగా అందించారు రచయిత.

దేశవిభజన సమయంలో హిందువులు పడ్డ ధన, మాన, ప్రాణనష్టాలను దయనీయంగా వర్ణించి కళ్లు చెమ్మగిల్లేలా చేశారు. అలా ఆహుతి అయిన మహిళల్లోంచి పుట్టుకొచ్చిన ఉద్యమ స్ఫూర్తియే సీమ సాగించిన జీవనపోరాటం. అక్రమాధర్మాలకూ, సమతా మమతలకు నిరంతరం సమాజంలో సాగే పోరాటమే సమాంతరరేఖలు. ఆ రేఖలు కలిస్తే నిజంగా సమాజ కల్యాణమే గదా! ఆ శుభదినమెప్పుడో? ప్రతి మగువ సీమలా సందర్శింపబడేదెన్నడో? చక్కని, చిక్కని చారిత్రకాంశాల జోడింపుతో, సమస్యా పరిష్కారాల కలగలుపుతో మహిళాలోకానికి జాగృతిగా 'చతుర' వారందించిన ఈ నవల వికృత మనస్కుల సమాజంలో ఉన్న మనకు వాస్తవికతకు భిన్నంగా వుండవచ్చునేమోకాని, అసంభావ్యం మాత్రం కాదు, కారాదు.

-ఎస్. జ్ఞానేశ్వరి,
ఖమ్మం-507 003

## వాస్తవ సంఘటనలకు అక్షరరూపం

(ద్వితీయ బహుమతి
రు: 75/- పొందిన సమీక్ష)

అలనాడు భారతదేశ విభజన సమయంలో జరిగిన హింసాకాండల గురించి, ఆ ప్రజల కష్టాలు, కన్నీళ్లు, ఆవేదనలు కళ్ళకు కట్టినట్లుగా, అక్షరాలలో ప్రతిబింబించి, ఉద్వేగంతో మొదలుపెట్టినప్పట్నించీ దించకుండా ఏకధాటిగా చదివించిన నవల మే నెల కన్హయ్యాలాల్‌గాంధీ నవల "సమాంతర రేఖలు".

'సీమ' పాత్ర అత్యద్భుతంగా, అలనాటి పరిస్థితులకు ప్రతిరూపంలా, ఓ సామాన్య మహిళ, పరిస్థితులకు భయపడి పిరికితనంతో పలాయనంతో వణికిపోయే మహిళ ఎలా తన జీవితాన్ని సరిదిద్దుకొని, ఆదర్శప్రాయరాలిగా, అసామాన్యురాలిగా మారిందీ వివరిస్తూ, అప్పటి పరిస్థితులు, సామాజిక స్థితిగతులూ, ఇంకా అదనంగా ఢిల్లీ, హైదరాబాద్, లక్నోలలోని విశేషాలూ వివరించింది. సీమ జీవితం ఓ సినిమా సంఘటనల రూపంలా కదిలిపోతుంది. సీమ లక్నో చేరేవరకూ, కల్యాణకేంద్ర సంచాలకురాలిగా మారేవరకు సహజ సంఘటనలతో కదలిపోతున్న నవల కాస్తా, అప్పట్నించీ చాలా స్పీడుగా, సినిమాలో సంఘటనలవలే కదులుతుంది. సీమతోపాటు ఇండియాకు 'వచ్చిన నిర్మల ఉరఫ్ సుభద్ర జీవితం అన్ని మలుపులు తిరుగుతుందని ఎవరూ ఊహించరు. మన్‌మోహన్ తిరిగిరావడం, ద్వేషభావంతో, న్యూనతాభావంతో ఉడికిపోవడం కూడా సినిమా సంఘటనలా అన్పించింది. కానీ ఎన్ని ఉన్నా మొత్తంమీద ఈ నవలలో ఉన్న వాస్తవ సంఘటనలు, చారిత్రాత్మక వివరణలు, అలనాటి భారతీయ సంస్కృతి, ఆచార సంప్రదాయాలు- ఇవన్నీ కలిసి చిన్న చిన్న లోపాలను కప్పివేశాయి. శ్రీ కన్హయ్యాలాల్ గాంధీగారి మూల రచనలో ఉన్న ఉద్వేగం, భావప్రకటనలను పొల్లుపోకుండా, స్టఫ్ చెడకుండా అనువదించిన 'జ్యోతిరాణి' గారు సర్వత్రా అభినందనీయురాలు! ఇందులోని పాత్రలు, పాత్రల స్వభావాలు, సంఘటనలు మాకు చిరకాలం గుర్తుండిపోతాయనడంలో సందేహంలేదు!

-జి. సురేష్‌బాబు,
ఒంగోలు-523 002

## నూతన ఒరవడి

(తృతీయ బహుమతి
రు: 50/- పొందిన సమీక్ష)

అన్నిటా వేగం పెరుగుతున్న ఈ కాలంలో

పాఠకులకి కావలసింది సరిగ్గా ఇలాంటి నవలలే.

చదువుతున్నంతసేపూ ఎక్కడా విసుగు అనిపించకుండా జెట్‌వేగంతో చక్కగా సాగింది ఈ నవల. "సమాంతరరేఖలు" గుండా తనతోపాటు పాఠకులని మెరుపువేగంతో తీసుకువెళ్ళటంలో 'కన్హయ్యాలాల్ గాంధీ' సఫలీకృతులైనారని చెప్పవచ్చు. ఒకే విషయాన్ని సాగదీసి పాఠకుల మెదళ్లతో ఆడుకునే రచనలకి కాలం చెల్లిందని ఈ నవల చెప్పకనే చెప్పింది.

దేశవిభజన జరిగినప్పుడు జరిగిన దారుణమైన సంఘటనలు మన స్మృతిపథంనుంచి చెరిగిపోతున్న తరుణంలో ఆ బాధామయ సంఘటనలు మనకి గుర్తు చేయటానికా అన్నట్టు చతురలో ప్రత్యక్షమైంది ఈ నవల. ఉన్న ఆస్తులు విడిచిపెట్టి, ప్రాణాలు గుప్పెట పట్టి, అయినవాళ్లను వెంట తీసుకుని, సరిహద్దు రేఖదాటి, తనది కానిచోట జీవనం సాగించటం అంటే మాటలు కాదు. భర్త అండలేకుండా కన్న కూతురితో సీమ సరిహద్దు దాటి రావటం ఆమె ధైర్యానికి మచ్చుతునక. అండగా ఉంటారనుకున్న అత్తమామలు చీదరించుకున్నా తన లోని ధైర్యాన్ని ఏమాత్రం సడలనివ్వక ఉద్యోగం చెయ్యాలని నిశ్చయించుకోవటం సీమలోని పట్టుదలకి సాక్ష్యం. ఏ స్త్రీ అనుభవించని కష్టాల్ని తాను అనుభవించి కూడా మరే స్త్రీకి అటువంటి కష్టం రాకూడదని ఆమె చూపిన చొరవ అభినందనీయం.

కష్టాలలో ఉన్న తోటి మనిషికి సహాయం చెయ్యటానికి కులమతాలు అడ్డురావని జాహిద్ పాత్ర ద్వారా రచయిత చెప్పిన తీరు ప్రశంసనీయం. జాహిద్ రక్షించింది ఒక్క సీమనే. జాహిద్‌లాంటి సహృదయులు రక్షించింది కొంతమంది సీమల్ని, మరి కొంతమంది కామినిల్ని. మరెంతమంది స్త్రీలు, పిల్లలు, వృద్ధులు దేశవిభజన సందర్భంగా మరణాన్ని ఆశ్రయించారో తలుచుకుంటేనే హృదయం కలుక్కుమనక మానదు.

రచనాశైలి చక్కగా అమిరింది. "కామిని లాంటి చిన్న పిల్లలు సంవత్సరానికి రెండు మూడు పుట్టినరోజులు వస్తే బావుంటుందని ఆలోచిస్తే నాబోటి ముసలివాళ్లు రెండు మూడేళ్లకో పుట్టినరోజు వస్తే బావుణ్ణనుకుంటాం" అని దుర్లభసింహ పాత్ర ద్వారా రచయిత చెప్పిన తీరు చాలా బాగుంది.

అయితే నవల ఎక్కడా బ్రేకులు అన్నవి లేకుండా స్పీడ్‌గా సాగిపోవటంతో సీమ పాత్రకు కొంత అన్యాయం జరిగింది. నవలలో సంఘటనలన్నీ వేగంగా సాగిపోవటంతో సీమ పాత్ర పాఠకుల సానుభూతికి నోచుకోలేకపోయింది. ఆఖరికి నవల చివర్లో కూడా సీమకి న్యాయం జరగకుండానే నవల ముగిసిపోయింది. సీమలాంటివాళ్లు కల్యాణ కేంద్రానికి అవసరమని మనచేత రచయిత ఒప్పించిన తీరు అద్భుతం.

**-కె. సుంధరి,**
సంగారెడ్డి-502 001

## బుర్రను తొలిచే ప్రశ్న

*(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**'ఇండియా'** విభజన తర్వాత పెచ్చరిల్లిన మతవిద్వేషాలు, ఒక యువతిజీవితంలో సంభవించిన పెనుమార్పులను కళ్లకు కట్టినట్లు వివరించిన నవల 'సమాంతర రేఖలు'.

రాజకీయ సర్పయాగంలో, మతాల హోమగుండంలో పడి అశువులు బాసిన అమాయకులెందరినో మతమౌఢ్యం కాలసర్పంలా కాటువేసినవేళ, జడలు విప్పిన మతభూతం ఎందరినో నిరాశ్రయులను చే




సిన సమయాన, వసుధైక కుటుంబంలా వుండే భారతదేశం, మతం మత్తులో విభజనకు గురైన తర్వాత ఒక వనితామణి జీవితంలో, కుటుంబంలో ఎలా ఆటుపోట్లకు గురైందీ సామరస్యంగా చిత్రీకరించారు రచయిత.

ఏదేశ విభజన చూసినా ఏమున్నది గర్వకారణం- నరజాతి చరిత్ర సమస్తం మతమౌఢ్య పరాయణత్వం... అన్నతీరులో అరాచకాలను కళ్లకు కట్టినట్లు రాశారు రచయిత. రాక్షసత్వానికి బలైన వనితలకు ప్రతీక సీమ. దానవత్వం పూసిన గంజాయితోటలో జాహిద్‌లాంటి తులసిమొక్కలూ వున్నాయి.

నవల కథాంశం 'తమస్', 'లజ్జ' నవలలతోపాటు దీటుగా వుంది. యాచకవృత్తిలోని నేరతత్వాలను రచయిత ఎండగట్టారు. యాచకులను ప్రయోజకులుగా చెయ్యటం అనే ప్రక్రియ పాఠకుడికి బాగా నచ్చుతుంది.

పరిస్థితుల ప్రాబల్యంవల్ల సుభద్ర నైతికంగా పతనమయితే అదే స్థితిలో వున్న 'సీమ' మానసికబలాన్ని పెంచుకొని, సమాజ సేవికగా రూపాంతరం చెందుతుంది.

'సీమ' మహిళల కోసం పోరాడిన తీరు బావుంది. స్వయం ఆర్థిక ఆలంబన, సాక్షరత, జాతిఐక్యత, వరకట్న నిషేధం, బాలకార్మికుల నిర్మూలన, వెట్టిచాకిరి నిషేధం వల్ల స్త్రీలు పురోభివృద్ధి చెందుతారనే విషయం అందరికీ ఆమోదయోగ్యమే.

మతాల మార్పిడి వెనకాల వున్న కుట్రలు చదివి ప్రతి పాఠకుడు అచ్చెరువు నొందుతాడు.

అన్ని మతాలకీ, మూలమైన ఔన్నత్యాన్ని గ్రహించి, మతసంఘర్షణలనుండి, సమాజ పరిశుద్ధతకు నడుం బిగించాలనేదే రచయిత ఆశయం.

అనువాదం శబ్దపు అర్థం చెడకుండా చక్కగా సాగింది.

-జె. సంధ్యారాణి,
పోలవరం-534 315

## 1947 జ్ఞాపకాలు

(అయిదవ బహుమతి
రు: 50/- పొందిన సమీక్ష)

భారతదేశంనుండి, పాకిస్తాన్ విడిపోయి స్వతంత్రదేశంగా స్థిరపడినప్పుడు ఈ రెండు దేశాల మధ్య ఏర్పడిన ఉద్రిక్తతలను, అవాంఛనీయ సంఘటనలను గూర్చి వచ్చిన సాహిత్యం తక్కువ. రెండు దేశాల పౌరుల మధ్య ఈ విభజనపట్ల చాలా సందేహాలున్నాయి. ఆ సందేహాలు 1997లో కూడా అలాగే ఉన్నాయి. 1987లో దూరదర్శన్‌లో ప్రసారమయిన గోవింద నిహలాని తమస్ సీరియల్ చీకటిలో చిరుదివ్వె అన్పించినా ఓ వర్గాన్ని హైలైట్ చేయడం వలన మరో వర్గం కోపానికి కారణమయింది.

ఈ నేపథ్యంలో భారతదేశం స్వతంత్ర స్వర్ణోత్సవాలు చేసుకుంటున్న ప్రస్తుత తరుణంలో చతుర సమర్పించిన కన్హయ్యాలాల్ గాంధీ రచన 'సమాంతర రేఖలు' దేశవిభజనపట్ల కారణాలు తెలుసుకుందామనే పాఠకుల అభిమానాన్ని చవిచూస్తుంది. కొంచెం నాటకీయత ఉన్నా, వస్తువులో వైవిధ్యం వుంది. నవల ముగింపు స్త్రీవాద కోణంలో నుండి మలిచారు రచయిత.

సీమ, జాహిద్ పాత్రలు రెండు విభిన్న మతాలకు చెందినవే అయినా సర్వమతాలు ఒక్కటే అనే మంచి ఆలోచనలను బలపరుస్తాయి. మానవత్వాన్ని, జీవన విలువల్ని ప్రభోదిస్తాయి. నవల ఆసాంతం చదివిన తర్వాత, గత చరిత్రకు సంబంధించిన విలువయిన సమాచారాన్ని అవగాహన చేసుకున్నామనే తృప్తి పాఠకులకు కలుగుతుంది.

-అరసవిల్లి కృష్ణ,
విజయవాడ-520 009



# చతుర

సంపుటి: 20 సంచిక: 6 జూలై 1997

చిత్రకారుడు తన కుంచెతో అందంగా దిద్దిన రంగుల్లో ప్రకృతి కాంత మెరిసి పోతోంది. ఆ అందాన్ని తన కాన్వాస్‌లో బంధించడానికి ఆ కళాకారుడు తపన పడుతున్నాడు. చుట్టూ ప్రకృతి, తనముందు కాన్వాస్, పక్కన రంగులు... తప్ప అతనికి మరేదీ కనిపించడంలేదు. తన మనసంతా నిండిన సౌందర్యాన్ని కళ్ళ ముందుకుతెచ్చే ప్రయత్నంలో అలసిన అతని నుదిటిపై ముత్యాల్లా మెరుస్తున్నాయి శ్వేద బిందువులు. అంతలో.. హటాత్తుగా తను గీసిన బొమ్మపై ఎవరో విసిరిన రంగుడబ్బా. చిత్రం నిండా ఆ రంగు అస్తవ్యస్తంగా పరుచుకుని అతన్ని ఉలిక్కిపడి వెనక్కి తిరిగేలా చేసింది.

ఒకవైపు తనకి ప్రాణమైన కళాకృతి...

మరొకవైపు తనకి ప్రాణాధికమైన మరదలు....

కళకి, ప్రేమకి మధ్య నలిగిన ఓ భావుకుని జీవితంలోని చిత్రవిచిత్ర సంఘటనలను విశదీకరిస్తూ విజయార్కే రాసిన 'విజేత' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

# విజేత

— విజయార్కే

శ్రీచంద్ర..

ప్రాతఃకాలం వేళ ప్రకృతి సౌందర్యం అపురూపంగా ఉంది. చీకటిలోంచి వెలుతురు ప్రసరిస్తూ ఉంది. తూర్పు దిక్కు నుండి వెలుగు రేఖలు పైపైకి వస్తున్నాయి.

అతడు కిటికీనుండి ఆవైపుకు చూస్తున్నాడు.

పాలేరు రంగన్న పాలు పితుకుతున్నాడు. నెలకూడా నిండని కోడెదూడ గంతులేస్తోంది.

అతడికి ఆ ప్రాతఃకాల సౌందర్యాన్ని అలాగే.. అలాగే చూస్తూండిపోవాలని ఉంది. వీలయితే ఆ సౌందర్యాన్ని కేన్వాస్‌లో బంధించాలనీ అనిపిస్తోంది.

"అరుణ్"

అతడు తలతిప్పి చూశాడు. జానకమ్మ కాఫీ గ్లాసుతో గదిలోపలికొస్తూ ఉంది. తల్లిని చూసి "నువ్వు రావడమెందుకమ్మా? వంట గదిలోంచి ఒక కేకవేస్తే నేనే వచ్చేవాడినిగా? " అన్నాడతను.

జానకమ్మ ఓ క్షణం అతడివైపు అదోలా చూసి, "ఆరుసార్లు అరిచాను" అంది మెల్లగా.

"ఆరుసార్లు అరవడమేమిటి? "

"నిజంగానేరా... ఆరుసార్లు అరిచాక ఇక లాభం లేదని నేనే పట్టుకొచ్చాను. ఇక్కడికొచ్చాక పెద్దగా అరిస్తే అప్పుడు తమరీ లోకంలోకి వచ్చారు"

అతడు కొద్దిగా సిగ్గుపడ్డాడు.

"నిజమే! అందమైన ప్రకృతిని చూస్తూ ఉంటే తను తనువు మర్చిపోతాడు. తనకప్పుడు ఈ లోకంలో మరేదీ గుర్తుకురాదు. తనలోని చిత్రకారుడు మేలుకుంటాడు. ఆ అందమైన దృశ్యాలను కేన్వాస్‌పై ముద్రించాలనిపిస్తుంది"

తల్లిచేతిలోని కాఫీగ్లాసు అందుకుంటూ "సారీ అమ్మా" అన్నాడు.

"తెలిసిన విషయమేగా" ఆమె చిన్నగా నిట్టూర్చింది.

అతడు మెల్లగా నవ్వాడు.

ఆమె గదిలో నుండి హాలులో కెళ్ళిపోయింది.

అరుణ్ గదిలో ఉన్న బెడ్‌మీద కూర్చుని కాఫీ తాగుతూ కాసేపు అలా ఉండిపోయాడు. ఆ తర్వాత ఖాళీ కాఫీగ్లాసు తీసుకుని హాల్లోకొచ్చి వంటగదివైపు నడిచాడు.

వంట గదిలో పనిచేసుకుంటోంది తల్లి. ఆమెకు పనిలో సాయం చేస్తోంది శ్వేత.

"శ్వేతా!" పిలిచాడు.

ఆమె తిరిగి చూసింది. "ఏంటన్నయ్యా?"

"ఇదిగో గ్లాసు" ఆమెకు గ్లాసు అందించాక అతడు వరండాలోకి నడిచాడు. వాలుకుర్చీలో కూర్చుని చుట్టకాలుస్తూ కనిపించాడు రఘురామయ్య. అలికిడి విని తలతిప్పి అతడివైపు చూశాడు.

ఆయన అప్పటికే పొలం వెళ్ళివచ్చినట్లు కనిపించడంతో అడిగాడు, "అప్పుడే పొలం వెళ్ళివచ్చేసారా నాన్నా? "

"అవున్రా! రేపో ఎల్లుండో కోతకోయాలి. కూలీలను చూడమని మేస్త్రీకి చెప్పి వచ్చాను" చెప్పాడాయన.

రఘురామయ్య నలభై ఎకరాల మాగాణికి పాతిక ఎకరాల మెట్టపొలానికి అధిపతి. ఊరు మధ్యలో రైస్‌మిల్లు. ఊరు చివర్న టూరింగ్ టాకీస్ కూడా ఆయనవే. తండ్రి ఇచ్చిన ఇరవై ఎకరాల మాగాణి మీద కష్టపడి ఆ ఇరవైని నలభైగా చేయడమే కాదు, రైస్‌మిల్లు, టూరింగ్‌టాకీస్ తన సంపాదనతోనేకట్టించాడు.

ఇంత ఆస్తి సంపాదించినా ఆయన ఇప్పటికీ సాధారణ రైతులానే కనిపిస్తాడు. వేకువఝామునే లేచి పొలం వెళ్లడం, పొలం నుండి వచ్చాక పశువుల కొట్టం, టిఫిన్ తిన్నాక రైస్‌మిల్, సాయంత్రం టూరింగ్ టాకీస్ చూసుకోవడం మొత్తంమీద అర్థగంట కూడా ఖాళీగా కూర్చున్నట్టు కనిపించడు. తన తండ్రిని చూస్తే అరుణ్‌కి చాలా




గొప్పగా అనిపిస్తుంటుంది.

సిటీనుండి అతడీ మధ్యనే చదువు ముగించుకుని పల్లెకు వచ్చాడు. వచ్చాక రఘురామయ్య కొడుకును అడిగాడు, "మరి ప్పుడేం చేయాలనుకుంటున్నావ్?"

అతడు అప్పుడు జవాబేం చెప్పలేదు. గత నెలరోజులుగా ఆలోచిస్తూనే ఉన్నాడు. ఇప్పుడిప్పుడే అతడి మనసులోని ఆలోచనలు ఓ నిర్ణయంగా రూపుదిద్దుకుంటున్నాయి.

"మీకు చేయాల్సిన పనేమయినా ఉందా నాన్నా?"

ఆయన చిన్నగా నవ్వాడు. "నాకు చేయాల్సిన పనేముంటుందిరా. కాకపోతే నీ మేనమామ ఉదయం దార్లో కనిపించి నీ గురించి అడిగాడు. ఆయనకు కనిపించి చాలా రోజులయిందటకదా? వీలయితే ఒకసారి ఇంటికి రమ్మన్నాడు..." అని ఆగి రెండు సెకన్ల తరువాత ప్రశ్నించాడు, "ఏంటీ! ఈమధ్య అటువైపు వెళ్లడంలేదా?"

అతడు చప్పున తలెత్తి తండ్రి ముఖంలోకి చూశాడు. ఆయన పెదాలు నవ్వుని దాచేందుకు విఫలయత్నం చేస్తున్నాయి. కళ్లు మాత్రం చిలిపితనాన్ని వర్షిస్తున్నాయి. అతడికి అర్థమయింది. అయినా జవాబు చెప్పాడు. "నిన్న కూడా వారింటికి వెళ్లాను. మామయ్యలేడు..."

"ఆయనుండే టైంలో కూడా అప్పుడప్పుడూ వెళ్తూండు. లేకపోతే తనకు కనిపించకుండా కూతురుతో కబుర్లుచెప్పి వెళ్లిపోతున్నాడని ఆయన అపోహపడే అవకాశం ఉంది" ఆయన సన్నగా నవ్వాడు.

అతడూ నవ్వక తప్పలేదు.

మరో నిమిషం తర్వాత రఘురామయ్య చుట్ట ఆర్పేసి వరండాలో నుండి పశువుల కొట్టంవైపు వెళ్లిపోయాడు.

అరుణ్ అలాగే కూర్చుండిపోయాడు. అతడి కళ్లముందు తను రాజీ అని ముద్దుగా పిలుచుకునే తన మరదలు రాజేశ్వరి కదలాడింది. మనసంతా అదోలా అయిపోయింది. అప్రయత్నంగానే పెదవులు మరింత వెడల్పయ్యాయి. కన్నులు మాత్రం అరమోడ్పులయ్యాయి.

★ ★ ★

గేటు తీసుకుని లోపలికొస్తున్న అరుణ్ని చూడడంతోనే వాకిటిముందు కూర్చుని చాటలోని బియ్యం ఏరుకుంటున్న రుక్మిణమ్మ లేచి "రా బాబూ రా" అంది నవ్వుతూ.

అతడు గడపదాటి హాలులోకి వెళ్లాడు. ఆమె చూపించిన కుర్చీలో కూర్చున్నాక అడిగాడు "మామయ్యలేరా?"

"ఇప్పుడే పొలం వెళ్లారు" జవాబు చెప్పాక ఆమె వంటగదిలోకెళ్లి గ్లాసుతో నీళ్లు తెచ్చి అతడికి అందించింది.

నీళ్లు తాగుతూ మధ్యలో అటూయిటూ చూసి అడిగాడు, "రాజీ కనిపించడం లేదేం అత్తయ్యా?"

"ఇప్పుడే పెరట్లోకి వెళ్లింది!"

ఆ ఇంట్లో అతడిని అడ్డుకునేవారెవరూ లేరు. చిన్నప్పటినుండీ కలిసిమెలిసి తిరిగిన బావామరదళ్లువారు. అందులోనూ కాబోయే భార్యాభర్తలు. ఆ విషయం ఎప్పుడో నిర్ణయింపబడిపోయింది కనుక అతడు పెరడువైపు అడుగులు వేస్తుంటే ఆమె సన్నగా నవ్వుకుంది.

అతడు హాలుదాటి పెరడువైపు వెళ్లి అటు చూశాడు. పెరట్లో పశువులకొట్టం పక్కనే ఉన్న మామిడిచెట్టుకింద కూర్చుని ఓ సినిమా వారపత్రిక తిరగేస్తోంది రాజేశ్వరి. పెరటి తలుపుకు ఆనుకుని అతడు అలాగే చూస్తూండిపోయాడు. అలా ఎంతసేపో? ప్రకృతి దృశ్యాలనే కాదు... తన ముద్దుల మరదల్ని కూడా అతడు అలా ఎంత సేపయినా తదేకంగా చూస్తూండిపోగలడు.

పేజీ తిరగేస్తూ ఆమె అదాటున చూసింది ఇటువైపు. అరుణ్ కనబడగానే ఆమె పెదాలు విచ్చుకున్నాయి. "హాయ్



బావా" అంది ఒక్క ఉదుటున లేస్తూ.

అతడు ఆమెవైపు అడుగులేసాడు. దగ్గరగా వెళ్లాక అడిగాడు. "సినిమా పత్రికేనా. అది? " అతడి గొంతులో కాసింత అసహనం ధ్వనించింది.

"అవునూ!" ఆమె యధాలాపంగా పలికింది.

"ఆ సినిమా పత్రికలు తిరగెయ్యడంకన్నా ఏవయినా జనరల్ నాలెడ్జి బుక్స్ చదవచ్చు కదా? "

"నువ్వు చదివావుగా. సిటీలో పెద్దపెద్ద చదువులు. అంతంత పెద్ద చదువులు చదివినా నీకేం ఉపయోగపడింది? పల్లెటూరి కొచ్చి బొమ్మలేసుకోవడమేగా నువ్వు చేసేది''

కొందరు వ్యక్తులు తాము మాట్లాడే మాట అవతలి వ్యక్తి మనసులో ఎలాంటి ఫీలింగ్‌ని కలగజేస్తుందో ఆలోచించరు. తమకు తోచింది, తాము అనదలుచుకున్నది అనేస్తారు. అవతలి వ్యక్తి తమ మాటలకు బాధపడతాడని కూడా ఆలోచించలేకపోవడం అమాయకత్వమేనా?

అతడికి మాత్రం తన మరదలు నొప్పిం చేలా మాట్లాడినా అందులో అమాయక త్వమే కనిపిస్తుంది. ఎంతయినా ఆమె తనకు ఈ ప్రపంచంలో అత్యంత ఇష్టమ యిన వ్యక్తి.

"అయితే నీ ఇష్టం. సినిమా పత్రికలు తిరగేసుకుంటూనే కాలం గడిపెయ్యి. నాకేం అభ్యంతరంలేదు" అన్నాడతను అతికష్టం మీద తన పెదాల మీదకు చిరునవ్వుతెచ్చు కుంటూ.

"నేను సినిమా పత్రికలు ఎందుకు చూస్తున్నానో నీకు తెలుసుకదా బావా?" ఆమె రెండు చేతులూ అతడి భుజంమీద వేసి చుబుకాన్ని ఆ చేతులమీద వేసింది.

"తెలుసు..." అతడికి తెలుసు కానీ ఆమె అమాయకత్వంతో కోరుకుంటున్న కోరిక అతడికి నవ్వు తెప్పిస్తుంటుంది. అప్పుడ ప్పుడూ ఇబ్బంది పెడుతూ ఉంటుంది కూడా. ఆమె మీద ఉన్న ప్రేమతో ఆ ఇబ్బందిని మౌనంగా భరిస్తూ ఉంటాడు. లేకపోతే ఏంటి? ఆమెకు తనను సినిమా హీరోగా చూడాలని ఉందట. ఎంత పిచ్చికో రిక!

"చెప్పు బావా! నువ్వు సినిమా హీరోవి అవుతావా లేదా?"

అతడు మెల్లగా ఆమె ముఖంలోకి చూశాడు. ప్రస్తుతానికి ఆమెను ఆ మూడ్ లోంచి ఇవతలకు తీసుకొచ్చే ఉద్దేశ్యంతో "సినిమా హీరో కావడం తర్వాత విషయం. ఈ రోజు సాయంత్రం సినిమాకెళ్దామా?" అన్నాడు.

ఊహించినట్టుగానే ఆమె ముఖంలో కొంత మార్పు కనిపించింది. "నిజంగానా?" అంది కాస్త అపనమ్మకంగా.

"నిజంగానే... మన హాల్లో జయచంద్ర సినిమా ఆడుతోంది. సాయంత్రం నేనక్కడ నీకోసం వెయిట్ చేస్తూ ఉంటాను. వచ్చెయ్యి! సిన్మా చాల బాగుంటుందిట"

"థాంక్స్ బావా! నీతో కలిసి సినిమా చూసి రెండు నెలైపోయింది. మళ్లీ ఇదిగో ఈ రోజు. అందులోనూ జయచంద్ర సినిమా అంటున్నావ్... అయితే నీకన్నా ముందుగానే నేను హాలు దగ్గరకొచ్చేస్తాను"

"నీ ఇష్టం!"

ఆమెను ఒక మూడ్‌నుండి ఇవతలికి తీసుకురాగలగడం కాస్త సంతోషాన్నిచ్చింది అతడికి. హాల్లో కెళ్లాక "డాబామీదికి వెళ్దామా?" అడిగాడు.

"డాబామీద కూర్చుందాం బావా! చెట్టు నీడ ఉందిగా! పిట్టగోడ మీద కూర్చోవచ్చు"

అతడు తలూపి డాబా మెట్లు ఎక్కు తుంటే అప్పుడే గుర్తొచ్చినట్టు ఆమె, "నువ్వెళ్లి కూర్చో బావా! నేను అమ్మనడిగి తినటానికే మయినా పట్టుకొస్తాను" అని వెళ్లిపో యింది.

అరుణ్ మెట్లెక్కి డాబా చేరుకుని నీడగా ఉన్న చోట పిట్టగోడ మీద కూర్చున్నాడు. సూర్యుడు తూర్పుదిక్కునుండి బారెడు ఎత్తులో ఉన్నాడు. వేసవికాలం కావడంతో ఎండకాస్త ఎక్కువగానే ఉంది. అయితే ఊరుచుట్టూ ఉన్న పచ్చని పొలాలనుండి చల్లగాలి వస్తుండడంతో మనసు ప్రశాం తంగా అనిపిస్తోంది. ఇదిగో ఇలాంటి ప్రశాంతతే తనకి ఇష్టం. చదువు పేరుతో తను ఏడేళ్లు సిటీలో గడిపాడు. అక్కడ ఇంత ప్రశాంతత ఎక్కడుంది? ఇలాంటి స్వచ్ఛమైన గాలి ఎక్కడ దొరుకుతుంది? నిరంతరం రణగొణ ధ్వనులు, వాహనాలు వదిలే పొగతో కలుషిత వాతావరణం... తనకు ప్రశాంతత ఇష్టం. చక్కని ప్రకృతి ఇష్టం. అందువల్లే పోస్ట్ గ్రాడ్యుయేషన్ పూర్తిచేసినప్పటికీ ఉద్యోగ ప్రయత్నాలు చేయలేదు. సిటీకి మకాం మార్చకుండా పల్లె లోనే ఉండిపోయాడు.

"తీసుకో బావా!"

అతడు ఆలోచనల నుండి తేరుకుంటూ అటు చూశాడు. రాజీ రెండు చేతులలో




రెండు ప్లేట్లు నిండుగా స్వీట్లు, కారాతో ఉన్నాయి. అతడు ఓ ప్లేట్ అందుకున్నాడు. ఆమె అతడి పక్కనే కూర్చుంది.

"ఊ! చెప్పు బావా!"

"ఏం చెప్పను? " అని ఆగి అంతలోనే గుర్తొచ్చినట్టు అన్నాడు. "మామయ్య నన్నోసారి చూడాలనుకుంటున్నట్టు నాన్నగారు చెప్పారు. అందుకే మధ్యాహ్నం వరకూ కూర్చుని ఆయనను కలిసి వెళ్దామనుకుంటున్నాను"

"నాన్న నిన్నరాత్రి కూడా భోజనాల మధ్య నీ ప్రస్తావనే తీసుకువచ్చాడు బావా! అరుణ్ ఏంటి.. అంత చదువు చదివి ఇంకా ఈ పల్లెలోనే ఉన్నాడు. తను సిటీలో ఉద్యోగం సంపాదించేదెప్పుడు? స్థిరపడేదెప్పుడు? అమ్మాయితో పెళ్లి జరిగేదెప్పుడు? అన్నాడు బావా!" చెప్పింది రాజీ.

అతడి మనసులో ముల్లేదో గుచ్చుకున్న ఫీలింగ్ కలిగింది. తన మేనమామ మనసులోని ఆలోచనేమిటో అతడు ఎప్పుడో గ్రహించాడు. తను సిటీలో మంచి ఉద్యోగం సంపాదించుకోవాలి. అది ఆయన కోరిక. ఆయన కోరికేకాదు. తన తల్లిదండ్రుల కోరిక కూడా అదే! రాజీ కూడా సిటీ వైపు పరుగులు తీద్దామనే అనుకుంటోంది గానీ... ఉద్యోగస్తుడి భార్యగా కాదు... సినిమా హీరో పెళ్లాంగా...!

అంతలో ఆమె అంది... "నాన్న ఉద్యోగం అంటున్నాడుగానీ నువ్వు మాత్రం నెలకో నాలుగు వేలు తెచ్చుకునే ఉద్యోగి కావడం నాకెంత మాత్రం ఇష్టంలేదు. నువ్వు సినిమా హీరోవి కావాలి... నేను నిన్ను వెండితెర మీద చూడాలి"

అరుణ్‌కి అసహనం కలిగింది. అక్కడి నుండి లేచి వచ్చేద్దామనుకున్నాడు. కాని... కాని... ఈ ప్రేమ, అభిమానం.. మనిషిని వదిలేందుకు ఇష్టపడవేమో! అతడు చేతిలో ప్లేటు పట్టుకుని తినకుండా ఉండడం గమనించి రాజేశ్వరి చెప్పింది, "తిను బావా! స్వీటంటే నీకెంతో ఇష్టంకదా? "

అరుణ్ మెల్లగా తలాడించాడు. మనసు బాధపడేవేళ ఇష్టాయిష్టాలకు ప్రాధాన్యత ఉండదు కాబోలు. అయినా అతడు తినడం మొదలుపెట్టాడు.

మరో పావుగంట తర్వాత రుక్మిణమ్మ రెండు గ్లాసులు తీసుకుని మెట్లెక్కి పైకి రావడం కనిపించింది. అప్పటివరకూ కాస్త దగ్గరగా కూర్చున్న వారిద్దరూ దూరంగా జరిగారు. రాజేశ్వరి రెండడుగులు ముందుకేసి తల్లిచేతిలోని కాఫీగ్లాసులు అందుకుంటూ, "నువ్వెందుకమ్మా రావడం! కింద నుండి కేకేస్తే నేనే వచ్చేదాన్నిగా" అంది.

"ఫర్వాలేదులేవే!" ఆమె అలసటవల్ల కాబోలు అక్కడే నిలబడింది.

"కూర్చో అత్తమ్మా!" అతడు పిట్టగోడ మీద కాస్త అంచుకు జరిగాడు. ఆమె కూర్చోలేదు.

"వదిన ఏం చేస్తోంది? "

"నేనొచ్చేప్పుడు అమ్మా, చెల్లి వడియాలు పెడుతున్నారు"

రుక్మిణమ్మ చిన్నగా నవ్వింది. "మీ అమ్మ వడియాలు, ఆవకాయలు పెట్టడంలో ఎప్పుడూ ముందే, నేనూ వారం రోజుల నుండి అనుకుంటూనే ఉన్నాను వడియాలు పెట్టాలని. కుదిరి చావట్లేదు"

అతడు చిన్నగా నవ్వి ఊరుకున్నాడు.

"పొయ్యి మీద పాలు ఉన్నాయి. నేను వెళ్తాను!"

ఆమె వెనుతిరిగి వెళ్లిపోతుంటే వెనక నుండి చెప్పాడు, "అత్తమ్మా! పొలంనుండి మామయ్య రాగానే చెప్పు. కాస్త కనిపించి ఇంటికెళ్లాలి"

"అలాగే" అంటూ మెట్లు దిగి వెళ్లిపోయింది రుక్మిణమ్మ.

తల్లి వెళ్లిపోయాక రాజేశ్వరి అతడి చేతిని తన రెండు చేతుల మధ్యకు తీసుకుంది. "చెప్పు బావా! ఏదయినా చెప్పు!"

"ఏం చెప్పను? " అతడు నవ్వాడు.



"ఏదయినా చెప్పు. నువ్వు ఏం మాట్లాడినా సరే, వింటూ ఉండిపోవాలనిపిస్తుంది నాకు" ఆమె కళ్లల్లో ఆరాధనా భావం కదలాడుతోంది. అది గమనించాడు.

అదిగో... అలాంటి భావమే... తన మరదలికి తనమీద ఉన్న ఆరాధనా భావమే తనను ఆమె నుండి దూరంగా మసులుకునేలా చేయలేకపోతోంది. అమాయకప్పిల్లలా తెలిసీ తెలియనితనంతో 'సినిమా హీరోవి కావాలి బావా!' అంటూ బాధపెడుతుందేగానీ ఆమె మనసులో తనమీద కొండంత ప్రేమను దాచుకుని ఉంది. ఆ విషయం తనకెప్పుడో తెలుసు.

ఆ తర్వాత వారిద్దరూ ఏవేవో మాట్లాడుకుంటూ ఎంతోసేపు గడిపారు. అంతసేపు ఏం మాట్లాడుకున్నారని వారిని అడిగితే వారేమీ జవాబు చెప్పలేకపోవచ్చు వాటినే స్వీట్ నథింగ్స్ అంటారు.

అతడు చేతి గడియారంవైపు చూసుకుంటూ "బాప్‌రే! అప్పుడే ఒకటయిపోయింది. మామయ్య పొలంనుంచి వచ్చినట్టులేదు సరే! నేనిక వెళ్తాను" అంటూ లేచాడు.

రాజేశ్వరి కూడా లేచింది. ఇద్దరూ మెట్లు దిగి కిందికి వచ్చారు.

వారిద్దర్నీ చూశాక రుక్మిణమ్మ అల్లుడివైపు తిరిగి చెప్పింది. "మీ మామయ్యగారు పొలంనుండి రావట్లేదు. ఇప్పుడే పాలేరు వచ్చి విషయం చెప్పాడు. ఆయన కేరియర్ని పొలానికే పంపమన్నారు"

"అలా అయితే నేను తర్వాత కలుస్తానులే అత్తమ్మా" అనేసి అతడు వారిద్దరివైపు చూసి తలూపి ఇంట్లోంచి బయటకు నడిచాడు.

అతడి వెనకే వీధిగేటు వరకూ వెళ్లిన రాజేశ్వరి అక్కడే ఆగి చెప్పింది, "సాయంత్రం... సినిమా... మర్చిపోవు కదా? "

అరుణ్ తలాడించి ముందుకు నడిచాడు. నాలుగు వీధుల అవతలే తన ఇల్లు.



మధ్యాహ్నం భోంచేసి పడుకున్నాక మూడింటికి మెలకువ వచ్చింది అరుణ్‌కి. లేచి కాసేపు బెడ్‌మీదే కూర్చున్నాడు. ఆ తర్వాత హాలులోకొచ్చి శ్వేతకి చెప్పాడు...

"కాసింత కాఫీ పెట్టవే!"

"అలాగే!" ఆమె వంటగదిలోకెళ్లాక అతడు తన గదిలోకి వెళ్లాడు. కిటికీలోంచి చూస్తూ నిలబడ్డాడు. మనసు ప్రశాంతంగా ఉన్నట్టనిపించింది. సిసలయిన కళాకారుడిలో అంతర్గతంగా దాగిన కళ ప్రశాంత సమయంలోనే బయటపడాలనుకుంటుంది. గదిలో ఓ మూలగా ఉన్న ఆర్ట్ మెటీరియల్ తనను పిలుస్తున్నట్టుగా తోచింది. ముఖ్యంగా ఆ కుంచె తన స్పర్శకోసం తపించిపోతున్నట్టుగా ఉంది.

శ్వేత కాఫీ కప్పుతో గదిలోకెళ్లేసరికి పోర్టబుల్ స్టాండ్, కేన్వాస్‌లు సర్దుకుంటూ కనిపించాడు అరుణ్.

"ఏంటీ! ఈ రోజు మళ్లీ నీలోకంలోకి వెళ్లిపోతున్నావా? "

"నాలోకం ఏంటి? " అతడు అర్థం కానట్టు చూశాడు.

ఆమె నవ్వింది. "అదే! చిత్రకళా ప్రపంచం. ఆ ప్రపంచంలోకెళితే నీకీ లోకంలోని ఏదీ గుర్తుకు రాదుకదా! అందుకే అది నీ లోకం, ఇది మాలోకం. నేను

మాత్రం పిచ్చిమాలోకాన్ని"

అతడు చెల్లెలి నెత్తిన చిన్నగా మొట్టి, ఆ తర్వాత ఆమె చేతిలోని కాఫీ కప్పు అందుకున్నాడు.

కాఫీ తాగాక అతడు స్టాండ్ భుజానికి తగిలించుకుని కేన్వాస్‌లు చేతపట్టుకుని బయటకు వెళ్ళిపోయాడు.



రాజేశ్వరి అద్దం ముందు నిలబడి పౌడర్ ముఖానికి అద్దుకుంటుంటే వెనుకనుండి రుక్మిణమ్మ గొంతు వినిపించింది. "సినిమా వదిలాక అటు వెళ్ళకు. అరుణ్‌తో కలిసి ఇటే వచ్చెయ్యి"

ఆమె వెనుదిరిగి "అలాగే" అంది.

ఇంట్లోంచి బయటికి నడుస్తుండగా వీధి గేటు దగ్గర ఈశ్వరయ్య ఎదురయ్యాడు. అందంగా తయారయి బయటకెళుతున్న కూతుర్ని చూసి "ఎక్కడికమ్మా బయల్దేరావ్? " అడిగారాయన.

తల్లితో చనువుగా మసలుకుంటుందిగానీ తండ్రి అంటే ఆమెకు కాస్త భయమే ఉంది. అందుకే కాస్త నసుగుతూ చెప్పింది. "సినిమాకెళ్దామని... బావ మధ్యాహ్నం వచ్చి పిలిచాడు... అమ్మ కూడా వెళ్ళమంది. మీకు చెప్పి వెళ్దామని ఇప్పటివరకూ ఎదురు చూస్తే మీరెంతకీ రాకపోయేసరికి.. అమ్మే బయలుదేరమంది"

ఈశ్వరయ్య ఒక క్షణం తదేకంగా చూసి ఆ తర్వాత చిరునవ్వు నవ్వాడు. "అరుణ్ మధ్యాహ్నం ఇక్కడికొచ్చాడా? "

"అవును! మిమ్మల్ని కలవాలని మీకోసం చాలాసేపు ఉన్నాడు"

"అలాగా" అని ఆగి ఆలోచించుకుని రెండు సెకన్ల తరువాత చెప్పాడు. "అయితే రేపుదయం తొమ్మిదింటిలోపు తనను రమ్మను. వాడితో మాట్లాడాల్సిన విషయాలు కొన్ని ఉన్నాయి"

"అలాగే నాన్నా!" తలూపుతూ అందామె. అప్పటివరకూ ఆమె మనసులో కొంత కంగారుపడింది. తండ్రి సినిమా ప్రపోజల్ కాన్సిల్ చేస్తాడేమోనన్న కంగారు అది. ఆయన అలా అనడంతో ఆమె ముఖంలో వెలుగొచ్చేసింది.

"సరే వెళ్ళు" ఆయన ముందుకు నడుస్తూ చెప్పాడు.

ఆయనలా ఒక్క అడుగు ముందుకు వేయడంతోనే రాజేశ్వరి చెంగున వీధిగేటు దాటేసింది. ఊరు మధ్యనుండి ఊరు చివరనున్న టూరింగ్ టాకీస్‌వైపు నడవసాగింది.

సూర్యుడు పశ్చిమాద్రిన పూర్తిగా కుంగిపోయాడు. డిశంబర్ మాసం కావడంతో చలిగాలి అప్పటికే మొదలయింది. చలికి భయపడి కాబోలు పొలం వెళ్ళిన జనం త్వరగా ఇళ్ళకు తిరిగివచ్చేస్తున్నారు. అలా వచ్చే జనంలో కొందరు ఆమెను చూసి పలకరింపుగా నవ్వి ముందుకు సాగిపోతుంటే మరి కొందరు "ఎక్కడికమ్మా రాజీ బయల్దేరావ్? " అని ప్రశ్నిస్తున్నారు.

"సినిమాకి" అని అడిగిన వాళ్ళందరికీ జవాబు చెప్పి అడగని వారిని నవ్వుతో పలకరించి ఆమె ముందుకు సాగిపోతోంది.

పల్లెల్లోని టూరింగ్ టాకీసుల్లో చీకటిపడ్డాకే సినిమా మొదలవుతుంది.

సిటీల్లో, టౌనుల్లో రిలీజయిన సినిమా సంవత్సరం, రెండేళ్ళ తర్వాతే మారుమూల పల్లెల్లోకి టూరింగ్ టాకీసుల్లో ప్రదర్శనకొస్తుంది. సినిమా వచ్చిన మొదటిరోజు ఒంటెద్దుబండిలోనో, లేదా రిక్షాలోనో లౌడ్ స్పీకర్లు పెట్టుకుని చుట్టుపక్కల పల్లెల్లో అరుస్తూ కొత్త సినిమా గురించి ప్రచారం చేస్తారు. అలాగే ప్రతి సాయంత్రం సినిమా మొదలుకావడానికి అర్ధగంట ముందుగా లౌడ్‌స్పీకర్‌లో పాటలు పెట్టి ఊరంతా వినపడేలా చేస్తారు. ఊరిలోని జనం మాత్రం పాటలు మొదలయిన పది నిమిషాల తర్వాతే హాలువైపు బయల్దేరుతారు.

అప్పటికింకా పాటలు వినిపించడంలేదు. సినిమా మొదలవడానికి ఇంకా అర్ధగంట పైగా టైముందని ఆమెకు తెలుసు. అయితే ఆమె అంత త్వరగా బయల్దేరడానికి కారణం, థియేటర్ దగ్గర బావతో కలిసి కాసేపు మాట్లాడుకోవచ్చని.

ఆమె థియేటర్‌కి చేరుకునేసరికి పావు గంట పట్టింది. థియేటర్ గేటు పక్కనే కాంపౌండ్‌వాల్‌కి పెద్ద పెద్ద వాల్‌పోస్టర్లు అతికించి ఉన్నాయి. వాల్‌పోస్టర్‌కి రెండు మూలలా హీరోహీరోయిన్ల బొమ్మలు చిన్నవిగా ఉంటే మధ్యలో నిలువెత్తున ఉంది సెక్సీడాన్సులు చేసే హాసిని ఫొటో. ఆమె వంటిమీద ఉన్న దుస్తులు చూస్తే రాజేశ్వరికి వళ్లంతా కంపరమెత్తింది. మోకాళ్లకు జానెడు పైవరకూ కనిపించేలా నడుము చుట్టూ చుట్టుకున్న బెత్తెడు గుడ్డ, ఆ పైన ఎదను కప్పుతున్న మరో పీలికలాంటి బట్ట... రాజేశ్వరి ఆ డాన్సర్‌వైపు చూడలేక తల తిప్పుకుందిగానీ ఇరవై ఏళ్లలోపు వయసున్న నలుగురు కుర్రాళ్లు ఆ వాల్‌పోస్టర్ వైపే చూడడం గమనించింది.

థియేటర్ లోపలికెళితే ఆఫీసురూంలో కూర్చోవచ్చు. రఘురామయ్య అక్కడే ఉంటారు. తనను సాదరంగా ఆహ్వానించి కబుర్లు చెబుతూ కూర్చోబెడతారు. కానీ ఆమెకు థియేటర్‌లోకి వెళ్లడం ఇష్టంలేదు. రఘురామయ్యకు ఎదురుపడ్డాక అరుణ్ వచ్చినప్పటికీ బయటపడలేదు. అందుకే ఆమె గేటు పక్కనే నిలబడిపోయింది.

వాల్‌పోస్టర్ చూస్తున్న కుర్రాళ్ల మాటలు ఆమె చెవిన పడుతున్నాయి.

"ఈ సినిమాలో 'బావలు రోయ్.. బావలు' పాట సూపర్ హిట్‌రా. ఆ పాటలో హాసిని డాన్స్ ఉంటుంది చూడు..." ఒకడు అన్నాడు.

"అవునట. ఈ సినిమా హిట్ అవడానికి హాసిని ఆట, పాటే అసలు కారణమని విన్నా"

"ఏమయినా హాసినిది సూపర్ స్ట్రక్చర్‌రా... అబ్బా! ఆ కళ్లు ఎంత మత్తుగా ఉంటాయో" మూడో కుర్రాడు నాలుక చప్పరిస్తున్నాడు. వారి సంభాషణ ఆమెకు ఇబ్బందికరంగా అనిపించింది. ఆ ఇబ్బంది ఆ డాన్సర్ మీద కోపంగా మారింది. "ఛీఛీ! ఒంటిమీద జానెడు బట్టతో జనానికి కనిపించడానికి వీళ్లకేమాత్రం సిగ్గనిపించదు కాబోలు!" మనసులోనే అనుకుందామె.

రాజేశ్వరి థియేటర్ కాంపౌండ్‌లోకి అడుగుపెడుతున్నప్పుడే ఆఫీసు గదిలోనుండి చూశాడు రఘురామయ్య. కూర్చున్న కుర్చీలోనుండి లేచి గది వెలుపలకు వస్తూ "మీ అమ్మానాన్నా కూడా వస్తున్నారా? " అడిగాడు.

అప్పుడప్పుడూ ఈశ్వరయ్య తన కుటుంబంతో సహా సినిమాకి వస్తుంటాడు.

"లేదు" జవాబు చెప్పింది రాజేశ్వరి.

"మరి నువ్వొక్కదానివే వచ్చావా? "

"బావ వస్తానన్నాడు" నోటి చివరవరకూ వచ్చిన మాటలు మింగేసింది. చెప్పడానికి సిగ్గు అడ్డొచ్చింది. అందుకే నిలువుగా తలాడించింది. "సరే రా! లోపల కూర్చుందాం" అంటూ ఆయన ముందుకు నడవసాగాడు. రాజేశ్వరి ఆయనను అనుసరించింది.

ఇద్దరూ ఆఫీసు గదిలోకి వెళ్లారు. టూరింగ్ టాకీస్ ఆఫీసు గది అంటే పెద్ద ఫర్నీచరేం ఉండదు. ఓ టేబుల్, నాలుగు కుర్చీలు, ఓ బీరువా! బీరువాలో సినిమా టిక్కెట్లు, అకౌంట్ బుక్స్ ఇత్యాది పెట్టుకుంటారు.

రఘురామయ్య ఓ కుర్చీలో కూర్చున్నాక, ఆమెకు మరో కుర్చీ చూపిస్తూ "కూర్చోవే రాజీ" అన్నాడు. ఆమె తనకు కాబోయే కోడలని తెలుసు. కానీ చిన్ననాటి నుండీ తన భుజాలమీద ఎత్తుకుని పెంచిన అమ్మాయి కాబట్టి, చనువుగా పిలవడం అలవాటయిపోయింది.

రాజేశ్వరి కుర్చీలో కూర్చుంది.




"మీ నాన్న ఏం చేస్తున్నాడు?" అడిగారాయన.

"నేను ఇంట్లోనుండి వస్తున్నప్పుడే పొలం నుండి వచ్చారు"

"నిన్న కనిపించాడులే!"

ఈశ్వరయ్య అంటే రఘురామయ్యకు చాలా గౌరవాభిమానాలున్నాయి. ఆయన చెల్లెల్ని ఈయన చేసుకున్నా, బావగారిననే హోదా ఎప్పుడూ ప్రదర్శించడు. వయసులో తనకన్నా ఒకటీ రెండేళ్లు పెద్దవాడయిన ఈశ్వరయ్య సలహాలు అవసరపడితే తీసుకుంటూ ఉంటాడు.

అంతలోనే ఆయనకు ఏదో గుర్తుకు వచ్చినట్టుగా అడిగాడు "ఇంతకీ అరుణ్ ఈ రోజు మీ ఇంటికొచ్చాడా?"

వచ్చాడన్నట్టుగా ఆమె తలాడించింది

"మీ నాన్నతో మాట్లాడాడా?"

"నాన్నగారి కోసం చాలాసేపు వెయిట్ చేశాడు నాన్నగారు మధ్యాహ్నం భోజనానికి ఇంటికి రాలేదు. కేరియర్ పొలానికి పంపమన్నాడు"

"అలాగా" తలాడించాడు రఘురామయ్య.

"అవునూ! నాన్నగారితో ఏంపని?"

ఆయన కొద్దిసేపు మౌనంగా ఉన్నాక, తర్వాత పలికాడు. "ఏమీలేదే రాజీ! మీ బావకా చదువు ఆగి సంవత్సరంపైనే అయిపోయింది. ఇంకా పైచదువులకెళ్ళి ఉంటే పోనీలే అనుకోవచ్చు ఎంయేతో ఆపేసి ఇంటికొచ్చేశాడు. వచ్చినవాడు అప్లికేషన్ పంపుతూ ఏదైనా ఉద్యోగ ప్రయత్నాలు చేస్తేసరి. అదేం లేకుండా కాలం గడిపేస్తున్నాడు. దానికి తగినట్టు ఆ బొమ్మలు గీసే పిచ్చొకటి. బొమ్మగీయడం మొదలుపెట్టాడంటే వాడికి కాలంగడిచిపోయేదే తెలీదు"

"మరి దానికి నాన్నగార్ని కలవమనడం..." అర్థం కానట్టు చూసింది రాజేశ్వరి.

ఆయన చిన్నగా నవ్వాడు. "వాడిని ఏదయినా ఉద్యోగ ప్రయత్నం చేయమని చెప్పాలని నా ప్రయత్నం. వాడితో ఈ విషయం మాట్లాడగామని రిహార్సల్ వేసుకుని మరీ సిద్ధపడతాను. తీరా వాడు నా ఎదుటపడే సరికి నా మాటలు వాడిని బాధపెడతాయేమోనని ఆ విషయం మాట్లాడడం మానేస్తాను. ఇలా ఆరు నెలలుగా సాగిపోతూనే ఉంది. ఇక లాభం లేదనిపించింది. మీ నాన్న వాడితో కాస్త చనువుగా ఉంటాడు గదా. అందుకని తనే ఈ విషయం వాడితో మాట్లాడితే బాగుంటుందని..."

రాజేశ్వరి వెంటనే అంది, "మీ ఆలోచనా ధోరణి నాకేం నచ్చలేదు మామయ్యా"

ఆయన కాస్త తడబడి, "అదేంటే రాజీ! అలా అంటున్నావ్?" అన్నారు.

"లేకపోతే ఏంటి మామయ్యా? మీకు ఓ పాతికలక్షల రూపాయల ఆస్తి ఉంది. మాకూ ఇంచుమించు అంతే ఆస్తి ఉంది. యాభైలక్షల రూపాయలకు వారసుడయిన బావ, ఐదువేలకు, నాలుగు వేలకు ఉద్యోగం చేయాల్సిన ఖర్మ ఏముంది? బావ ఉద్యోగం ప్రపోజల్‌ని నేను ఎంత మాత్రమూ ఒప్పుకోను..."

రఘురామయ్య మొదటగా చేసినపని తలవిదిలించడం. ఆ తర్వాత ఆమెవైపు ఆశ్చర్యంగా చూశాడు. "నీ బావ ఉద్యోగం చేయడాన్ని నువ్వు ఒప్పుకోవా?... మరి రేపటి నీ మొగుడుగారు ఏం చెయ్యాలని నువ్వు కోరుకుంటున్నావమ్మా? వాడు కూడా మీ నాన్నలాగా, నాలాగా మట్టి పిసుకుతూ, పొలం దున్నుతూ ఉంటే చూడాలనుకుంటున్నావా?"

రాజేశ్వరి వెంటనే "లేదు" అంది.

"ఈ పల్లెటూళ్లో ఉంటే చేయాల్సిన పని అదేకదా? వాడసలే చిన్నప్పటినుంచీ కష్టమంటే ఏమిటో తెలియకుండా పెరిగినవాడు. ఎప్పుడయినా పొలానికి తీసుకెళ్తానని నేను అన్నా ఎండకు తట్టుకోలేడని వాడి అమ్మ... అదే మీ అత్తమ్మ పొలంపై



పుకే పంపేది కాదు. పల్లెలో పుట్టి పెరిగా డన్నమాటేగానీ, వాడికి పొలం పనులు ఏవీ రావు. అలాంటివాడు ఈ పల్లెలోకన్నా సిటీలో ఉండడమే మేలనుకుంటున్నానే..."

"నేను కూడా బావ సిటీలో ఉండాలనే అనుకుంటున్నాను" ఆయన ముఖంలోకే చూస్తూ చెప్పింది రాజేశ్వరి.

రఘురామయ్య ఈసారి కాస్త కనుబొమ్మలు ముడివేసి ఆమెకేసి చూశాడు. "వాడు సిటీలో ఉండాలంటావు. కానీ ఉద్యోగం ప్రపోజల్‌ని ఒప్పుకోనంటావు. ఇంతకీ అసలు నీ ఉద్దేశం ఏమిటి? " క్షణ మాగి ఆ తర్వాత పలికాడు. "కొంపదీసి మీవారు బిజినెస్ చేస్తూ కోట్లు సంపాదించాలని తమరు కలలు కనడంలేదుకదా? "

రాజేశ్వరి నెమ్మదిగా తల అడ్డంగా ఆడించింది. "బావ లక్షలు, కోట్లు సంపాదించాలని నేను కోరుకోవడంలేదు"

"మరేం కోరుకుంటున్నావో చెప్పు"

ఒక కలని కనులముందు సాక్షాత్కరింప చేసుకుంటున్నట్టుగా రాజేశ్వరి కొద్దిసెకనులు కన్నులు మూసుకుంది. కన్నులు విప్పాక ఆఫీసుగది కిటికీలోనుండి బయటకు చూడసాగింది. టిక్కెట్స్ కోసం జనం 'క్యూ' కడుతున్నారు. క్యూ మధ్యలో దూరడానికి ఒకరిద్దరు ప్రయత్నిస్తుంటే మరికొందరు ఆ ప్రయత్నాన్ని అడ్డుకుంటున్నారు. పక్కఊరినుంచి కాబోలు ఎద్దులబండి కట్టుకుని వచ్చి టాకీస్‌ముందు దిగుతున్నారు కొందరు. ఆ ఊరి మోతుబరుల కుటుంబంలా ఉన్నట్టుంది. ఆడవాళ్ళు నూనెకుండల్లా నున్నగా, వెన్నముద్దల్లా మెత్తగా ఉన్నారు. ఓ నగల దుకాణంలో ఉండేటన్ని నగలు వారి మెడల్లో వేలాడుతున్నాయి. ఇంతమంది జనం అన్ని పనులూ మానుకుని, కష్టపడివచ్చి డబ్బులిచ్చి చూడబోయేది ఏమిటి? ... సి...ని...మా!

జనాలందరినీ ఆకర్షించే సినిమా అంటే తనకెంతో ఇష్టం. అందుకే... అందుకే బావ విషయంలో తనో నిర్ణయానికి ఎప్పుడో వచ్చేసింది. అయితే ఈ నిర్ణయాన్ని చెప్పే అవసరం, అవకాశం తనకింత కాలం కలగలేదు. ఇదిగో ఇప్పుడు వీరంతా ఒక నిర్ణయం తీసుకుని బావమీద ఒత్తిడి తీసుకురాబోతుంటే, మరి తన నిర్ణయం తను చెప్పాలికదా?

అంతలో రఘురామయ్య మరోసారి అడిగాడు. "చెప్పవే రాజీ! నీ మనసులో ఏముందో చెప్పు? "

"నేను... నేను..."

"ఆ! నువ్వు..."

"బావ ఏం కావాలని కోరుకుంటున్నానంటే? " ఆమె ఆయనవైపు చూడడంలేదు. చూస్తే చెప్పదలచుకున్నది చెప్పలేకపోవచ్చని ఆమెకు తెలుసు.

"అదే చెప్పు" ఆయన టేబిల్ మీదకు కొద్దిగా వొరిగాడు.

"మరోసారి చెప్పమ్మా" రఘురామయ్య నవ్వుతూ అన్నాడు.

ఆమె మరోసారి చెప్పింది. "సినిమా హీరో"

"భారతదేశానికి ప్రధానమంత్రి కావాలని కోరుకోవడంలేదూ? " ఆయన కంఠంలో కొంత మందలింపు ధ్వనించింది.

"అది కాదు మామయ్యా..."

ఆమె మరేదో చెప్పబోతుంటే ఆయన చెయ్యెత్తి ఆపాడు.

"సినిమా హీరో కావడమంటే డిగ్రీపరీక్ష పాస్ కావడం అనుకుంటున్నావా? డిగ్రీ పరీక్షయితే కష్టపడి పాస్ కావచ్చు కాని సినిమా హీరో కావడమన్నది కష్టానికి సంబంధించినదే కాదు. అది అదృష్టానికి సంబంధించినది కూడా...! అయినా మావాడు హీరోలానే ఉంటాడుకదా?"

"హీరోలా ఉండడమే కాదు. నిజంగా సినిమా హీరో కావాలి. తెలుగులోనే కాదు, హిందీ సినిమాల్లో కూడా నటించి బావ





భారతదేశమంతా వెలిగిపోవాలి. మామయ్యా! మన థియేటర్‌లోనే బావ నటించిన సినిమా మనమంతా చూడాలి"

అప్పటివరకూ తన కోడలుపిల్ల తనతో పరాచికాలాడుతుందేమోననుకున్నాడాయన. ఆమె సిన్సియర్‌గా, కలల్లో తేలిపోతూ చెబుతున్న మాటలు తొలిసారిగా వింటున్న ఆయనకు విభ్రాంతిలాంటిది కలిగించాయి.

"ఏమిటే... నిజంగా... నిజంగానే నువ్వు మీ బావ సినిమా హీరో కావాలని కోరుకుంటున్నావా? "

"కోరుకోవడమే కాదు. అది నా ఆశయం, ఆకాంక్ష!"

రఘురామయ్య వెంటనే అనేశాడు. "ఈ మాట నాతో అంటే అన్నావుగానీ, ఇంకెవరితోనూ చెప్పకు. 'ఈమెగారికి మొగుడు సినిమా హీరో కావాలని కోరికట' అని నవ్వి పోతారు"

ఆయన మాటల్లో మందలింపు ధ్వనించడంతో రాజేశ్వరి మరేం మాట్లాడలేదు. అప్పుడే బుకింగ్ క్లర్క్ లోపలికి వచ్చాడు. రఘురామయ్య కుర్చీలోనుండి లేచి బీరువా తాళం తెరిచి చిన్నపెట్టె బయటకు తీశాడు. అందులోనుండి టిక్కెట్స్ తీసి అతడికి ఇచ్చాడు. ఆయన ఆపని చేస్తుండగా రాజేశ్వరి కాస్త తలవంచి గేటువైపు చూసింది. అరుణ్ వస్తున్న జాడ కనిపించలేదు. ఆమెకు కొద్దిగా విసుగనిపించింది.

"బావ ఇంకా రాడేంటి? "

టిక్కెట్లు తీసుకున్నాక బుకింగ్ క్లర్క్ అడుగుతున్నాడు. "సార్! చిల్లరుంటే కొంత ఇవ్వండి. బుకింగ్‌లో చిల్లర సమస్యయిపోయి గొడవయిపోతుంది"

రఘురామయ్య మరోసారి పైకిలేచి బీరువాలోనుండి చిల్లరడబ్బులు తీసి లెక్కపెట్టి అతడికి అందించాడు. అతడు వెళ్ళిపోయాడు.

రాజేశ్వరి అంతలోనే మరోసారి గేటువైపు చూసింది. అది గమనించాడు రఘురామయ్య. "ఏమిటే నిమిషానికోసారి గేటువైపు చూస్తున్నావ్? నీ ఫ్రెండ్స్ ఎవరైనా వస్తానన్నారా ఏంటి? "

ఆమె తల అడ్డంగా ఆడించింది. "ఫ్రెండ్స్ కాదులే మామయ్యా"

"మరి? "

రాజేశ్వరి సిగ్గుపడింది. "ఎవ్వరూ రావట్లేదులే" అంది బుంగమూతి పెడుతూ.

ఆయనకు అనుమానం వచ్చింది. "అబద్ధం చెప్పకే రాజీ! ఎవరొస్తున్నారో చెప్పు...!"

ఆమె మరెటో చూపులు మరల్చుకుంది.

"...కొంపదీసి మీ బావ వస్తానని అనలేదుకదా."

ఆమె ఆయనవైపు చూడకుండానే తలాడించింది.

"సరయితే! కాసేపు కూర్చుని ఉండు. నేనలా ప్రొజక్షన్ రూమ్‌లోకి వెళ్లొస్తాను"

ఆమె తలాడించింది. ఆయన వెళ్ళిపోయాడు.

చీకటి పడుతోంది. టూరింగ్ టాకీసుల్లో చీకటి మొదలయ్యాకే సినిమా మొదలవుతుంది.

ఆమె కుర్చీలో కూర్చోలేకపోయింది. గేటువైపు ఎన్నిసార్లు చూడాలి? ఎన్నిసార్లు చూసినా తను రాడేం? ఆమెకు ఎదురుచూపులు చూసి చూసి చిరుకోపం తెచ్చుకునే స్థితి మొదలయింది.

లౌడ్‌స్పీకర్‌లో పాట రావడం ఆగిపోయింది. అంటే సినిమా మొదలు కాబోతున్నదన్నమాట.

మరికాసేపటికి రఘురామయ్య ఆఫీసుగదిలోకి వచ్చి ఆమెను చూసి అడిగాడు.

"అరుణ్ ఇంకా రాలేదూ? "

"రాలేదు మామయ్యా"

"నేను ఇక్కడికొచ్చేముందు వాడు ఇంట్లో కూడా కనిపించలేదు. అంటే... ఒకవేళ బొమ్మలు గీయడానికి ఎక్కడికో వెళ్ళిపోలే

దుకదా? లేకపోతే వాడు మాట చెప్పాక రాకుండా ఉండడు"

ఇప్పుడిప్పుడే ఆమెకూ ఆ అనుమానమే వస్తూ ఉంది.

"సరే! వాడు రాకపోతే పోయింది. నువ్వెళ్ళి హాలులో కూర్చోపో" చెప్పాడాయన.

"వద్దులే మామయ్యా. తను వచ్చాకా వెళ్తాను"

ఆమె మరికాసేపు ఎదురుచూసింది. అతడు రాలేదు. సినిమా మాత్రం మొదలయిపోయింది. రఘురామయ్య మరోసారి చెప్పాడు. ఆమె తల అడ్డంగా ఆడించాక అన్నాడు.

"పోనీ నేనూ వచ్చి నీతో కూర్చోనా? "

"వద్దులే మామయ్యా! నాకు సినిమా చూసే మూడ్ కూడా పోయింది. నేను వెళ్తాను"

రఘురామయ్య వారించబోయాడు. ఆమె వినిపించుకోలేదు. "వెళ్తాను" అనే మాటే రిపీట్ చేయసాగింది. ఆయనకు అర్థమయింది. అలా అంటోందిగానీ, రాజేశ్వరి మనసులో చాలా బాధపడుతోంది.

ఆమె ఆఫీసులోనుండి బయటకు నడుస్తుంటే ఆయన ఆమెవైపు జాలిగా చూశాడు.



విసురుగా గేటు తీసుకుని లోపలికొస్తున్న రాజేశ్వరిని మొదట చూసింది శ్వేత.

రాజేశ్వరి ఎప్పుడోగాని ఆ ఇంటికి రాదు. ఆడపిల్ల కాబట్టి రేపోమాపో 'అక్కడికే' రావలసిన పిల్ల కాబట్టి కొంత బిడియం ఉండడం సహజం. అయితే 'అరుణ్'మీద వచ్చిన కోపం ఆమెను తిన్నగా ఆ ఇంటికి వచ్చేలా చేసింది.

ఆమెను చూడడంతోనే శ్వేత చిరునవ్వుతో ఎదురొచ్చింది. "వదినగారేదో చిరుకోపంతో వస్తున్నారు. ఆ కోపం ఎవరిమీద తల్లీ? నామీద కాదుకదా? "

"నీమీద కాదులే" వెంటనే చెప్పింది రాజేశ్వరి.

"బతికిపోయాను. వదినగారికి కోపం తెప్పించేపని ఏం చేశానో? రేపటి నా భవిష్యత్ ఏమిటో అని హడలిపోయాననుకో"

రాజేశ్వరి ఆ మాట వినిపించుకోకుండానే "ఇంతకీ ఆయన గారెక్కడ? " సీరియస్‌గా ప్రశ్నించింది.

ఆమె ఎవరిని అడిగిందో శ్వేతకు తెలుసు. అయినా ఆమెను ఉడికించాలని అంది. "ఎవరూ? మా నాన్నగారా? ఆయన సినిమాహాలు దగ్గరకెళ్ళారు. తమరక్కడికి వెళితే తప్పక దొరుకుతారు"

"నేనడిగేది మామయ్యను కాదు. మీ అన్నయ్యను"

"ఓహో అన్నయ్య గురించా? " అని కొద్ది సెకన్లు ఆలోచించుకుంటున్నట్లుగా తల పైకెత్తి ఆకాశంలోని చంద్రుడిని చూశాక తలదించి చెప్పింది "మధ్యాహ్నం అనగా తన సరంజామాతో బయటకెళ్ళారు"

అప్పటివరకూ ఆమెలో కదలాడింది ఉక్రోషమే. ఎప్పుడయితే అతడు తనని పూర్తిగా మరిచిపోయి, కేవలం బొమ్మలు గీసుకోవడం కోసం వెళ్ళిపోయాడని నిర్ధారణ అయిందో అప్పటివరకూ ఆపుకున్న దుఃఖం ఇక ఆగలేదు. కళ్ళలో నీళ్ళు చిప్పిల్లాయి.

రాజేశ్వరి కళ్ళు చెమ్మగిల్లటం గమనించిన శ్వేత తడబడింది. "ఏమిటి వదినా? ఏమయింది? అన్నయ్యా..." ఆ తర్వాత ఏమడగాలో ఆమెకు అర్థం కాలేదు.

ఆమె డగ్గుత్తికతో చెప్పింది. "మీ అన్నయ్య సినిమాకొస్తానంటే ఇప్పటివరకూ మన హాలు దగ్గర తనకోసం వెయిట్ చేసి చేసి... విసుగొచ్చి ఆయనని పట్టుకుని నాలుగు దులిపేద్దామని ఇలా వచ్చాను"

చివరిమాట వచ్చేసరికి దుఃఖం కాస్తా ఆవేశంగా మారింది.

శ్వేత ఆమె భుజంమీద ఆప్యాయంగా చెయ్యివేసి, "వదినా" అంది.

రాజేశ్వరి ఒక అడుగు ముందుకేసి అడిగింది "మీ అన్నయ్య ఎక్కడ? "

"వదినా! అన్నయ్య మధ్యాహ్నం వెళ్ళాడు. తను స్టాండ్ అవీ పట్టుకెళ్ళాడు కాబట్టి, ఊరు చివర ఎక్కడో తన లోకంలో తను మునిగిపోయి ఉంటాడని అనుకుంటున్నాను"

రాజేశ్వరి మరో అడుగు ముందుకు వేయకుండా ఆగిపోయింది. ఇద్దరి మధ్య కొద్దిక్షణాల నిశ్శబ్దం.

"రా వదినా లోపలికెళ్దాం" శ్వేత ఆమె చెయ్యి పట్టుకుని ముందుకు అడుగు వేయబోతుంటే రాజేశ్వరి ఆ చేతిని విడిపించుకుంది. చప్పున వెనుతిరిగి వడివడిగా గేటు దాటింది.

★ ★ ★

ఓవర్ డ్యూటీ చేసుకునే అధికారమే తనకుంటే, సూర్యుడు ఖచ్చితంగా పశ్చిమకొండల్లో కుంగిపోయి ఉండేవాడు కాదు. ఆ కుర్రాడి ఏకాగ్రతను, దీక్షను పట్టుదలను కళ్ళింతలు చేసుకుని చూడాలనే అనుకున్నాడు.

సూర్యుడున్నంతసేపూ బిక్కు-బిక్కుమంటూ ఎక్కడో దాక్కుని ఉన్న చంద్రుడు ఒక్కసారిగా ఒళ్లు విదిలించుకుని డ్యూటీ కర్ర చేతబట్టుకుని ఆకాశంమీద తళుక్కుమన్నాడు. అప్పుడే ఆయన ఆ కుర్రాడిని చూశాడు. చాలా ముచ్చటేసింది.

నాలుగయిదు గంటలుగా ఆ కుర్రాడు అలాగే నిలబడి ఉండొచ్చనిపించింది. అప్పుడప్పుడు అతడు తలతిప్పి పరిసరాలను చూస్తున్నాడుగానీ, ఆ చూపులు పరిసరాలను పరిశీలించడం లేదు. పరిశీలించి ఉంటే సూర్యుడు కుంగి, తను పైకొచ్చిన విషయం అతడికి తెలిసేది. సూర్యుడు కుంగినా వెన్నెల వెలుగు లోకమంతా పరుచుకోవడంతో అతడి పనికి ఆటంకం లేకపోయింది. అతను చేస్తున్నపని డిస్టర్బ్ కాకపోవడంతో అతడు ఆ పనిలో లీనమయి, తన్మయత్వం పొందుతూ తనను తాను మరచిపోవడమే కాదు, లోకాన్నే మరచిపోయాడు.

చంద్రుడు అప్పుడు చూశాడు ఆ అమ్మాయిని. కాస్త ఆశ్చర్యపడ్డాడు. అరే! ఆమె ముఖంలో ఇద్దరు సూర్యులు కనిపిస్తున్నారేంటి? రాత్రిపూట సూర్యదర్శనమే విభ్రాంతి కలిగిస్తుంటే, అందులోనూ ఇద్దరు సూర్యులు, అసలిది ఎలా సాధ్యం? ఆయన ఆశ్చర్యాందోళనలతో మరింత పరిశీలగా చూడగా అప్పుడు అర్థమయింది. ఇద్దరు సూర్యులు కారు... ఆమె కళ్లు. ఆయన ఆశ్చర్యంగా చూస్తుండగానే ఆమె అతడి దగ్గరగా వెళ్ళింది.

అతడు తలతిప్పి చూడలేదు. కుంచెను రంగులో ముంచుకుని కేన్వాస్‌మీద అద్దుతున్నాడు.

ఆమె పొడిదగ్గు దగ్గింది. అతడికి వినిపించలేదు.

ఈసారి గొంతు కాస్త పెద్దది చేసి దగ్గింది.

ఊహుఁ!... అతడు తన లోకంలో తానున్నాడు.

సినిమాహాలులో ఎంతోసేపు ఎదురుచూడడం... ఇష్టమయిన సినిమా చూడలేకపోవడం, తన మనసులోని కోరిక రఘురామయ్యతో చెబితే ఆయన నిరుత్సాహపరచడం... అన్నీ అన్ని సంఘటనలూ... ఆమెను విచక్షణ మరచిపోయేలా చేశాయి. జీవితంలో ఆమెకు అంత కోపం ఎప్పుడూ రాలేదు. అందులోనూ, తన బావమీద తనకు కోపం రాగలదన్నది ఆమె ఊహకే అందని విషయం. ఆమె తనువు మరచిపోయింది. తనేం చేస్తోందో ఆమెకే అర్థం కాలేదు.

రాజేశ్వరి వంగి రెండు చేతుల్లోనూ రెండు రంగుడబ్బాలను తీసుకుని కేన్వాస్‌కేసి విసిరింది. చంద్రుడు ఆ దృశ్యం చూడలేనట్టు మబ్బుల చాటుకి తప్పుకున్నాడు.

తల్లి ఒడిలో హాయిగా నిద్రపోతూ కలల ప్రపంచంలో గంధర్వబాలలతో ఆడుకుంటున్న పసికందు పక్కనే పెద్ద శబ్దమయితే కలలు చెదిరి, అదిరిపడి ఈ లోకంలోనికి వచ్చినట్టు... అతడు ఈ లోకంలోకి వచ్చాడు. సెకను... రెండు సెకన్లు... పది సెకన్లు అసలు ఆ దృశ్యం నమ్మలేనట్టు చూశాడు. ఆ తర్వాత తలతిప్పి ఆమెకేసి చూశాడు. ఆమె ఎద ఎగిరెగిరిపడుతుండగా రొప్పుతోంది.

అతడు చివరిసారిగా కేన్వాస్‌కేసి తదేకంగా కొద్దిక్షణాలు చూశాడు. అప్పుడే ఆమె ఏడుస్తూ వెళ్ళి ఓ చెట్టు మొదట్లో కూర్చుంది.

అరుణ్ కళ్ళముందు కదలాడిన ప్రపంచం మెల్లగా కరిగిపోయింది. ఆమె ఏడుస్తూ అతడి కనులముందు నిలిచింది. అప్పుడు గుర్తొచ్చింది అతడికి- 'తను సినిమాకొస్తానని ఆమెకు ప్రామిస్ చేయడం, ఈ లోకంలో పడి చేసిన ప్రామిస్ మరచిపోవడం...' అతడికి ఆ క్షణంలో తన 'కళ' వృధా అయినందుకు కోపం రాలేదు. కొద్దిగా గిల్టీ ఫీలింగ్‌తోపాటు ఆమెమీద జాలేసింది.

అతడు ఆమెవైపు రెండడుగులు వేశాడు. ఆమెముందు మోకాళ్లమీద కూర్చుని ఆప్యాయంగా భుజంమీద చెయ్యివేశాడు.

"తాకకు... నన్ను తాకకు..." చప్పున అతడి చేతిని విదిలించేసిందామె. పైపెచ్చు అతడి స్పర్శనే భరించలేనట్టు మరింత ముడుచుకుపోయింది.

ఒక్కక్షణం... నిశ్శబ్దం... భయంకరమైన నిశ్శబ్దం.

వేటగాడి శరాఘాతానికి విలవిల్లాడిన లేడిపిల్లలా మారిపోయింది అతని మనసు. ఊహించని సంఘటన ఊహాతీతంగా మారింది. అతని మనసుకు ఆమె మాటల శరాఘాతాలు వాడిగా తగిలాయి.

ఆవేశం మనిషి విచక్షణని హరించివేస్తుంది. ఈ క్షణం తను ఏది చెప్పినా రాజీ వినదు. తనతో రాజీ పడదు. ఆమె వెక్కిళ్ళు స్పష్టంగా వినిపిస్తున్నాయి. చిత్రంగా ఆమె మీద తనకి కోపం రాలేదు. ఆమె బాధ అతనికర్థమైంది. ఆమె ఆవేశం అతనికి అవగతమైంది.

మౌనంగా వెనక్కి తిరిగాడు. వెన్నెల వెలుగు అతని మొహంమీద పడి దాని తాలూకు నీడ కిందపడిన కాన్వాసుమీద పడింది. ఆకాశంలా నిర్మలంగా ఉన్న కాన్వాసుమీద అందమైన చందమామలా అతను వేసిన పెయింటింగు, ఆ చందమామమీద మచ్చలా రంగులు చిలికి ఒలికిపోయాయి.

రాజేశ్వరి కొద్దిసేపు మౌనంగా వుంది. బావ తన దగ్గరికి వచ్చి సారీ చెబుతాడేమోననుకుంది. కానీ అలాంటిదేమీ కనిపించకపోయేసరికి తలెత్తింది. అరుణ్ వీపు భాగం కనిపిస్తోంది. అతను కేన్వాసువంకే చూస్తున్నాడు. అతని మొహం అటువైపు తిరిగి ఉండడంవల్ల అతని ఫీలింగ్స్ ఏమిటో తెలియటంలేదు. ఆమె విసురుగా లేచింది.

"చూడు... బాగా చూడు బావా... ఆ కాన్వాసు... ఆ రంగులు... ఆ ప్రకృతి... ఇవేగా నీక్కావలసినవి. గోడకి సున్నం వేసినట్టుగా కాన్వాసుమీద బొమ్మలేయడం తప్ప నీకింకేం తెలుసు. నీకోసం ఓ ప్రాణి ఎదురుచూస్తుందని నీకెలా తెలుస్తుంది? అయ్యో... ఆ ప్రాణి తనకోసం ఎంతగా తపించిపోతోందోనన్న తపన నీకుంటేగా? చలనంలేని కాన్వాసుమీద చలనంలేని బొమ్మల్ని వేయడం తప్ప నీకేం చాతనవుతుంది..." ఆమె ఒక్కక్షణం ఆగింది ఊపిరి పీల్చుకోడానికన్నట్టు.

"భయం... నీకు బయట ప్రపంచంలో బతకాలంటే భయం. ఈ పోటీ ప్రపంచంలో పోటీపడలేనన్న భయం... దానికి తోడు అభద్రతాభావం. నీమీద నీకే నమ్మకం లేదు. అందుకే ఈ పల్లెనే గబ్బి

లంలా పట్టుకుని వేలాడుతున్నావు. తల్లిదండ్రుల సంపాదనతో పొలంపనులు చేస్తూ మట్టిపిసుకుతూ నీదైన పిచ్చిప్రపంచంలో బొమ్మలేస్తూ ఏదో ఓ బతుకు బతికితే చాలనుకుంటున్నావు. ప్రపంచం ఎంత ముందుకు వెళ్తోందో, ఎలా మారిపోతోందో నీకు అక్కర్లేదు. నీ బతుకు భయం. నీ అభద్రతా భావం. నీ పిచ్చి ప్రపంచం. ఇంతే... ఇంతేకద బావా నీక్కావలసింది?

నీలా పెద్ద చదువులు చదువుకోలేని పల్లెటూరి అమ్మాయినే, పట్నంలో ఓ గుర్తింపుతో నీతో కలిసి బ్రతకాలనుకునే నీ మరదలి బాధ కూడా నీకర్థం కాదు.. అంతా నా ఖర్మ... ఛీ...!"

ఆమె బరస్టయింది. ఇన్నాళ్ల ఆవేదన ఆవేశంగా మారి, విచక్షణని వదిలి ఇరిటేట్ అయింది. దాని తాలూకు ప్రభావం కానీ, పర్యవసానం గానీ ఆమె ఆలోచించలేదు. ఆవేశం మనిషిలోని ఆలోచనని సమూలంగా తుడిచిపెడుతుంది.

ఒక్కోమాట తుపాకీ తూటాలా అతని హృదయాన్ని తాకి గాయం చేస్తుంటే, ఆ గాయానికి స్రవించే బాధనే రుధిరాన్ని చూస్తూ కూడా నిర్వికారంగా అలాగే ఉండిపోయాడు. ఎప్పుడూ అమాయకంగా కనిపించే తన మరదలిలో ఇంత ఆవేశం ఉందని అతనికిప్పుడే తెలిసింది.

ఆవేశం... ఆవేదన ఈ రెండే మనసులో భావాలను బయటకు కక్కేస్తాయి.

విసురుగా ఓ అడుగు ముందుకు వేసిన రాజేశ్వరి కాన్వాసు కాలి వేలికి తాకడంతో కోపంగా కాన్వాసుమీద కాలు వేయబోయి అప్రయత్నంగా ఆగిపోయింది. అక్కడి కాన్వాసుమీద కనిపించిందో దృశ్యం.

అబ్బురమై అద్భుతమై ఆర్ద్రమై నిలిచినట్టనిపించింది కాన్వాసుమీద తన బొమ్మ... నిజంగా తన బొమ్మే! ప్రాణమున్న తనని ఆ కాన్వాసుమీద బొమ్మగా మార్చి దానికి ప్రాణం పోసినట్టుగా. ఆకాశంలో నిర్మలంగా ఉన్న కాన్వాసుమీద తన చిత్రం. చిత్రంగా ప్రాణమున్నట్టే... తను కోపంలో విసిరిన రంగులు తన ఆవేశానికి గుర్తులుగా, ఆ కాన్వాసుమీద మచ్చల్లా.

కొందరు ప్రేమను మాటల్లో వ్యక్తం చేస్తే మరికొందరు మనసుతో వ్యక్తం చేస్తారు. ఆ మనసెంత అందంగా ఉంటుంది?

తన బావంత అందంగానా!

ఆమె తల విదిల్చింది. సన్నటి కన్నీటి మెరుపు ఆమె కనురెప్పల మధ్య. ఒక్క క్షణం బావవైపు చూసింది. సూటిగా అతని వైపు చూడలేకపోయింది. బావముందు నిలబడే ధైర్యం లేకపోయింది. పశ్చాత్తాపం ఆమె మనసును ప్రక్షాళన చేస్తుంటే వేగంగా పరిగెత్తింది.

ఒంటరిగా తన గదిలో గుండెబరువు దించుకోవాలి. కనుకొలకుల మధ్య ప్రవహించే గంగతో బావకు అభిషేకం చేయాలి.

పరిగెడుతున్న మరదలివైపు చూసి ఓ నిట్టూర్పు విడిచి కాన్వాసును, రంగుల డబ్బాలను తీసుకుని ఇంటివైపు నడిచాడు అరుణ్.

★ ★ ★

గోడ గడియారం మత్తుగా పన్నెండు గంటలు కొట్టింది. అరుణ్ బెడ్‌మీద అటూ ఇటూ పొర్లాడాడు. ఊహు... నిద్రాదేవత తనను కరుణించేలా లేదు.

అతడు దుప్పటి ముసుగు తొలగించి, బెడ్ దిగి కిటికీ దగ్గరగా నడిచాడు. ఓ ఏటవాలు చంద్రకిరణం అతడిని ఆప్యాయంగా స్పృశించింది. కిటికీ పక్కనే ఉన్న సన్నజాజి తీగె అతడికేసి జాలిగా చూసింది.

అరుణ్ కిటికీలోంచి బయటకు చూస్తున్నాడేగానీ, చూపులు పరిసరాలను పరికించడం లేదు. కనులముందు అదే దృశ్యం కదలాడుతోంది. అదే దృశ్యం. రాజేశ్వరి తన కిష్టమయిన రాజి కేన్వాస్‌మీదకు రంగులు విసురుతోంది. కనులముందు



దృశ్యం చెదిరిపోయిందేగానీ, మనసులోని బాధ సుడులు తిరగడం ఆగిపోలేదు.

అయితే బాధ భరించలేనిదయినా, ఆవేశం మెదడుని స్తంభింపచేయలేదు. బాధలోనుండి అంతర్మథనం మొదలయింది. ఆ అంతర్మథనం ఆలోచించుకునేలా చేస్తుంది. ఆలోచన తననుతాను పరిశీలించుకునేలా, పరిశోధించుకునేలా చేసింది.

తను నిజంగా చాతకానివాడా? కాదు... ఆ విషయం తనకు తెలుసు. అసలు తన ఉద్దేశంలో మనిషి తలచుకుంటే సాధించలేనిదేదయినా ఉందా? లేదుగాక లేదు. కాకపోతే కొన్ని ఇష్టాలు, అభిప్రాయాలు... సిద్ధాంతాలు మనిషిని ఒక పరిధిలోనే ఉండిపోయేలా చేస్తాయి. ఆ పరిధిలో ఉండే మనిషి తాము కోరుకునేవి సాధించలేకపోతే అతడు చాతకానివాడని... అసమర్థుడని నిందించడం అందరూ చేసేపనే.

తనకిష్టమైన రాజేశ్వరి కూడా తనను ఏమాత్రం అర్థం చేసుకోకుండా అలా భావించడమే తనను విపరీతమైన బాధకు లోను చేస్తోంది. తనకి ఈ పల్లె అంటే ఇష్టమని, ఈ పరిసరాలూ, వాతావరణం అంటే ప్రాణమని ఇంతకాలం కలిసి తిరిగినా ఆమె తెలుసుకోలేకపోవడం తన దురదృష్టం. పైగా ఆ పిచ్చిపిల్ల తనను సినిమా హీరోగా చూడాలనుకుంటుంది. సినిమా హీరో కావడమే మైనా పెద్ద కష్టమయిన పనా? తలచుకుంటే మనిషి ఏమయినా చేయగలడు. ఏదయినా సాధించగలడు. తనమీద తనకా నమ్మకమూ ఉంది.

ఆమె తనను చాతకానివాడని నిందించినందుకు ప్రతిగా ఆమె కోరుకున్న విధంగా తను మారి ఆమె ముందు నిలిస్తే...

ఆ ఊహే అతడికి చాలా ఆనందాన్నిచ్చింది. నిజంగా నిజంగా తను 'సినిమా హీరో' కావడం కష్టమయిన పనా?

కాదనే తను గట్టిగా నమ్ముతున్నాడు. మనిషి తన స్థితి మార్చుకోవడానికి కృషిచేయాలి. పట్టుదలగా ప్రయత్నించాలి. అనితరసాధ్యాన్ని, నిరంతర శ్రమతో కైవశం చేసుకోడానికి మొక్కవోని ధైర్యం చాలు.

అతడో నిర్ణయానికి వచ్చాడు.

ఆ నిర్ణయం అతడి పెదాల మీద చిరునవ్వు ఉదయించేలా చేసింది.

అతడి చిరునవ్వు చూసి అప్పటి వరకూ అతడికేసి జాలిగా చూసిన సన్నజాజి తీగె ఆనందంగా కదలాడింది.

★ ★ ★

ఉదయమే అతడు ఆ ఇంటివైపు అడుగులేసాడు. ఇంటిముందు నిలబడి పాలేరుకు పొలం పనులు గురించి కాబోలు వివరిస్తున్న ఈశ్వరయ్య అరుణ్‌ని చూసి పలకరింపుగా నవ్వాడు. పాలేరుకు ఏదో చెప్పి పంపేసి, అతడి వైపు తిరిగి,

"రారా అరుణ్, నిన్న కూడా నాకోసం చాలాసేపు ఎదురు చూశావట కదా?" అన్నాడు.

అరుణ్ నిలువుగా తలాడించాడు. ఇద్దరూ వరండావైపు నడిచారు. ఆయన ఓ కుర్చీలో కూర్చుని "కూర్చోరా" అన్నాడు అతడితో.

అతడికి ఆయన ఎదురుగా కూర్చోవాలనిపించలేదు. లోపలకెళ్లి రాజేశ్వరి ఎదుట నిలబడి తన నిర్ణయం చెప్పేయాలనిపించింది. కాని ఆయనతో ఒక్కమాట మాట్లాడకుండా లోపలికెళ్లిపోవడం బాగుండదని అక్కడే కూర్చుండిపోయాడు.

"ఏమిట్రా విశేషాలు?"

"ఏమున్నాయి మామయ్యా?"

"ఈమధ్య ఓవారం రోజులుగా కనిపించలేదు?"

"వస్తూనే ఉన్నాను మామయ్యా! మీరే కనిపించలేదు"





"అలాగా" అని క్షణమాగి చెప్పారాయన. "ఈమధ్య పొలం పనులు ఎక్కువగా ఉండి తీరిక లేకుండా పోయిందిరా. ఆఖరికి మధ్యాహ్నం భోజనం కూడా పొలంకే తెప్పించుకుంటున్నాను".

"తెలుసు" అన్నాడు అరుణ్.

అతని గొంతు వినిపించి రుక్మిణమ్మ హాలులోనుండి వాకిటివరకూ వచ్చి అరుగు వైపు తొంగిచూసింది. అతడిని చూసి కొద్దిగా ఆశ్చర్యపడింది. కారణం సాధారణంగా అతడు అంత ఉదయాన్నే ఆ ఇంటి వైపు రాడు. బహుశ ఏదయినా పనిఉండి వచ్చాడేమో అనుకుందామె.

ఆమెను చూడడంతోనే అరుణ్ నవ్వుతూ అడిగాడు, "రాజీ ఏంచేస్తోంది అత్తమ్మా? "

"రాత్రి సినిమాకని వచ్చి మధ్యలోనే ఇంటికొచ్చేసింది కదా? ఆరోగ్యం బాగోలేదని రాత్రి భోంచేయనూలేదు. ఉదయం నుంచీ బెడ్ దిగనూలేదు"

అతడి మనసులో బాధ సుడులు తిరిగింది. అసలు కారణం అర్థమయిందిగానీ, మామయ్యను విదిలించుకుని లోపలికి వెళ్లడం వీలుకాలేదు. "అలాగా" అన్నాడు.

"నాన్న నా గురించి మీ దగ్గర బాధపడ్డాడా? ఎందుకు? " అడిగాడు ఈశ్వరయ్య వైపు చూసి.

"అదేరా... నీ చదువు పూర్తయి సంవత్సరమయిపోయిందికదా?... మరి ఉద్యోగ ప్రయత్నమేమీ చేయకుండా కాలం గడిపేస్తున్నావని తను బాధపడిపోతున్నాడు...."

అతడి ముఖం వెలవెలబోయింది. ఆయన మాత్రం అతడి ముఖంలోనికి చూడకుండా తలదించుకుని మాట్లాడసాగాడు.

"అదికాదురా! నేనుగానీ, మీ నాన్నగానీ నిన్ను బాధపెట్టాలనే ఉద్దేశ్యంతో మాత్రం ఇలా మాట్లాడడంలేదురా. కాలం మారిపోయింది. ఈ ప్రపంచంలో పోటీపడుతూ నెగ్గుకురావాలి. అలాకాకుండా నాకీలోకంతో సంబంధంలేదు. నేను నాలోకంలో ఉంటాను. అంటే, అది నీకు ఆత్మసంతృప్తి కలిగించొచ్చేమోగానీ, చూసేవారికి అది నీ చాతగాని తనమే అనిపిస్తుంది..."

"చాతగానితనం...." ఆ పదమే రాత్రి రాజేశ్వరి నోటివెంట విన్నాడు. మళ్ళీ ఇప్పుడు తన మామయ్య నోటివెంట... నిజంగానే వీళ్ళంతా తనను చేతగానివాడని అనుకోవడంలేదుకదా? ...

అప్పటికే అతడో నిర్ణయానికి వచ్చి ఉన్నాడు. తను తీసుకున్న నిర్ణయం తప్పు కాదనిపించిన క్షణం అది.

ఆయన మరేదో చెప్పబోతుంటే అతడు చెయ్యి చూపించి చెప్పాడు "ఆగండి మామయ్య".

అల్లుడివైపు చూస్తూ తను చెప్పదలచుకున్నది చెప్పలేనని తెలిసీ, మరో వైపు చూస్తూ మాటలు కొనసాగించిన ఈశ్వరయ్య అతడి గొంతు వినపడి తలతిప్పి ముఖంలోనికి చూశాడు.

అరుణ్ ముఖంలో తనింతకాలం ప్రశాంతత మాత్రమే చూసేవాడు. అయితే బిగించి ఉన్న ఆ పెదవులు ఇప్పుడు పట్టుదలను సూచిస్తున్నాయి. అతడి చూపులు కాసింత కఠినత్వాన్ని ప్రతిఫలింపచేస్తున్నాయి. ఈశ్వరయ్యకు ఆశ్చర్యమనిపించింది. ఆయన అరుణ్ ముఖంలోకి ఆశ్చర్యంగా చూస్తుండిపోయాడు. ఆయన మెల్లగా "ఏమిట్రా" అన్నాడు.

"నేను రేపే సిటీకి వెళ్ళబోతున్నాను" చెప్పాడు అతడు.

"సిటీకి వెళ్ళబోతున్నావా? ... ఎందుకు? ... ఉద్యోగ ప్రయత్నమా? "

"కాదు"

"మరి? వ్యాపార ప్రయత్నమా? "

అతడు జవాబు చెప్పలేదు. " నేను రాజీని పలకరించివస్తాను" అంటూ కుర్చీ లోంచి లేచి ఇంట్లోకి నడిచాడు.

అరుణ్ వెళ్తున్న వైపే కొద్దిక్షణాలు అలాగే చూస్తుండిపోయాడు ఈశ్వరయ్య. ఇంట్లోకి వెళ్ళిన అరుణ్ తిన్నగా రాజేశ్వరి గదిలోకి వెళ్లాడు.

రాజేశ్వరి అటువైపు తిరిగి పడుకుని ఉంది. రాత్రి తాలూకు ఆలోచనలు ఆమెను చుట్టుముట్టి ఉన్నాయి. 'ఒక్కక్షణం తన తొందరపాటు విలువ... బావ అనుభవించే మానసిక క్షోభా? ...తను తొందరపడిందా? ఎవరి ప్రపంచంలో వాళ్లు బ్రతికేహక్కు వాళ్ళకుంటుంది. తనకు సినిమా ప్రపంచం ఇష్టం. బావకు మరో ప్రపంచం ఇష్టం. తనను మారమని బావ ఎప్పుడూ అన లేదు. తను మాత్రం బావ మనసును గాయపరచింది. తనమీద బావకున్న ప్రేమను అపహాస్యం చేసింది.

నిజమే... బావ తన కోసం అందమైన పెయింటింగ్ వేస్తే, తన మనసులో ఉన్న తన రూపాన్ని బావ కాన్వాసుమీద వేస్తే తను దాన్ని కింద పడేసింది. ఇది తన తొందరపాటు కాదా? '

"రాజీ..." అరుణ్ పిలుపుతో కళ్ళు తెరిచింది. బావ మొహంలోకి చూసే ధైర్యం లేదు. మంచం దగ్గరికి వచ్చి మంచం చివరి అంచుమీద కూచొని మరదలి తల మీద చెయ్యేశాడు.

"రాజీ... కోపమా? " అనునయంగా అడిగాడు. ఆమె సమాధానం చెప్పలేదు.

"రాత్రి నాకు భోంచేయాలనిపించలేదు రాజీ... ఎందుకో అలాగే పడుకుండిపోయాను. రాత్రంతా నువ్వన్న మాటలే..."

రాజేశ్వరి కొద్దిగా కదిలింది. అతను కొనసాగించాడు.

"నాకు నీమీద కోపంలేదు రాజీ! ప్రేమ తప్పు!... ఆవేశం ఒక్కొక్కసారి మనసులోని భావాలను తప్పుదారి పట్టించి బయటకు గెంటించివేస్తుంది. అదిగో ఆ ఆవేశమే నన్ను నువ్వు తప్పు పట్టేలా చేసింది.... ఆలోచించాను రాజీ... రాత్రంతా ఆలోచించాను. నువ్వన్న దాంట్లోనూ నిజముంది. లేడిపిల్ల కోసం సీత రాముడ్ని అడగడం తప్పు కానప్పుడు ఓ చిన్న కోరిక కోరిన నా రాజీదీ తప్పుకాదు... నా ప్రపంచంలో నేను బ్రతకాలనుకున్నానేకానీ, నీ కలల ప్రపంచాన్ని ఓసారి నీకళ్ళముందు నిలిపి నీ కోరిక తీర్చాలన్న ఆలోచన రాలేదు. నీ కోరిక తీరుస్తాను రాజీ... తప్పకుండా తీరుస్తాను"

ఒక్కక్షణం నమ్మలేనట్టు...మరొక్కక్షణం ఆనందాన్ని దాచుకో లేనట్టు... ఇంకొక్కక్షణం బావగుండెల్లో తలపెట్టుకుని మన సారా కన్నీటితో బావని అభిషేకించాలన్నట్టు... కదిలి కరిగి... బావ గుండెల్లో ఒరిగిపోయింది మనసును తేలికగా చేసుకోడానికి.

తన గుండెలపై తలానించిన రాజీని పొత్తిళ్ళలోని పాపాయిని పదిలంగా పట్టుకున్నట్టు పట్టుకుని, "నాది బ్రతుకుభయం కాదు రాజీ... నా ప్రపంచంలో నేను బ్రతకాలనే తత్వం. ఎవరో ఏదో అనుకుంటారని... అనుకునే ఆ మనుషుల కోసం బ్రతకను. కానీ... ఇప్పుడు నా రాజీకోసం మాత్రం ఏదైనా చేస్తాను... నీ బావ తలచుకుంటే ఏదైనా సాధించగలడని నిరూపిస్తాను. నీబావేకాదు ఏ మనిషయినా కృషి చేస్తే సాధించలేనిదేమీ లేదని చాటిచెబుతాను"

ఆమె అర్థం కానట్టుగా అతడికేసి చూసింది.

"నేను సినిమా హీరోని అవుతాను"

కిటికీలోనుంచి ఉదయ సూర్యుని లేలేత కిరణం ఏటవాలుగా వచ్చి అతడిని తాకి




పరావర్తనం చెందుతోంది. ఆ గదిలో అటు నిటు తిరుగాడుతున్న గాలి ఆగిపోయి అతడి నోటినుండి వచ్చిన ఆ మాటల్ని శ్రద్ధగా ఆలకించింది.

రాజేశ్వరి మాత్రం ఇంకా... ఇంకా అత డిని నమ్మలేనట్టుగానే చూస్తోంది. అయితే ఆమె మనసులో ద్వైదీభావం, 'బావ తనతో జోక్ చేయడం లేదు కదా? ఈ ప్రపం చంలో ఏదయినా సాధించితీరుతాడు.'

"బావా! నువ్వు... నువ్వు నిజంగానే ఆమాట అంటున్నావా? "

"నిజంగానే! రేపే నేను హైదరాబాద్‌కి వెళ్ళబోతున్నాను"

అతడు ఆమెకు చెప్పదలచుకున్నది చెప్పే సినట్టు చప్పున వెనుదిరిగాడు. ఆ గదిలో నుండి హాలులోకి అడుగుపెడుతూ అటుగా చూసి ఆగిపోయాడు. ఆ గదికి కాసింత దూరంలో నిలబడి ఈశ్వరయ్య, రుక్మిణమ్మ తన వైపే చూస్తున్నారు.

ముందుకు పడబోయిన అడుగు ఆగిపో యింది. అతడు అక్కడే నిలబడిపోయాడు. ఆ చూపులు చూస్తే వారిద్దరూ తమ మాటలు విన్నారని అర్థమయింది అతడికి.

ఈశ్వరయ్య ఒక అడుగు ముందుకేశాడు.

ఇప్పుడు వారిద్దరి మధ్యదూరం రెండడు గులు మాత్రమే ఉంది.

"ఊహు! అయితే తమరు సిటీకి వెళ్లబో తున్నారు? తమరి మరదలు చాలాకాలంగా తమరినో కోరిక కోరుతోంది కాబట్టి తమరు ఆమె కోరిక తీర్చేటందుకు సినిమా హీరో కాబోతున్నారు... అంతేనా? "

అతడు ఆయనకేసి చూశాడు. ఈశ్వ రయ్య ముఖంలో ఏభావమూ కనిపించ లేదు. గొంతులో వ్యంగ్యం మాత్రం ధ్వని స్తోంది. అరుణ్ నిలువుగా తలాడించాడు.

గది బయట సంభాషణకు గదిలోనుండి బయటకొచ్చి తలుపుల దగ్గరే ఆగిపోయింది రాజేశ్వరి.

"నువ్వు సినిమా హీరోవి అయ్యాక నేనూ... మీ నాన్నా ఈ ఇళ్లలోనే ఉంటామా లేక ఊరి చివర పూరిగుడిసెలు వేసుకుని గంజినీళ్ళ కోసం అల్లాడి పోతుం టామా? ..."

అరుణ్ మాట్లాడబోయేంతలో రాజేశ్వరి హుషారుగా అంది. "బావ సినిమా హీరో అయ్యాక మనం ఈ ఇళ్ళలో ఎందుకుంటాం నాన్నా? సిటీలో పెద్ద బంగళా కొనేసి సొంత కారులో తిరుగుతూ ఉంటాం"

"అలాగా! సొంత విమానాల్లో తిర గమూ? నువ్వు కాస్త నోరు ముయ్యవే" ఆమెను కసురుకున్నాడు ఈశ్వరయ్య.

తండ్రి తనను కసురుకోవడం ఎప్పుడో గాని జరగదు. అందుకే ఆమె భయంతో ముడుచుకుపోయింది.

రుక్మిణమ్మకు మాత్రం వాతావరణం వేడె క్కబోతున్నట్టు అర్థమయింది. కానీ వారిద్ద రిమధ్యా జోక్యం చేసుకునే ధైర్యం ఆమెకు లేకపోయింది.

ఈశ్వరయ్య అల్లుడివైపు చూపులు తిప్పి "చెప్పరా! నువ్వు హీరోవి కావాలన్న తప నతో ఆ ఆస్తిమొత్తం అమ్మేసి మమ్మల్ని బికారుల్ని చేద్దామనుకుంటున్నావా? " సీరి యస్‌గా అడిగాడు.

అతడు బలంగా ఊపిరి పీల్చి వదిలాడు. "లేదు మామయ్యా! నేను ఇంట్లోంచి పట్టు కెళ్లే పెద్ద మొత్తంతో సిటీ చేరుకోవాలనుకో వడంలేదు. కేవలం... కేవలం పాకెట్ మనీతోనే సిటీ చేరుకుంటాను. సరేనా? "

ఈసారి ఈశ్వరయ్య ముఖంలో సీరి యస్‌నెస్ మాయమయింది. ఆయన అల్లు డికేసి కాస్త తదేకంగా చూశాడు. అంతలో ఏ అనుమానమో! మనసుని కదిలించిం దేమో పెదాల మీద వ్యంగ్యమైన చిరునవ్వు కదలాడేలా చేసింది.



"డబ్బులు లేకుండా సిటీకి చేరుకోవడం సరే, మరి సినిమా హీరోవి ఎన్నాళ్ళకవు తావ్? ఓ పదేళ్ళకవుతావా లేక పాతికేళ్ళు పడుతుందా? .... ఎందుకంటే నీలాగే హీరో కావాలని సినిమా స్టూడియోల చుట్టూ సంవత్సరాల తరబడి తిరిగేవారి గురించి నేనూ విని ఉన్నాను. నువ్వూ ఆ ప్రయత్నంలో ముసలివాడివైపోతే, మన రాజేశ్వరి అప్పటికి నెరసిన తలతో నీకోసం ఎదురుచూసే దృశ్యాన్ని మనసులో ఊహిం చుకుందామని..."

ఆయన అన్న మాటలు తన సమర్థతనే అనుమానిస్తున్నా అరుణ్ ముఖంలో కోపం కదలాడలేదు. ఓ జ్ఞానిలా, ఓ మౌనిలా కొద్దిక్షణాలు తనలోతాను ఆలోచించుకుని ఆ తర్వాత పలికాడు.

"ఒక్క సంవత్సరం... కేవలం ఒక్క సంవత్సరంలోనే నేను సినిమా హీరోగా మారి నేనేమిటో మీకు నిరూపిస్తాను"

ఆ ముగ్గురే కాదు. ఆ గదిలోని గాలి కూడా ఉలిక్కిపడ్డట్టు అనిపించింది. ఉదయ సూర్యుడు నెమ్మదిగా పైపైకి ఎగబ్రాకుతు న్నాడు. అతడు హాలు మధ్యలో నిలబడి ఉన్నాడు. అతడిచుట్టూ ఆ ముగ్గురూ... వారికి తెలుసు. అతడు ఎట్టి పరిస్థితు ల్లోనూ ఒక్క మాట... కనీసం ఒక్క మాట అధికంగా మాట్లాడడని! తను ఏదయినా మాట్లాడడమంటూ జరిగితే అది గుండెలో తులనుంచి వస్తుందనీ దాని వెనుక ఎంతో ఆలోచన ఉటుందనీనూ!

అయినా ఈశ్వరయ్య చాలా తెలివ యినవాడు. అతడిని రెచ్చగొట్టడం కోసం వ్యంగ్యంగా మాట్లాడాడు. అరుణ్ ఆ వ్యంగ్యమైన మాటలకు తొణకక పోయినా, ఒక నిర్ణయం ప్రకటించాడు. ఆ నిర్ణయానికి కొన్ని షరతులు తోడయితే అతడు పూర్తిగా తన పట్టులోనికి వచ్చినట్టు. ఇనుము కాలింది. కాలిన ఇనుమును తనకు అనుగు ణంగా మలచుకోవాలి.

ఆయన తనలో తాను అనుకుంటున్నట్టు అన్నాడు, "నీ మరదలి కోరిక తీర్చడంకోసం సిటీకెళ్ళి ఒక సంవత్సరంలో స్వయంకృషితో సినిమా హీరోవి అవుతావు. బాగుంది... ఇంతవరకూ... చాలా బాగుంది. మా తృప్తి కోసమో, అమ్మాయి ఆనందం కోసమో నువ్వు, సిటీకెళ్ళి సంవత్సరంపాటు ప్రయ త్నాలు చేస్తావ్! ఆల్ రైట్! అయితే ఆ ప్రయత్నాలు ఫలించకపోతే... ఆహా! కీడెంచి మేలెంచమన్నారు కదా పెద్దలు... ఒకవేళఅలా జరిగితే? "

అతడు చాలా స్థిరంగా పలికాడు. "నేను హీరోనయి తీరుతాను"

"మనిషికి ఆ నమ్మకం ఉండడం మంచిదే" ఈశ్వరయ్య ఈసారి నింపాదిగా అడిగాడు. "ఒకవేళ కాలేకపోయావనుకో, అప్పటి సంగతి చెప్పు... ఈ పల్లెకు వచ్చేసి మళ్ళీ బొమ్మలు గీసుకుంటూ ఉండిపో తావా? .... అంతేనా? "

అరుణ్ పెదవి విప్పబోయేంతలో పక్క నుండి వినిపించింది "బావని తక్కువగా అంచనా వేయకండి. బావ అనుకున్నది సాధిస్తాడు"

ఈశ్వరయ్య చప్పున కూతురివైపు తిరి గాడు. "నిన్ను నోర్మూసుకోమని చెప్పానా?'' ఉరిమి చూశాడు.

రాజేశ్వరి తలదించుకుని మౌనంగా ఉండి పోయింది. తన బావ సిటీకి వెళ్ళి హీరో అవుతానని అంటుంటే సంతోషంగా పంప కుండా ఆయన అన్ని రకాలుగా మాట్లా డటం ఆమెకు కోపం కలిగిస్తోంది.

ఆయన ముందుచూపు ఆమెకేం తెలుసు.

అలా తెలుసుకో గలిగింది రుక్మిణమ్మ మాత్రమే. తన భర్త అరుణ్‌ని మాటలతో ఎటువైపు నడిపిస్తున్నాడో ఆమెకు అర్థమ యింది. ఎంతయినా ఇరవై సంవత్సరాల




# ప్రేరణ ముత్యాలు

★ అటు ధనవంతుడు కావడానికి లేదా ఇటు పేదవారు కావడానికి ఈ రెంటికీ సరైన సమయం యౌవ్వనమే.

-ఎడ్మండ్ బర్క్

★ ఒకరి గుణగణాలు పరీక్షించి చూడాలనుకుంటే అతనికి ఒకసారి అధికారం ఇచ్చి చూస్తే చాలు.

-అబ్రహం లింకన్

★ ఆత్మవిశ్వాసంతో కృషిచేస్తే మనిషి ఎక్కలేని ఎత్తులు లేవు. అందుకోలేని శిఖరాలు లేవు.

-అలెగ్జాండర్ పోప్

★ రేపటి పని ఈరోజు, ఈరోజు పని ఇపుడే చేయాలి.

-జవహర్‌లాల్ నెహ్రూ

★ స్నేహమనేది అన్నిచోట్ల ఉంటుంది. ఆఫీసులోనూ, ప్రేమవ్యవహారాలలోనూ తప్ప.

-షేక్స్‌పియర్

★ రాపిడి లేనిదే రత్నం ప్రకాశించదు. అలాగే కష్టాలను తట్టుకోలేని మానవుడు ఏనాటికీ పరిపూర్ణత పొందలేడు.

-చైనా సామెత

★ ఖర్చు పెట్టాక బాధపడే బదులు, ఖర్చు పెట్టడానికి ముందు పడే బాధను 'బడ్జెట్' అంటారు.

-వాల్

★ పేదలకు సేవచేయాలంటే పేదరికంతో నివసించాలి. పేదరికాన్ని చవిచూడాలి.

-మదర్ థెరిసా

★ తరువాత వచ్చే కోర్కెలను సంతృప్తిపరచడం కంటే తొలి కోర్కెలను అణచివేయడం చాలా సులభం.

-ఫ్రాంక్లిన్

★ మీకు ధనం విలువ తెలియాలంటే, అప్పు తీసుకోండి తెలుస్తుంది.

-ఫ్రాంక్లిన్

★ రక్తపుటేరులు పారించేదానికంటే, ఒక కన్నీటి బొట్టు తుడవడంలోనే గొప్పదనముంది.

-బైరన్

సేకరణ: నబెన్న




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయంబహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

......జూలై...... చతుర నవల ...... విజేత............

సమీక్షకుని పేరు : ..............................................

చిరునామా : ..............................................

..............................................

..............................................

..............................................

సాహచర్యం కదా?

అరుణ్ పలికాడు. "మామయ్యా! ఇప్పటి వరకూ నామీద నాకో నమ్మకం ఉంది. నేను చాతకాని వాడిని కాననీ, సమర్థుడినే అనీ అనుకుంటున్నాను. కేవలం నా ఇష్టాన్ని తీర్చుకుంటూ, ఆత్మసంతృప్తితో బ్రతకడంకోసమే ఈ పల్లెలో ఉన్నాను. ఇంతకాలం నా గురించి మీ అభిప్రాయం ఏదయినప్పటికీ నాకు అభ్యంతరం లేదు. అయితే మీరిప్పుడు నా సమర్థతని శంకించి రాజేశ్వరి భవిష్యత్ గురించి ఆలోచిస్తున్నట్లు తెలిసింది. కాబట్టి చెపుతున్నాను! రేపు నేను ఓడిపోతే నేను చాతకానివాడినని మీరనుకుంటున్నది నిజమని నేనూ తెలుసుకోగలుగుతాను. చాతకాని నేను బతుకుపట్ల భయం పెంచుకుని ఒక స్థిరత్వం కోసం ప్రాకులాడుతాను. నువ్వూ, నాన్నా కోరుకుంటున్నట్టుగా ఉద్యోగమో లేదా వ్యాపారమో చేసుకుంటూ సిటీలోనే ఉండిపోతాను. ఇది నాషరతు..."

తాను చెప్పదలచుకున్న షరతు అతడే చెప్పడంతో ఈశ్వరయ్య ముఖంలో చిరునవ్వు ఉదయించింది. తన మనసులోని మాటలు అతడు యథాతథంగా పలికాడు. అతడు ఓ షరతు విధించాడు కాబట్టి... ఈ పందెంలో అతడు గెలవాలనే ప్రయత్నిస్తాడు. విజయం సాధించాడంటే తమకంటే ఆనందపడేవారు ఈ ప్రపంచంలో మరెవ్వరుంటారు? ఓడిపోయినా సమస్యలేదు. తాము కోరుకున్నదే జరుగుతుంది. ఆయన చిరునవ్వు దాచుకునే ప్రయత్నం చేయలేదు.

"సరే! ఈరోజు జనవరి ఆరో తారీఖు... సరిగ్గా వచ్చే సంవత్సరం జనవరి ఆరోతారీఖున నువ్వు మా ముందు సినిమా హీరోలా నిలబడాలి. లేకపోతే మేము చెప్పినట్లు ఉద్యోగమో, వ్యాపారమో చేయాలి" చివరి వాక్యం నొక్కి మరీ పలికాడు ఈశ్వరయ్య.

"అలాగే"

అతడు ఆ ముగ్గురివైపూ ఓ సారి చూశాడు. అతడి చూపులు చివరిగా రాజేశ్వరిమీద నిలిచాయి.

చూపూ చూపూ కలిసింది. మనసూ మనసూ మాట్లాడుకున్నాయి.

అతడు చూపులు మరల్చుకుని బయటకు నడిచాడు.



రైల్వేస్టేషన్ కోలాహలంగా ఉంది.

మరో ఐదు నిముషాలలో రైలు ప్లాట్‌ఫారంమీదికి రాబోతున్నట్టు అనౌన్స్‌మెంట్ వినిపించింది.

రఘురామయ్య ముఖంలో దిగులు కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. తన కొడుకు ప్రయోజకుడు కావాలనే, పెద్ద పేరు తెచ్చుకోవాలనే ప్రతి తండ్రీ కోరుకునేదే. అయితే ఆ కోరిక తీర్చుకునే ప్రయత్నంలో కలిగే దూరం తప్పకుండా బాధ పెడుతుంది. రఘురామయ్య ప్రస్తుతం అలాంటి బాధతోనే సతమతమవుతున్నాడు.

కొడుకంటే ఆయనకు చాలా ఇష్టం. లేక లేక పుట్టిన వాడు కావడంతో చాలా గారాబంగా పెంచాడు. అడిగినదేదీ కాదనకుండా అందించారు. వారి గారాబాన్ని అరుణ్ ఎన్నడూ దుర్వినియోగం చేయలేదు. బుద్ధిగా పెద్దచదువే చదివాడు. అయితే ఆ

చదువుని సద్వినియోగం చేయకుండా పల్లె పట్టున అనవసరంగా తిరుగుతున్నాడనే ఆయన బాధ. ఆ బాధ ఈశ్వరయ్యకు తెలియచేశాడు. అయితే ఈలోపే అరుణ్ మరదలికి మాట ఇవ్వడం అది అవకాశంగా తీసుకుని ఈశ్వరయ్య షరతులతో కూడిన పందెంగా మార్చి సిటీకి పంపడం ఆనందం కలిగించింది. కాని అరుణ్ తననుండి చార్జీల వరకే డబ్బు తీసుకుని రైల్వే స్టేషన్‌కి రావడం, అతడు తమనుండి తాత్కాలికంగా దూరమౌతున్నాడనే బాధను కూడా డామినేట్ చేస్తోంది.

రఘురామయ్య అలా బాధపడుతుంటే, రాజేశ్వరి పరిస్థితి ఇక చెప్పనే అఖ్ఖరలేదు. ఆమెకు బావ సినిమా హీరో అయితే బాగుణ్ణనే కోరిక బలీయంగానే ఉంది. కాని ఆ ప్రయత్నంలో బావ ఎన్నెన్ని ఇబ్బందులకు లోనవుతాడోనన్న ఫీలింగ్ ఇప్పుడిప్పుడే బలపడుతోంది. అందుకే బావ కదిలిస్తే చాలు కన్నుల వెంట నీరు వరదలా పొంగిపోయేలా ఉంది. తన కోరిక తీర్చడం కోసమే పందెం వేసుకుని మరీ ఒట్టిచేతులతో మహానగరానికి వెళుతున్న అతడికి కనీసం వీడ్కోలయినా చెప్పాలనే రైల్వేస్టేషన్‌కి వచ్చింది.

వారందరిలో కాస్త హుషారుగా కనిపిస్తున్నది ఈశ్వరయ్యే. ఆయన బరువయిన ఆ వాతావరణాన్ని తేలికపరచేందుకు నవ్వుతూ మాట్లాడుతున్నాడు.

"సిటీకెళ్ళాక నీ ప్రయత్నాలలోపడి ఇక్కడివారిని మరిచిపోకు. అప్పుడప్పుడయినా మాకు లెటర్స్ వ్రాస్తుండు. ఇక్కడ నీ లెటర్స్‌కోసం ఎదురుచూసేవారు కొంతమంది ఉన్నారని గుర్తుపెట్టుకో"

రైలు రాకకోసం దూరానికి చూపులు సారించిన అరుణ్ తలతిప్పి ఆయనవైపు చూశాడు. చిరునవ్వును పెదాలమీదకు తెచ్చుకున్నాక జవాబు చెప్పలేదుగానీ బదులుగా తలాడించాడు.

సరిగ్గా అప్పుడే దూరంగా రైలుకూత వినిపించింది. అతడు సూట్‌కేస్ చేతిలోకి తీసుకున్నాడు. అందులో రెండుజతల బట్టలు తప్ప మరే విలువయిన వస్తువూలేదు. జేబులో కూడా రైల్వే టికెట్, మరో యాభై రూపాయలు మాత్రమే ఉన్నాయి.

అరుణ్ సూట్‌కేసును చేతిలోకి తీసుకోవడం గమనించాక రఘురామయ్య అతడివైపు మరో అడుగువేసి జేబులోనుండి కొంత డబ్బు తీసి చెప్పాడు. "అరుణ్! మరీ యాభైరూపాయలు... వాటితో ఆ సిటీలో ఒక్కరోజు కూడా బ్రతకలేవు. ఇది ఎంతో కాదు... రెండు వేలు... ఇవి దగ్గరుంచు"

తన చేతిలో పెట్టబోతున్న డబ్బును మృదువుగా నెట్టి వేశాడు అరుణ్ "వద్దు నాన్నా! నన్ను నేను పోషించుకోగలనన్న నమ్మకం నాకుంది. అలా కష్టపడితే దక్కే విజయమే సిసలయిన ఆనందాన్ని అందిస్తుంది"

"అది కాదురా! మీ మామయ్య పంతానికేదో డబ్బు తీసుకెళ్ళవద్దన్నాడు గానీ, మరీ వందా, వెయ్యి తీసుకెళ్ళకూడదని కాదు"

"అయినా సరే"

రైలు దగ్గరవడంతో ఆయన మాటలు ఆపేసారు. తనిప్పుడు మాట్లాడినా అతడికి వినిపించదు. పైగా అతడి పట్టుదల ఎలాంటిదో తండ్రిగా తనకు తెలిసిందే. ఒకమాట అన్నాక మరి మారడమంటూ ఉండదు. అరుణ్ ఇక తన దగ్గర డబ్బేతీసుకోడన్నది అర్థమయిపోయింది.

అప్పుడే పెద్ద చప్పుడుతో రైలు ప్లాట్‌ఫారంమీద ఆగింది. జనాలు అటూఇటూ పరుగెత్తడం మొదలయింది.

తనకు రిజర్వేషన్ లేదు. జనరల్ కంపార్ట్‌మెంట్... అతడు జనరల్ కంపార్ట్‌మెంట్‌ని వెతుక్కుంటూ నడిచాడు. వెనుకే వారు ముగ్గురూ అనుసరించారు.




జనరల్ కంపార్ట్‌మెంట్ చేరుకుని తొంగి చూస్తే, కిక్కిరిసిన జనం కనిపించారు. అందులోకే మరి కొంతమంది ప్యాసింజర్స్ తోసుకుని మరీ ఎక్కుతున్నారు.

జీవితంలో మొదటిసారి జనరల్ కంపార్ట్‌మెంట్‌లో ప్రయాణం. అందులోనూ కంపార్ట్‌మెంట్‌లో కిక్కిరిసిన జనసముద్రం...

అరుణ్ తన వారివైపు చూశాడు.

వారు ముగ్గురూ అతడివైపు జాలిగా చూశారు.

అతడు జనంవైపు కదలబోతుంటే, రఘురామయ్య కొడుకు భుజంమీద చెయ్యివేసి చెప్పాడు. "పోనీ ఫస్ట్‌క్లాస్‌లో సీటుందేమో కనుక్కో. డబ్బు నేను కడతాను"

"ఫరవాలేదు నాన్నా! నేను ఈ కంపార్ట్‌మెంటే ఎక్కుతాను" అరుణ్ వెంటనే జనంలో కలిసిపోయాడు.

ఆ క్షణం ఈశ్వరయ్య కూడా అతడిమీద జాలిపడ్డాడు. కాని జాలి ప్రదర్శించడం సరి కాదని సరిపెట్టుకున్నాడు.

రైలు బయలుదేరబోతున్నట్టు పెద్దగా కూతవేసింది.

అతడు జనమంతా ఎక్కాక, చివరిగా కంపార్ట్‌మెంట్‌లోనికి ఎక్కి గేటుముందు నిలబడ్డాడు. రాజేశ్వరి అతడికి దగ్గరగా వెళ్లింది. ఆమె తన గుప్పిటను అతడి రెండు చేతులలో ఉంచింది.

"బావా! ఇవి... అమ్మా, నాన్నలు నాకిస్తే, నేను దాచుకున్న డబ్బు. ఇది నా డబ్బు... నువ్వు సిటీకెళ్ళేది నా కోరిక తీర్చడంకోసమే కాబట్టి నా డబ్బు తీసుకెళ్లడం తప్పుకాబోదు"

"వద్దు రాజీ!" అరుణ్ మరేదో చెప్పబోతూ ఆగిపోయాడు. ఆమె కన్నులలోని అర్థింపు అతడిని మాట్లాడనివ్వలేదు.

"ప్లీజ్ బావా" మరోసారి అందామె.

అతడు అప్పుడు తన దోసిలిలోకి చూసుకున్నాడు. అన్నీ పది... ఇరవై... యాభైరూపాయల కాగితాలు... ఓ వెయ్యి రూపాయల వరకూ ఉండొచ్చు...

మెల్లగా తలాడించాడు అరుణ్. "ఆల్‌రైట్ రాజీ! తీసుకుంటున్నాను. కానీ... వీలయినంత వరకూ ఈ కాగితాలు నా దగ్గర పదిలంగా ఉంటాయి. ఇవి నిరంతరం నీ 'కోరిక'ను నాకు గుర్తుచేస్తుంటాయి. నాకు ఇన్స్‌పిరేషన్‌గా పనిచేస్తాయి. ఇవి ఎప్పుడు వాడతానో తెలుసా రాజీ! నా ఆత్మవిశ్వాసం అంతరించిపోయిన రోజు, నేను ఆకలితో మరణిస్తానని తెలిసినప్పుడు... అప్పుడు... అప్పుడు మాత్రమే ఈ డబ్బు ఉపయోగిస్తాను. ఆ స్థితి, పరిస్థితి రాకూడదనే కోరుకుందాం"

అతడి మాటలు పూర్తికాకముందే రైలు రెండోసారి పెద్దగా కూతవేసి ముందుకు కదిలింది. ఆ ముగ్గురూ అతడి వెంట కొంత దూరం నడిచి, రైలు స్పీడ్ అందుకోవడంతో ఆగిపోయి చేతులూపసాగారు. అతడు చెయ్యి ఊపాడు.

అందరి కళ్ళలో కన్నీరు...

రైలు ఆ ముగ్గురి నుండి అతడిని దూరం చేస్తూ ముందుకు సాగిపోయింది. మరో ఐదు నిముషాలతర్వాత ఆ ముగ్గురూ స్టేషన్ బయటకు నడుస్తుండగా, రఘురామయ్య ఈశ్వరయ్యతో అన్నాడు.

"మనం తప్పు చేయలేదు కదా!"

"లేదు... వాడి బాగుకోసమే చేశాం"

"పట్టుదలకుపోయి వాడు కష్టాలను ఎదుర్కోలేక ఏమయిపోతాడోనని నాకు భయంగా ఉంది"

"అరుణ్ గురించి నాకు బాగా తెలుసు. పట్టుదల ఉంది. కష్టాలను ఎదుర్కొనే సామర్థ్యమూ ఉంది. వాటితోపాటు మంచి తెలివితేటలు, శిఖరాన్ని అధిరోహించడానికి



మార్గాలు వెతుక్కోవడమూ తెలుసు. వాడు విజయం సాధించితీరుతాడు"

"విజయం సాధించి సినిమా హీరో కాక పోయినా పర్వాలేదు. సిటీలో మంచి ఉద్యోగం చూసుకుని స్థిరపడిపోతే చాలు. నేను వాడినుండి అంతకుమించి మరేం కోర డంలేదు"

వారి మాటలు మౌనంగా వింటూవుంది రాజేశ్వరి.

ముగ్గురూ స్టేషన్ బయటికి నడిచారు.

బస్టాండ్‌వైపు సాగిపోతుంటే ముగ్గురికీ మనసులు భారమయ్యాయి.

★ ★ ★

"ఒక ఉద్యోగం సాధించుకుని వస్తానని కాదు. ఓ సంవత్సరంలో నాలుగు లక్షలు సంపాదించుకువస్తాననీ కాదు. సినిమాహీరోనవుతానని పందెం కాసి మరీ వచ్చావా''

సినిమా హీరో అన్న పదం నొక్కి పల్కుతూ అన్నాడు రమేష్.

కిటికీ దగ్గర నిలబడి ఫ్లాస్క్‌లోని చాయ్ గ్లాసులో వంపుకుంటున్న అరుణ్, తలతిప్పి రమేష్‌కేసి చూశాడు. జవాబివ్వలేదు.

రమేష్ ఈసారి మరికాస్త గొంతుపెంచి "అయినా సినిమా హీరో కావడమంటే అదేమయినా అప్లికేషన్ పెట్టి, ఇంటర్వ్యూలో కరెక్ట్‌గా సమాధానాలు చెప్పడమనుకున్నావా? సినిమా హీరో కావాలంటే అందమైన రూపం ఉండాలి. అఫ్‌కోర్స్! నీ గ్లామర్‌ని నేను శంకించడంలేదు. నువ్వు 'సినిమా హీరో'లానే ఉంటావ్. కానీ రూపం ఒక్కటే 'హీరో' కావడానికి ప్రధాన లక్షణం కాబోదు. మీకన్నా అందమైనవాళ్ళెందరో, ప్రతిరోజూ స్టూడియోల చుట్టూ తిరుగుతూనే ఉంటారు. ఆ విషయం నీకు తెలియదా? "

"తెలుసు" క్లుప్తంగా జవాబిచ్చాడు అరుణ్. అప్పటికి అతడు చాయ్ వంపుకోవడం పూర్తి కావడంతో గ్లాసు పట్టుకుని రమేష్ ఎదురుగా కుర్చీలో కూర్చుని కాలుమీద కాలేసుకుని రమేష్‌కేసి చూశాడు.

రమేష్ తనకు యూనివర్సిటీలో క్లాస్‌మేట్ కమ్ రూమ్మేటూనూ. యూనివర్సిటీలో చదువుకునేటప్పటినుండీ తామిద్దరూ చాలా క్లోజ్‌గా మూవ్ అయ్యేవారు. పోస్ట్ గ్రాడ్యుయేషన్ అయ్యాక తను ఊరెళ్ళిపోతే అతడు సిటీలోనే జాబ్ సంపాదించుకుని అక్కడే సెటిలయిపోయాడు. అందువల్లే తను రైలు దిగడంతోనే తిన్నగా అతడి రూమ్‌కి వచ్చేశాడు.

తను సిటీకి ఏదో కాలక్షేపం కోసం వచ్చాడనుకుని, సంబరపడ్డాడు రమేష్. కాని తను వచ్చినపని బయటపెట్టడంతోనే కోపంతో ఎగిరిపడడం మొదలుపెట్టాడు. అతడి కోపంలో ఆప్యాయత మిళితమయి ఉందని తెలియడంవలన చిరునవ్వుతో ఆ కోపాన్ని భరిస్తున్నాడు తాను.

"తెలిసి మరీ ఇలాంటి ఛాలెంజ్ చేయడమేమిటి? హీరో కావాలంటే 'నటన' తెలిసి ఉండాలి. నాకు తెలిసి నువ్వు కనీసం కాలేజీ డ్రామాల్లోనయినా యాక్ట్‌చేసి ఉండవనుకుంటాను"

"సినిమాల్లో హీరోలుగా చెలామణి అవుతున్నవారంతా డ్రామా ట్రూపుల్లోనుంచో, యాక్టింగ్ స్కూళ్లలోంచో రాలేదు. 'నటించాలి' అన్న తపన ఉంటే చాలు పూర్వానుభవం అక్కర్లేదనుకుంటున్నాను"

రమేష్ విసురుగా అతడి ముందుకొచ్చి ఎదురు కుర్చీలో కూర్చున్నాడు. అరుణ్ ముఖంలోనికి ముఖం పెట్టి "తపన ఉంటే చాలా? కాసింత అదృష్టముండాలి. ఆ విషయాన్ని నువ్వు కన్వీనియంట్‌గా మరిచిపోతున్నట్టుంది" చిరాకుగా చెప్పాడు.

"నేను నా ప్రయత్నం మొదలుపెట్టే ముందు ప్రతి అంశాన్నీ పరిశీలిస్తున్నాను. అన్ని విషయాలూ క్షుణ్ణంగా గమనిస్తున్నాను. నీ మాటలు నేను ఖండించడంలేదు. హీరో కావడానికి అదృష్టం కావాలి.





కాని అదృష్టం లేదనుకుని పల్లెలో కూర్చుంటే, అవకాశం మనల్ని వెతుక్కుంటూ రాదు. అవకాశాల్ని వెతుక్కుంటూ మనమే బయలుదేరాలి. నేనిప్పుడు అలా విజయం సొంతం చేసుకోవాలని ఆరాటపడతాను. ఇక అదృష్టమంటావా? కృషి, పట్టుదల ఉంటే, అదృష్టం దానంతట అదే మనల్ని వెతుక్కుంటూ వస్తుందని నా అభిప్రాయం"

ఇద్దరి మధ్యా కొద్దిక్షణాలు మౌనంగా సాగిపోయాయి. రమేష్ మెల్లగా భుజాలెగరేశాడు. "ఆల్‌రైట్" అన్నాడు.

"నువ్విలా ఆలోచించి అడుగుముందుకేశాక, నిరాశపరచడం నా అభిమతం కాదు. ఒకవేళ నేను నిరాశపరిచినా నువ్వు మరో రూమ్‌కి మారుతావేగానీ, పల్లెకు మాత్రం తిరిగిపోవని నాకు తెలుసు. కాకపోతే ఏదో కోపంతో అలా మాట్లాడాను"

అప్పటికి తను చాయ్ తాగడం పూర్తవడంతో గ్లాసు పక్కన పెడుతూ అన్నాడు అరుణ్.

"ఫ్రెండ్ తప్పటడుగు వేస్తున్నాడనిపించినప్పుడు కోపం కలగడం, ఆ కోపంలో ఏదో మాట్లాడటం స్నేహం యొక్క సహజ లక్షణం. మిత్రుడిమీద అలా కోప్పడనప్పుడే, ఆ స్నేహం పునాదిని గురించి ఆలోచించవలసివస్తుంది"

"ఏదేమయినా నువ్వు అనాలోచితంగా ఓ నిర్ణయం తీసుకున్నావేమోననిపిస్తుంది నాకు"

"ఆలోచించి చేశానో, అనాలోచితంగా చేశానో అన్నది అప్రస్తుతం. ఒక అడుగు ముందుకేశాక వెనకడుగు వేయడం ధీమంతుల లక్షణం కాదుకదా? "

"మీ మామయ్య చాలా తెలివిగా నిన్ను రెచ్చగొట్టినట్టున్నాడు"

"నిజం చెప్పనా రమ్మీ" అరుణ్ తలెత్తి ముఖంలోకి చూశాడు.

అతడు చెప్పు అన్నట్టు తలాడించాడు.

"మామయ్య రెచ్చగొడితే రెచ్చిపోవడం కన్నా, నన్ను నేను పరిశీలించుకోవాలన్న తపన నాలో అధికమయిందిరా! అసలు మనిషి తలుచుకుంటే సాధించలేనిదేమయినా ఉందా? అన్న అనుమానం నాకు అధికమయింది. అది రుజువు చేసుకోవాలనే మామయ్యతో నేను పందెం కాశాను. ఈ ఛాలెంజ్‌లో నేను గెలిస్తే అందరూ సంతోషపడతారు. ఓడిపోయినా ఎవ్వరూ బాధపడరు నేను తప్ప. 'నేనింత చాతకానివాడినా' అనే ఆలోచన ఆ తర్వాత నన్ను జీవితాంతం బాధిస్తూ ఉంటుంది. సో! ఇతరులను బాధపెట్టే పందెం కాదు. నన్ను నేను రుజువు చేసుకునే పందెం మాత్రమే ఇది"

రమేష్ కుర్చీలోనుండి పైకిలేచి కాసేపు అటూ ఇటూ తిరిగాడు. ఆ తర్వాత అరుణ్ వైపు తిరిగి చెప్పాడు. "ఓ.కే. అరుణ్! మనం ఈ పందెంలో గెలిచేందుకు సిన్సియర్‌గా ప్రయత్నిద్దాం. సక్సెస్ సాధించేందుకు సర్వశక్తులూ వొడ్డిపోరాడుదాం. సరేనా? "

"థాంక్స్‌రా" అన్నాడు అరుణ్.

"సరే! నువ్వెళ్ళి స్నానం చేసిరా. మనం బయటకెళ్ళి టిఫిన్ చేద్దాం"

అరుణ్ తలూపి కుర్చీలోనుండి పైకి లేచాడు. సూట్‌కేస్‌లోనుండి లుంగీ, టవల్ తీసుకుని బాత్‌రూమ్‌వైపు నడిచాడు.

పావుగంట తర్వాత వారిద్దరూ గదికి తాళంవేసి రోడ్డెక్కారు.

రమేష్ రూము గాంధీనగర్‌లో ఉండగా అతడి ఆఫీసు బేగంపేటలో ఉంది. స్కూటర్ ఉండడంతో బస్సులకు వేళ్ళాడవలసిన పనిలేదు. ఉదయం తొమ్మిదింబావుకు బయలుదేరి ఐదున్నరకంతా రూముకి చేరిపోతాడు.

వారిద్దరూ దగ్గరలో ఉన్న హోటల్‌కెళ్ళారు. లోపల ఎదురెదురుగా కూర్చున్నాక "చెప్పరా! ఏం తీసుకుంటావ్? " అడిగాడు

రమేష్.

"నీ ఇష్టం! కొద్దిరోజులపాటు నువ్వు పెట్టిందే తినాలి"

"ఛా! అదేం మాటరా? " రమేష్ కసురుకున్నట్టు అన్నాడు. అప్పుడే సప్లయిర్ తమ దగ్గరగా రావడంతో చెప్పాడు. "ముందు వేడిగా ఇడ్లీ పట్రా"

సర్వర్ వెళ్ళిపోయాడు.

రమేష్ అరుణ్‌ని అడిగాడు. "చెప్పరా! మీ ఊరి విశేషాలేమిటి? "

"ఏమీలేవు" నిర్లిప్తంగా పలికాడు అరుణ్.

"కనీసం నీ మరదలి గురించయినా చెప్పు"

కాలేజీ రోజుల్లో మరదలి గురించి ప్రస్తావన రాగానే అరుణ్ ముఖం వికసించేది. ఆమెను గురించిన కబుర్లు రమేష్‌తో చాలా హుషారుగా చెప్పేవాడు. అందువల్లే అతడిని సీరియస్ మూడ్‌లోనుంచి ఆహ్లాదపరచే ఉద్దేశంతో ఆ టాపిక్ తీసుకువచ్చాడు రమేష్.

అయినా అరుణ్‌లో హుషారు లేదు. "చెప్పడానికేముంది, ఆమె కోరిక తీర్చడానికేగా నేను ప్రస్తుతం సిటీకి వచ్చింది"

ఆ రోజుకిక అతడిని కదిలించకూడదన్నది అర్థమయింది రమేష్‌కి. అతడు మౌనంగా ఉండిపోయాడు.

సప్లయిర్ ఇడ్లీ ప్లేట్స్ తెచ్చి టేబుల్ మీద పెట్టాక అడిగాడు "ఇంకేం కావాలి సార్? "

"రెండు ప్లెయిన్ దోశ! గట్టిచట్నీ తప్పితే ఇంకేం వెయ్యద్దు!" ఆర్డరిచ్చాడు రమేష్. సర్వర్ వెళ్ళిపోయాడు.

టిఫిన్ పూర్తిచేసి, కాఫీ తాగాక ఇద్దరూ హోటల్ నుండి బయటపడి రూమ్‌కి చేరుకున్నారు.

రమేష్ స్కూటర్ స్టాండ్ తీస్తూ చెప్పాడు. "నేను ఆఫీసునుండి ఐదున్నరకు వస్తాను. డబ్బు అవసరపడితే, సూట్ కేస్‌లో ఉన్నాయి. మొహమాట పడకుండా తీసుకో. ఆకలితో అలాగే పడుకోవడం మాత్రం చేయొద్దు"

"అలాగే" అన్నాడు అరుణ్.

రమేష్ స్కూటర్ గేటు దాటింది.

అరుణ్ గదిలోకెళ్ళి తలుపు వేసుకుని బెడ్ మీద వాలిపోయాడు. ప్రయాణపు బడలికతో అతనికి వెంటనే నిద్రపట్టింది.

★ ★ ★

చుట్టూ జనం...

నిరంతర ధనాన్వేషణలో, కీర్తికాంక్షతో పరుగులు పెట్టే జనం. మృత్యుశకటాల్లా ముందుకు పరిగెడుతూ, వాతావరణాన్ని కలుషితం చేసే వాహనాలు. చెవులు చిల్లులుపడేలా విపరీతమయిన రొద.

ఆ జనాన్ని, వాహనాల్ని, రొదను... తప్పించుకుని వాళ్ళిద్దరూ ఆ పార్కులోకి ఎంటరయ్యారు.

సూర్యుడు పశ్చిమాద్రికి కుంగిపోయాడు. అయితే ఆకాశం చీకటి చీరను చుట్టుకోలేదింకా. "అటు కూర్చుందామా? " ఓ సిమెంటు బెంచీ చూపిస్తూ అన్నాడు రమేష్.

అరుణ్ తలాడించాక, ఇద్దరూ అటుగా నడిచారు.

అతడు ఆచోట కూర్చున్నాక చుట్టూ చూశాడు. ఆ పార్కులో ఎటు చూసినా జంటలు కనిపిస్తున్నాయి. ఆ జంటలు ప్రపంచాన్ని మరచిపోయి తనువూ, తనువూ తాకించుకుని స్పర్శసుఖానందంలో మునిగిపోయి, మైమరచిపోయున్నాయి.

ఆ క్షణం అతడికి రాజేశ్వరి గుర్తుకు వచ్చి మనసంతా బరువయింది.

అంతలో రమేష్ అన్నాడు. "ఇప్పుడు చెప్పు! సినిమా హీరో అయ్యేందుకు నువ్వేం చేయబోతున్నావ్? "

"హీరో కావాలనుకున్న వారెవరయినా చేసేది ఒక్కటేకదా? స్టూడియోల చుట్టూ తిరుగుతూ, నిర్మాత దర్శకులను మెప్పించి, వొప్పించి ఛాన్స్ సంపాదించే ప్రయత్న

మేగా? "

రమేష్ తలాడించాడు. "మరి ఆ ప్రయత్నాలు ఎప్పుడు మొదలు కాబోతున్నాయి?"

"ఇప్పటికే ఓరోజు గడిచిపోయిందని నేను బాధపడుతున్నాను. రేపు... రేపటినుంచే నా ప్రయత్నాలు మొదలుపెడతాను"

రమేష్ కాసేపు మౌనంగా ఉన్నాడు. ఆ తర్వాత సాలోచనగా పలికాడు. "నాకు తెలిసీ స్టూడియోలు, నిర్మాత దర్శకుల చుట్టూ తిరగడం అందరూ చేసేపనే! అయితే వారిని మెప్పించి, వొప్పించడం మీదనే మన సక్సెస్ ఆధారపడి ఉంది. కాబట్టి ఆ కోణంలో నువ్వేమయినా ఆలోచించావా? "

అరుణ్ తల అడ్డంగా ఆడించాడు. "నాకు ఇండస్ట్రీ గురించి ఇంతవరకూ ఏమీ తెలియదు. ముందు ఆ చోటికి చేరుకుని ప్రయత్నాలు ప్రారంభించాక లోతుపాతులు తెలుస్తాయి. అప్పుడు మాత్రమే మెప్పించడం, వొప్పించడం గురించి ఆలోచించాలి"

"కరక్టే" అన్నాడు రమేష్.

జనవరి నెల కావడంతో చలిగాలి అప్పుడే మొదలయిపోయింది. పార్కులో కొన్ని జంటలు మరింత దగ్గరవుతుంటే మరికొన్ని జంటలు పార్క్‌నుండి బయటకు నడుస్తున్నాయి.

"అయితే నేను చేయవలసింది మరోటి ఉందిరా రమ్మీ!"

"ఏమిటది? "

"సినిమా ఇండస్ట్రీలో పైకి రావాలనుకునే వారు, ఇండస్ట్రీకి దగ్గరగా ఉండడం అవసరం. అందుకే నేను కృష్ణానగర్‌లో ఉండాలనుకుంటున్నాను.

రమేష్ అతడికేసి విస్మయంగా చూశాడు, "ఏమిటీ... నువ్వు నువ్వు నా రూమ్‌లో కాకుండా మరో రూమ్ తీసుకుని ఉండాలనుకుంటున్నావా? చచ్చినా నేను ఒప్పుకోను. అంతగా అవసరపడితే నన్ను ఆఫీసులో దించేసి, నువ్వు స్కూటర్‌మీద కృష్ణానగర్ వెళ్లు" అన్నాడు వెంటనే.

"అది కాదురా..." అరుణ్ మరేదో చెప్పబోతుంటే చెయ్యి చూపించి ఆగమన్నట్టు సైగ చేశాడు రమేష్.

"నువ్వేన్నయినా చెప్పరా అరుణ్! నువ్వు నా రూమ్‌ని వదిలి మరోచోటుకి వెళ్లడం నాకిష్టం లేదు"

ఈసారి అరుణ్ కాస్త స్థిరంగా పలికాడు, "వెళ్ళక తప్పదు"

రమేష్ అతడివైపు కొద్దిక్షణాలు తదేకంగా చూసి ఆలోచిస్తున్నట్టుగా ఆగాడు. "సరయితే ఓ పనిచేద్దాం. నేనూ నీతోపాటే కృష్ణానగర్‌కి వచ్చేస్తాను. ఇద్దరం కలిసి రూమ్‌లో ఉందాం"

అరుణ్ పెదవులు బిగపట్టాడు. రమేష్ గురించి తనకు బాగా తెలుసు. అతడిదీ తనలాంటి క్యారక్టరే! ఒక మాట అన్నాక, పట్టుపట్టి మరీ సాధించుకుంటాడు. ఎలాగయినా అతడు తన వెంట కృష్ణానగర్ వచ్చి తీరుతాడు.

"నీకు ఆఫీసుకు చాలా దూరమవుతుంది. ఆలోచించుకో" అన్నాడు అరుణ్ అతడిని ఒప్పించాలన్న ఉద్దేశంతో.

"నా గురించి నేను ఆలోచించుకోగలను. నీ గురించి నువ్వు ఆలోచించుకో చాలు" అన్నాడు రమేష్ మందలిస్తున్నట్టుగా.

అరుణ్ మాట్లాడలేదు. అభిమానం, ఆత్మీయతలపట్ల తనకు సదభిప్రాయమే ఉంది. స్నేహమంటే అదో అనిర్వచనీయమైన అనుభూతి అని తను భావించేవాడు. అందుకే యూనివర్శిటీ టైంలో స్నేహానుభూతిని అందరితో పంచుకునేవాడు కాదు. పనికిమాలినవారు పదిమందికన్నా, నిజమైన స్నేహితుడు ఒక్కడు చాలు అనిపించేది తనకి. అందుకే తను క్యాంపస్‌లో వందలమంది పరిచయస్తులయినా, వారిని పరిచయంవరకే ఉంచాడు. ఎవ్వరినీ స్నేహితులుగా

భావించలేదు. కాలేజీ లైఫ్‌లో తనకున్న ఒకే ఒక మిత్రుడు రమేష్. జేబులో పది రూపాయలయినా లేకుండా సిటీకి రాగలిగే ధైర్యం చేయగలిగాడంటే అందుకు రమేష్ కొంత కారణం కూడా! అయితే తనకి రమేష్‌మీదే పూర్తిగా ఆధారపడడం అసలిష్టంలేదు. ఆ విషయం రమేష్‌కి అప్పుడే చెప్పదలుచుకుకోలేదు.

"సో! రేపుదయం నన్ను ఆఫీసులో దించేసి, స్కూటర్‌పైన వెళ్ళి నీ పనులు, ప్రయత్నాలూ చూసుకో. వీలయితే కృష్ణానగర్‌లో ఓ మంచి రూమ్ చూడు. మనం అక్కడికి షిఫ్ట్ అయిపోదాం" చెప్పాడు రమేష్.

అతడు మౌనంగా తలాడించాడు.

"సరే! అలా వెళ్ళి చాయ్ తాగుతూ కూర్చుందాం పద"

ఆ పార్క్‌లోనే ఓ మూలగా క్యాంటిన్ ఉంది. రేట్లు మాత్రం అదిరిపోతూ ఉంటాయి. పార్క్‌లోకి వచ్చాక మళ్ళీ బయటకు వెళ్ళి తాగడం ఎందుకనుకునేవారు తప్పనిసరిగా క్యాంటిన్‌కే వెళతారు.

రమేష్ డబ్బులు చెల్లించి రెండు ఛాయ్‌లు తీసుకున్నాడు. ఇద్దరూ ఓ టేబుల్‌కి అటు ఇటు కూర్చున్నారు.

ఆ పార్క్‌లోని జంటలు కనువిందు చేస్తుంటే సాధారణంగా వాతావరణాన్ని ఎంజాయ్ చేయాలనిపిస్తుంది. అయితే ఆ సమయంలో వారిద్దరూ ఎంజాయ్ చేసే మూడ్‌లో లేరు. ముఖ్యంగా అరుణ్ ఆలోచనా ప్రవాహంలో కొట్టుకునిపోతున్నాడు.

అతడి మనసులో ఒకటే... ఒకటే ఆలోచన. విజయం... విజయం సాధించడం ఎలా?

కొద్దిరోజులపాటు తనకీ ఆలోచనలు తప్పవు అనుకున్నాడు అరుణ్.

చాయ్ తాగటం పూర్తయింది.

అరుణ్ తన ఆలోచనల్లో తాను ఉండడం చూసి కొంతసేపటివరకూ పలకరించే ప్రయత్నం చేయలేదు రమేష్.

చుట్టూ చీకట్లు ముసురుకుంటున్నాయి. దూరంగా మ్యూజికల్ ఫౌంటెన్‌నుండి సినిమా పాటల సంగీతం వినిపించడం మొదలుపెట్టింది.

అప్పుడు వచ్చాడు అరుణ్ ఈ లోకంలోకి. "చాలా టైమయినట్టుందికదూ?"

రమేష్ తలాడించాడు.

"నువ్వు రాత్రులు సొంతంగా వంట చేసుకుంటున్నావా?"

"అవున్రా! మధ్యాహ్నమంటే హోటల్ భోజనం తప్పదు. రాత్రిపూట టైమ్ ఉంటుంది కాబట్టి కాసింత శుభ్రంగా వండుకుని తినడం మేలని..."

"అయితే పద! ఓ గంట వంటపని ఉందిగా!"

"వద్దులేరా! ఈ రోజుకి హోటల్‌లో భోంచేద్దాం. వంటకోసమని మనం వెంటనే రూమ్‌కి వెళ్లనవసరంలేదు"

భుజాలెగరేసి మౌనంగా ఉండిపోయాడు అరుణ్. అలా కొద్దిసేపు. ఆ తరువాత లేచి "వెళ్దాంపద" అన్నాడు.

మిత్రుడి మూడ్ బాగోలేదన్నది అర్థమయింది రమేష్‌కి. అతడు మౌనంగా లేచాడు. ఇద్దరూ పార్క్‌నుండి బయటకొచ్చారు.

★ ★ ★

బేగంపేటలోని తన ఆఫీసు ముందు రమేష్ స్కూటర్‌దిగాక అరుణ్ వెనక సీటునుంచి ముందుకు జరిగాడు.

"రేయ్ అరుణ్. నువ్వు సాయంత్రం ఐదింటికి ఇక్కడకొస్తే చాలు, ఒకవేళ నువ్వు రావడం ఆలస్యమయినా నేను ఓ పావుగంట వెయిట్ చేసి బస్సులో రూముకెళ్ళిపోతాను. కాబట్టి నా గురించి ఆలోచిస్తూ టెన్షన్ ఫీలవ్వకు!"

అతడు తలాడించి 'బై' అన్నాడు.

"విష్‌యూ బెస్టాఫ్ లక్..." అతడు తొలి




సారి తన ప్రయత్నంలో ముందడుగు వేశాడు. అందుకే అలా అన్నాడు రమేష్.

"థాంక్యూ" అని మొదటి గేర్ వేసి సాగి పోయాడు అరుణ్.

మరో పదినిమిషాల తరువాత స్కూటర్ బంజారాహిల్స్ ప్రాంతంలోకి ప్రవేశించింది.

యూనివర్శిటీలో చదివేటప్పుడు నాంపల్లి ఆబిడ్స్‌వరకూ వెళ్ళడం జరిగేదేగానీ బంజారాహిల్స్, జూబిలీ హిల్స్ రావలసిన అవసరం అంతగా లేకపోయేది. ఎప్పుడయినా అటుగా వెళ్ళినా సినిమా స్టూడియోల దగ్గరగా వెళ్ళేవారు కాదు. సిటీలో చాలామంది జీవితాలు ఇలాగే సాగిపోతుంటాయి.

స్కూటర్ జూబిలీహిల్స్‌లో ఓ స్టూడియో ముందు ఆగాక అతడు లోపలికి వెళ్ళాలా వద్దా అన్నట్టు గేటుముందు స్కూటర్‌ని ఆపి అలాగే ఆవైపు చూస్తుండిపోయాడు.

గేటుముందు చాలామంది జనం నిలబడి ఉన్నారు. వారిలో కుర్రాళ్లున్నారు. ముసలి వాళ్లున్నారు. చదువుకున్నవాళ్లున్నారు. చదువులేని వాళ్లున్నారు. అయితే వయసుతో నిమిత్తం లేకుండా, చదువు, సంస్కారంతో సంబంధం లేకుండా వారంతా ఆ స్టూడియో కేసే చూస్తున్నారు. వారి చూపుల్లో ఆ స్టూడియో ఓ కలల ప్రపంచంలా కనిపిస్తోంది. కనీసం ఆ ప్రపంచాన్ని కనులతో దర్శించి తరించాలన్న కోరిక వారి కనులలో ప్రతిఫలిస్తోంది.

ఈ మనుషులకి ఆ సినిమా ప్రపంచం మీద అంత మోజెందుకు? అనుకున్నాడు అతడు. అంతలోనే ఏదో గుర్తొచ్చి అతడికి నవ్వొచ్చింది. వీరేమిటి? తన మరదలు మాత్రం ఈ మోజుతోనేగా తనను నిరంతరం వేధించి, చివరికి ఇలా సిటీలో రోడ్ల మీద పడేలా చేసింది.

అతడు ఆలోచించడం మానేసి స్కూటర్‌ని ముందుకు పోనిచ్చాడు. అయితే మనసులో ఓ అనుమానం పీడిస్తోంది. గేటు దగ్గరికి వెళ్ళాక ఆ అనుమానం నిజమయి కూర్చుంది.

గేటు ముందున్న సెక్యూరిటీగార్డు స్కూటర్‌ను ఆపేశాడు.

"ఎవరు కావాలి సార్? "

జీవితంలో అలాంటి పరిస్థితి ఎదురుకావడం అదే మొదటిసారి కావడంతో అరుణ్ తడబడ్డాడు. "అది... అది... నేను లోపలికి వెళ్ళాలి"

స్టూడియోల ముందుండే సెక్యూరిటీ వాళ్లకి రెగ్యులర్‌గా ఆ స్టూడియోలకి వచ్చే ప్రొడక్షన్‌వాళ్లు, ప్రెస్‌వాళ్లు, ఇండస్ట్రీకి సంబంధించిన వ్యక్తులు చాలావరకూ తెలిసే ఉంటుంది. ఒకవేళ సెక్యూరిటీవారు పరిచయం లేకపోయినప్పటికీ స్టూడియోలకు తరచూ వచ్చేవారు గేటుముందు ఆగి ఆలోచించుకుని ఆ తర్వాత ముందుకు రావడమంటూ జరగదు. అరుణ్ గేటుముందు ఆగడం, ఆలోచించుకోవడం ఆ సెక్యూరిటీ గార్డు చూశాడు మరి!

"అదే సార్! ఎవరికోసం వెళ్ళాలి అని అడుగుతున్నాను? " ఈసారి గార్డు గొంతులో కొంత తేడా వచ్చింది.

అరుణ్‌కి ఏం చెప్పాలో, ఎవరిపేరు చెప్పాలో అర్థంకాలేదు. అతడు ఇబ్బందిపడుతూ సెక్యూరిటీ గార్డుని తదేకంగా చూస్తున్నాడు.

"నేను... నేను... లోపలికి వెళ్ళాలి. అంతే" అన్నాడు అరుణ్.

గార్డు ముఖంలో చిరాకు కదలాడి వెంటనే మాయమయింది. అరుణ్ రూపం, మాట పలికేతీరు కొంతవరకూ ప్రభావితం చేశాయేమో ఆ గార్డ్ మామూలుగానే చెప్పాడు.

"ఎవరంటే వారు లోపలికి వెళ్ళడం వీలు కాదు సార్! మీరు లోపలికెళ్ళాలంటే ఎవరు కావాలో చెప్పాలి, లేదా లోపలివాళ్ళనుండి పర్మిషన్ లెటర్ తీసుకురావాలి. తెలిసిందా? "

స్టూడియో లోపలికి ఎంటర్ కావడం అనేదే ఎంత కష్టమో తెలిసిన క్షణం అది. చాలా ఇబ్బందిగానూ, అంతకుమించి అవమానంగానూ అనిపించింది.

అతడు నెమ్మదిగా తలాడించి స్కూటర్‌ని వెనక్కు తిప్పాడు. కొద్దిదూరం సాగాకగానీ మెదడు పనిచేయడం మొదలెట్టలేదు. 'ఏం చెయ్యాలి?' మొదటి ప్రయత్నమే ఈ విధంగా ఫెయిలయింది. స్టూడియోలోకి ప్రవేశించడమే ఇంత కష్టమయితే మరి సినిమా హీరో కావడం... తనమీద తనకే జాలికలిగితే పెదవులమీద నవ్వుకాని నవ్వు ఉదయిస్తుందేమో.

ఏమీ తోచని స్థితిలో అతడు అనాలోచితంగా స్కూటర్‌ను ముందుకు పోనివ్వసాగాడు.

స్కూటర్ మెయిన్‌రోడ్ చేరింది.

అతడు స్కూటర్ ఓ కేఫ్‌ముందు ఆపి లోపలికెళ్ళాడు. జేబులో తడిమి చూసుకుంటే పదిరూపాయల కాగితం తగిలింది. తను సిటీకి వచ్చేప్పుడు తెచ్చుకున్న కొద్దిపాటి పాకెట్‌మనీలో మిగిలింది అదే. తిండి, గూడు... ఆ విషయంలో తను ప్రస్తుతం మిత్రుడిమీద ఆధారపడి గడుపుతున్నాడు. అయితే ఈ పరాధీనతను ఎక్కువకాలం సాగేలా చేయడం తనకిష్టంలేదు. హీరో అయ్యేందుకు ప్రయత్నాలు సాగించడంతో పాటు తన కడుపు నింపుకునే పని కూడా చెయ్యాలి 'ఏం చెయ్యాలి... ఎలా చెయ్యాలి?' ఈ రోజంతా ఈ రెండు ప్రశ్నలే తనను వెంటాడుతున్నాయి.

కేఫ్‌లో ఛాయ్ తాగి బిల్లు చెల్లించాక మిగిలిన చిల్లర పదిలంగా జేబులో వేసుకుని బయటకొచ్చాడు. స్కూటర్ స్టాండ్ తీయడంతోనే అర్థమయింది. బ్యాక్ టైర్ పంక్చరయింది. అతడి గుండె గతుక్కుమంది. తను ఇప్పటివరకూ ఓ సమస్య గురించి ఆలోచిస్తుంటే, ఇప్పుడు... ఇదిగో ఇప్పుడే మరో కొత్త సమస్య పుట్టుకొచ్చింది. అతడికి గుండెలనుండి నిట్టూర్పు లాంటిది వెలువడింది. తను సమస్యల పర్వంలోకి అడుగుపెట్టాడేమో! ఇక ఒక్కో సమస్యనూ ఛేదించుకుని విజయం సాధించాలి.

అయితే ఆ సమస్యను సాధించడానికే ఓరోజు సరిపోయింది.

అరుణ్ కేఫ్‌కి ఆ పక్కనే ఉన్న పబ్లిక్ టెలిఫోన్ బూత్‌నుండి రమేష్‌కి రింగ్ చేశాడు. అవతలివైపు రమేష్ గొంతు విని పించాక ప్రాబ్లెమ్ చెప్పాడు.

అంతా విన్నాక రమేష్ అన్నాడు, "ఇంత చిన్న విషయానికి నాకు ఫోన్ చేయడం ఎందుకు? పక్కనే ఏదయినా షాపులో పంక్చర్ వేయించుకుని తిరుగు. సాయంత్రానికి ఇక్కడకి వచ్చేసెయ్"

మిత్రుడికి తన ప్రాబ్లెమ్ ఎలా... ఎలా చెప్పాలో అర్థంకాలేదు. చాలా ఇబ్బందిగా అనిపించింది. అయినా ఇక తప్పనిసరి పరిస్థితి కావడంతో గొంతు విప్పాడు. "అది... అదేరా... నా జేబులో ఎనిమిది... ఓన్లీ ఎయిట్ రుపీస్ మాత్రమే ఉన్నాయి"

అవతలివైపు కొద్ది సెకనులపాటు నిశ్శబ్దం. "అంతదూరం వెళ్ళేటప్పుడు కాస్తో కూస్తో డబ్బు జేబులో వేసుకు వెళ్ళాలిరా. మరీ పదిరూపాయలతో జూబ్లీహిల్స్... అదీ స్కూటర్ తీసుకుని మరీ ఎలా వెళ్లావ్?"

రమేష్ బాధపడి అంటున్నాడో, కోప్పడుతూ అంటున్నాడో అర్థంకాలేదు అతడికి. అందుకే మౌనంగా ఉండిపోయాడు.

"సరయితే అక్కడే ఉండిపో. నేను బస్సు పట్టుకుని అర్థగంటలో అక్కడికి వస్తాను" రమేష్ చెప్పాక అతడు ఫోన్ పెట్టేశాడు.

స్కూటర్ దగ్గరే నిలబడి రమేష్‌కోసం ఎదురుచూడడం మొదలుపెట్టాడు అరుణ్.

అర్థగంట అన్నది రెండు గంటలు తర్వాత వచ్చాడు రమేష్. ముఖంలో అలసట స్పష్టంగా కనిపిస్తోంది. "సారీరా! ఆఫీ




సులో వర్క్‌చేసి మరీ రావలసి వచ్చింది. అందువల్లే ఈ లేటు"

"ఫర్వాలేదులే!"

అరుణ్ స్కూటర్‌ని పంక్చర్ షాపువైపు నడిపిస్తుంటే రమేష్ పక్కనే నడిచాడు.

స్కూటర్‌కి పంక్చర్ వేయడం పూర్త య్యాక, రమేష్ పర్స్‌లో నుండి డబ్బులు తీసి షాపువాడికి ఇచ్చాడు. అప్పుడు చెప్పాడు అరుణ్.

"రమేష్! స్కూటర్‌ని నువ్వు తీసుకెళ్ళరా... నేను సాయంత్రం పొద్దుపోయేవరకూ అలా తిరిగి వద్దామనుకుంటున్నాను"

రమేష్ అతడికేసి అదోలా చూశాడు. నేను ఫోన్‌లో కాస్త కోపంగా మాట్లాడానని బాధపడ్డావా? ఛా! కోపం కాదురా అది. నువ్వు జేబులో కొంతయినా డబ్బు వేసుకోకుండా వచ్చావే అని విసుగుపడి... అలా మాట్లాడాను. అందులో నీ మీద అభిమానమే తప్ప అసహనం కాదు"

అరుణ్ చెప్పాడు. "జేబులో ఎంతోకొంత వేసుకురావాలని నాకూ తెలుసు. నా దగ్గిర మిగిలింది కేవలం... కేవలం ఆ పది రూపాయలు మాత్రమే"

రమేష్ ముఖంలో మార్పులు స్పష్టంగా చూడగలిగాడు అతడు.

"మరి... మరి ఆ మాట నువ్వు నాకు ముందే ఎందుకు చెప్పలేదు? "

"నా దగ్గర లేవని ముందే చెప్పాను"

"లేవు అంటే... అసల్లేవనుకోలేదు. ఐదు వేలో... పదివేలో... లక్షాధికారి బిడ్డవి కదా? సిటీలో బ్రతకడానికి వచ్చేటప్పుడు ఆమాత్రం పట్టుకురాకపోతావా అనుకున్నాను"

అరుణ్ మౌనంగా ఉండిపోయాడు.

"సర్లే... ఈ యాభై ఉంచుకుని సాయంత్రంవరకూ తిరిగి రా..." రమేష్ అరుణ్ జేబులో యాభైరూపాయలనోటు ఉంచాడు.

అరుణ్ మౌనంగా ఉండిపోయాడు. నిజానికి అదే వద్దనాలనిపించిందిగానీ, అవసరం.

ఈ ప్రపంచంలో 'అవసరమే' మనిషిలోని అహాన్ని జయిస్తుందేమో!

రమేష్ స్కూటర్ తీసుకుని ముందుకు సాగిపోయాడు.

★ ★ ★

సూర్యకిరణాలు తనను ఆప్యాయంగా స్పృశించడంతో అతడికి మెలుకువ వొచ్చింది.

అరుణ్ దుప్పటి ముసుగు తొలగించి చూశాడు. తన పక్కనే పడుకుని ఉన్నాడు రమేష్. అతడింకా గాఢనిద్రలోనే ఉన్నట్టుగా ఉంది.

బెడ్ దిగాలనిపించలేదు అరుణ్‌కి. బెడ్ మీదనే పద్మాసనం వేసుకుని కూర్చుని కిటికీలోనుండి ఆకాశంకేసి చూడసాగాడు. చూపులు ఆకాశంమీద కేంద్రీకృతమయినా, మనసు మాత్రం పరిపరివిధాల ఆలోచిస్తోంది.

తను సిటీకి వచ్చి ఇప్పటికే రెండు రోజులయిపోయింది. తెచ్చుకున్న కొద్దిపాటి పాకెట్ మనీ ఖర్చయిపోయింది. మొదటిరోజు అభిమానం కురిపిస్తూ మాట్లాడిన రమేష్, ఈ రెండు రోజుల్లోనే కొద్దిగా మారిపోయినట్టనిపిస్తోంది. లేకపోతే... మొదటిరోజు స్కూటర్ ఇచ్చినవాడు రెండోరోజు మాటవరసకయినా స్కూటర్ తీసుకెళ్ళమనలేదు. తనతో కలిసి కృష్ణానగర్‌లోకి వచ్చేస్తానన్న మాట మరోసారి ప్రస్తావించనే లేదు. రమేష్... రెండురోజులలోనే ఇలా మారిపోవడానికి కారణం ఏమిటి? తన దగ్గర డబ్బు అసలు లేదన్న విషయం తెలియడమేనా? అయినా డబ్బు దగ్గరకొచ్చేసరికి స్నేహబంధం తెగిపోతుందా? ప్రశ్నల పరంపర సాగిపోతూనే ఉంది. ఆ ప్రశ్నలకు జవాబులు వెతుక్కుంటూ, ఆలోచిస్తూ కూర్చుంటే తనిక వచ్చిన విషయం గురించి

మరచిపోవలసిందే.

అతడు బెడ్ దిగాడు. బాత్‌రూమ్ కెళ్ళొచ్చాక బ్రష్ చేసుకుంటుండగా రమేష్ దుప్పటి ముసుగు తొలగించి అతడిని చూసి "ఏమిట్రా అప్పుడే నిద్రలేచావ్?" అన్నాడు.

"ఇప్పటికే ఏడయింది. మనది ఇప్పుడు స్వయంపాకం కదా? కాస్తో కూస్తో వండుకుని తినేసరికి తొమ్మిదవుతుంది"

అరుణ్ జవాబు చెబుతుండగానే రమేష్ బద్ధకంగా బెడ్‌కి మరోవైపు తిరుగుతూ పలికాడు "వంట వండేందుకు నాకు మాత్రం ఓపిక లేదు. నేను లేచేసరికి అదేదో నువ్వే కానిచ్చేసావనుకో నేను హేపీగా ఫీలవుతాను"

అతడు అదోలా నవ్వాడు. ఆ నవ్వు రమేష్ చూడలేదు. చూసి ఉంటే ఆ నవ్వులో ఎన్నో అర్థాలు కనిపించేవి.

"అలాగే" అన్నాడు.

స్టౌ వెలిగించి, వంట పాత్రలు ముందేసుకుని కూర్చున్నాక కొద్దిగా ఇబ్బందిగా అనిపించింది. చివరికి యూనివర్శిటీలో చదివేప్పుడు కూడా తాము మెస్‌లోనే భోంచేసేవారు. తన దగ్గర డబ్బులు లేవని తెలిశాక ఖర్చంతా అతడే భరించాల్సి వస్తుందని అర్థమవడంతో రమేష్ నాలుగు వంట పాత్రలు, సరుకులు తెచ్చి రూమ్‌లో పడేశాడు. వండిపెడితే మెస్ ఖర్చు తగ్గిపోతుందని. దాంతో ఇక తప్పని సరయి తనమీద పెడుతున్న ఖర్చులో కొంత రికవరీ అవుతుందనే భావించినట్టుంది.

తనెంత పిచ్చివాడు? మొదటిరోజు ఈ వ్యక్తి అభిమానం, ఆత్మీయతలను చూసి 'స్నేహం' అనే పదం ఎంతో తియ్యనయినదని భ్రమపడ్డాడు?

ఆలోచనల మధ్యనే వంట పూర్తయింది. రమేష్ లేచి స్నానం గట్రా పూర్తిచేశాక, ఇద్దరూ కలసి భోంచేశారు.

"నువ్వూ వస్తున్నావు కదా!" డ్రసప్ అవుతూ అడిగాడు రమేష్. అతడు మునుపటంత హుషారుగా తనతో మాట్లాడకపోవడం గమనించినప్పటికీ అరుణ్ నిశ్శబ్దంగా తలాడించాడు. తనూ డ్రస్ మార్చుకున్నాడు.

రమేష్ స్కూటర్ స్టార్ట్‌చేశాక అరుణ్ వెనుక కూర్చున్నాడు. స్కూటర్ ముందుకు కదిలింది.

స్కూటర్ తన ఆఫీసు ముందు ఆగాక, రమేష్ ఇంజన్ ఆఫ్ చెయ్యకుండానే వెనక్కు తిరిగి చూశాడు. అరుణ్ స్కూటర్ దిగాడు.

"సరేరా... సాయంత్రం త్వరగా రూమ్‌కి వచ్చేస్తావు కదూ?"

అరుణ్ తలాడించడమే తరువాయి "వస్తాను" అంటూ స్కూటర్‌తోసహా అతడు ఆఫీసులోకి వెళ్ళిపోయాడు.

రోడ్డుమధ్యగా అరుణ్... జేబులో ఒక్క పైసా లేకుండా!

ఏమనిషికయినా తనమీద తనకే జాలికలిగే స్థితికన్నా భయంకరమైన పరిస్థితి మరోటి ఉండదు. ఆ క్షణం అరుణ్‌కి తన మీద తనకే జాలి కలిగింది.

అతడు ఒక అడుగు ముందుకేసాడు. బేగంపేటనుండి జూబ్లీహిల్స్‌కో, కృష్ణానగర్‌కో నడిచే వెళ్లాలి. ఆ తర్వాత రూమ్ వరకూ తిరిగి నడిచే చేరుకోవాలి.

నడవడం ఒక కష్టమయితే, ఆకలి మరో కష్టం. కనీసం... కనీసం చాయ్ తాగేందుకయినా జేబులో డబ్బులులేవు.

అయినా అతడు అడుగు ముందుకేసాడు.

అడుగు ముందుకేస్తూ అతడు భవిష్యత్ గురించి ఆలోచించడం మొదలెట్టాడు. భవిష్యత్తు పట్ల ఆశ, ఆలోచనే ప్రస్తుతాన్ని మరిచేలా చేస్తుందని తెలుసు.

అతడు నడక సాగించాడు. కానీ అది గమ్యంలేని ప్రయాణమే.

మొదటిరోజు స్కూటర్‌తో రోజంతా వేస్ట్




యిపోయింది. రెండోరోజు జేబులో ఎనిమిది రూపాయలేసుకుని స్టూడియో లోపలికి వెళ్ళాలని ప్రయత్నించి విఫలమయ్యాడు. ఇక స్టూడియోలకెళ్ళి నిర్మాత దర్శకులను కలుసుకోవడం జరిగే పని కాదేమోననిపించింది. అందుకే గత రాత్రంతా ఆలోచించి అతడో నిర్ణయానికి వచ్చాడు.

వీధుల్లో ఎక్కడయినా షూటింగ్ జరుగుతుంటే అక్కడికెళ్ళి కలవదలచుకున్న వ్యక్తులను కలవడం. జూబ్లీహిల్స్, బంజారాహిల్స్, కృష్ణానగర్ ప్రాంతాలలో పెద్దపెద్ద భవంతులలో కూడా షూటింగ్స్ జరుగుతుంటాయని తెలిసింది. అతడికి మరో ఆలోచన కూడా వుంది. ప్రముఖులను వారి ఇళ్ళదగ్గర కలవడం.

నడక సాగుతూనే ఉంది. అప్పటికి సగం దూరం మాత్రమే వచ్చాడు. కాళ్ళు లాగేస్తున్నట్టనిపించింది. కూర్చోవాలి. ఎక్కడయినా కూర్చోవాలి... రోడ్డు పక్కనే బస్‌షెల్టర్ కనిపించింది. అటుగా వెళ్ళి ఆ చోట కాసేపు కూర్చున్నాడు.

ఓ ఐదునిమిషాలు కూర్చున్నాక, కాళ్ళనొప్పులు కొద్దిగా తగ్గాయి. తిరిగి నడక... జీవితంలో కష్టాలంటే ఎలా ఉంటాయో తెలుస్తున్న క్షణాలవి.

ఓ గంట తర్వాత అతడు కృష్ణానగర్ చేరుకున్నాడు.

కృష్ణానగర్ అంటే సినిమా వాళ్ళుండే ఏరియానే. కాకపోతే నిర్మాతా, దర్శకులు, సినిమా హీరోహీరోయిన్లు బంజారాహిల్స్, జూబ్లీహిల్స్ ప్రాంతాల్లో నివసిస్తుంటే, అదే ఇండస్ట్రీకి చెందిన సెకెండ్ పొజిషన్ వ్యక్తులు కృష్ణానగర్‌లో ఉంటుంటారు. జూనియర్ ఆర్టిస్టులు, ప్రొడక్షన్ మేనేజర్లు, కాస్ట్యూమ్స్‌వారు, మేకప్‌మెన్‌లు... ఇలా తెరవెనుక మనుషులంతా కనిపించేది కృష్ణానగర్‌లోనే.




అతడు కృష్ణానగర్ చేరుకునేసరికి మరోసారి కాళ్ళు పీకడం మొదలుపెట్టాయి. అక్కడ బస్‌షెల్టర్ కూడా లేదు. ఎక్కడయినా ఓ పదినిమిషాలు కూర్చుంటే తప్ప అడుగు ముందుకు పడదు.

అరుణ్ చుట్టూ చూశాడు. ఓ కేఫ్ కనిపించింది. అతడు కేఫ్‌కెళ్ళి కూర్చున్నాడు.

సర్వర్ కుర్రాడొచ్చి 'ఏం కావాలని' అడిగితే ఏమీ వద్దన్నట్టు సైగచేశాడు. కుర్రాడు అతడికేసి అదోలా చూసి వెళ్ళిపోయాడు. అతడు రెండుగ్లాసుల నీళ్ళు తాగి రోడ్డుమీదకు చూపులు మరల్చి అటుగా చూడసాగాడు.

అతిగా అలంకరించుకున్న జూనియర్ ఆర్టిస్టులు కొందరు ఆ దారమ్మటే వెళ్తున్నారు. రోడ్డుమీద జనం వారివైపు నవ్వు ముఖాలతో చూస్తున్నారు. ఒకరిద్దరు ఆడ వాళ్ళు మాత్రం పలకరించిన కుర్రాళ్ళతో మాటలు కలుపుతున్నారు.

సినిమా ఇండస్ట్రీలో అడుగుపెట్టాలనుకున్నప్పుడే ఆడది కొన్ని విలువలకు తిలోదకాలివ్వాల్సిందేనేమో! ముఖ్యంగా 'శీలం' గురించి ఆలోచించడం మానెయ్యాలి.

జూనియర్ ఆర్టిస్టులు కనుమరుగయ్యారు. వారిని పలుకరించిన కుర్రాళ్ళు 'కేఫ్'లోకొచ్చారు. అక్కడ కూర్చుని ఉన్న మరో కుర్రాడితో చెబుతున్నారు "బేరం కుదర్లేదు బాస్!"

కృష్ణానగర్ పక్కనే ఉన్న ఇందిరానగర్ కేఫ్‌లో ఎటు చూసినా సినిమాజనమే కూర్చుని ఉంటారు. ఆ కేఫ్‌లో సినిమాల గురించిన మాటలే ప్రవాహాల్లా దొర్లిపోతుంటాయి.

ఒకడు చెబుతున్నాడు, "నేను లైన్ చెప్పగానే డైరెక్టర్ థ్రిల్లయిపోయాడనుకో. మన నెక్స్ట్ ప్రాజెక్ట్ ఇదే అన్నాడు"

ఆ కుర్రాడు సంవత్సరాల తరబడి ఆ మాటలు చెబుతూనే ఉంటాడు. వినేవాళ్ళు వింటూనే ఉంటారు. కాని ఆ కుర్రాడికి కథా రచయిత అయ్యే ఛాన్సురాదు. ఆ డైరెక్టర్

మాత్రం వరుసగా సినిమాలు తీసుకుంటూ పోతుంటాడు. అలాగే పాటల రచయితలు, నటులు కావాలని ప్రయత్నించేవారు. నిరంతరం ప్రయత్నిస్తూనే, అవకాశం అనే ఎండమావి వెనక పరుగులుతీస్తూ ఉంటారు.

అక్కడి పరిస్థితి ఇప్పుడిప్పుడే అతడికి అర్థమవుతోంది. ఇలాంటి వాతావరణంలోకి ఈ పోటీ ప్రపంచంలోకి రావడమే కాదు, ఈ రంగంలో ఉన్నతస్థాయిగా భావించే 'హీరో' గా మారుతానని ఛాలెంజ్ చేశాడు. ఇది... ఇది సాధ్యమేనా? ఛా చా! నిరాశను దగ్గరికి రానివ్వకూడదు. నిరాశే సగం అపజయం!

అతడు మరో రెండు గ్లాసులు నీళ్ళుతాగాక కేఫ్‌లోనుండి బయటకొచ్చాడు.

చుట్టూ ఇండస్ట్రీ జనం... నడుస్తూ, వాహనాలలో పరిగెడుతూ...! రోడ్డు పక్కనే కాస్ట్యూమ్స్‌కి, మేకప్‌కి, సినిమా ఆర్ట్‌వర్క్‌కి సంబంధించిన షాపులు కనిపిస్తున్నాయి.

ఇండస్ట్రీ ఉన్నచోటుకు రావడం జరిగింది. మరి ఇప్పుడు తను ఎక్కడికెళ్ళాలి? స్టూడియోలకు వెళ్ళలేడు... కానీ షూటింగ్ చూడాలి. ఎలా?

అతడికి అప్పుడొచ్చిందా ఆలోచన... అతడు వెనుదిరిగి కేఫ్‌లోకెళ్ళి అక్కడ కూర్చుని సినిమా కబుర్లు చెబుతుండిన కుర్రాడిని అడిగాడు. "బ్రదర్! దగ్గర్లో షూటింగ్ ఏదయినా జరుగుతోందా? "

ఆ కుర్రాడు అతడికేసి కిందనుండి పైదాకా చూశాడు. ఆ తర్వాత కాస్త సుపీరియర్‌గా ఫీలవుతున్నట్టు ఫోజుపెట్టాడు. సినిమా షూటింగ్‌లు చూడాలని రాష్ట్రం నలుమూలలనుంచి జనం రావడం, ఎక్కడ షూటింగ్ జరుగుతుందో తెలుసుకోవాలనుకోవడం మామూలే! అలా వచ్చిన వారిని, అక్కడ ఉండేవారు అమాయకుల్నీ, ఏదో పనికిమాలిన పని చేయడానికి వచ్చిన వారిని చూసినట్టు చూడడమూ మామూలే!

"షూటింగా? " అన్నాడా కుర్రాడు.

"అవును బ్రదర్! దగ్గర్లో ఎక్కడయినా జరుగుతోందా? "

ఆ కుర్రాడు దీర్ఘాలోచనలో మునిగిపోయినట్టు తలపైకెత్తి తిరిగే సీలింగ్‌ఫ్యాన్‌కేసి చూడసాగాడు. తనలోతాను అనుకుంటున్నట్టు పలికాడు. "విశ్వనాథ్ సినిమా ఫ్లాపయ్యాక మళ్ళీ కొత్త సినిమా మొదలెట్టలేదు. రాఘవేంద్రరావు మద్రాసులోనే ఉన్నట్టున్నాడయ్యా! నేను నిన్ననే వాళ్ళింటికి ఫోన్‌చేశాను. నో రిప్లయ్! సో అతడు మద్రాసులోనే ఉన్నట్టు కన్‌ఫర్మ్ అయిపోయింది. వర్మ మాత్రం బొంబాయిలోనే ఉన్నాడు. నో డౌట్! కాబట్టి ఇప్పుడు హైదరాబాద్‌లో ఏ డైరెక్టర్ల సినిమాలు జరుగుతున్నాయో ఆలోచించుకోవాలి. అవి ఎక్కడ జరుగుతున్నాయో తెలుసుకోవాలంటే... ముందు స్టూడియోలకో లేక డైరెక్టర్ల ఇంటికో, ప్రొడక్షన్ ఆఫీసులకో ఫోన్‌చేసి తెలుసుకోవాలి"

తను అక్కడే ఉంటే తన చేతే ఫోన్ చేయించి, వివరాలు సేకరించేలా ఉన్నాడనిపించింది. వివరాలు తెలుసుకోగలిగితే మంచిదే. కాని ఫోన్‌కి ఇచ్చేందుకు దగ్గర ఒక్కరూపాయి కూడా లేదే! అదీ అసలు సమస్య.

"సరే బ్రదర్! నేను మళ్ళీ వస్తాను"

"ఫోన్ చేసి కనుక్కుందాం ఉండు... వస్తున్నా" అంటూ ఆ కుర్రాడు లేచాడు.

అతడు "వద్దులే బ్రదర్" అంటూ వడివడిగా వచ్చేస్తుంటే వెనకనుండి నవ్వులు వినబడ్డాయి.

తనని ఓ పల్లెటూరి మొద్దుగా భావించి ఆ కుర్రాడు ఆటపట్టిస్తున్నాడని అరుణ్‌కి అర్థమయింది. కొద్దిసేపు బాధ అనిపించింది. అయితే ఆ బాధ కొద్దిసేపే! అవమానం, కష్టాలు, కన్నీళ్ళే విజయానికి పునాదులని తనకు తెలుసు.

అతడు రోడ్డుమీద ముందుకు నడవసాగాడు. అయితే ఈసారి ఎవరినీ షూటింగ్ ఎక్కడని ప్రశ్నించదలచుకోలేదు.

సూర్యుడు నడినెత్తికి రాబోతున్నాడు. నడక ఎక్కువ కావడంతో ఉదయం భోంచేసిన తిండి ఎప్పుడో జీర్ణమయి ఆకలి మొదలయింది.

అతడు అలా ఆలోచనల మధ్య ఎటుగా నడిచాడో ఎంతదూరం నడిచాడో గుర్తు లేదు. ఈ లోకంలోకి వచ్చేసరికి విశాలమైన రోడ్డులోని ఓ అందమైన భవంతిముందు ఉన్నాడు. ఆ భవంతి ముందు 'ఓ సినీసర్వీస్ వేన్' బహుశ ఆ వేన్ చూశాకే తనీ లోకంలోకి వచ్చి ఉండచ్చేమో!

అరుణ్ కాళ్ళనొప్పులు, ఆకలి బాధ, నిరాశ, నిస్పృహ అన్నీ మర్చిపోయాడు. ఒంట్లోకి కొత్తరక్తం ప్రవేశించినట్లు హుషారుగా, ఉత్సాహంగా అనిపించింది.

అతడు ఆ వైపు నడిచాడు.

హైదరాబాద్‌లో షూటింగ్స్, కొన్ని ప్రైవేట్ భవంతులలో జరుగుతూ ఉంటాయి. ఆ భవంతుల ముందు, స్టూడియోల ముందున్నట్టు సెక్యూరిటీ ఉండదు. కాబట్టి షూటింగ్ చూసేందుకు వచ్చిన వ్యక్తుల్ని అటకాయించడమూ జరగదు.

భవంతిలో లోపలికి అడుగుపెడుతుంటే అదోరకమైన ఫీలింగ్. తన వారంతా తనను చూడాలనుకుంటున్న ప్రపంచంలోనికి అడుగుపెడుతున్నాడు. కేవలం నేడు ప్రేక్షకుడిలా అడుగుపెడుతున్న ఈ ప్రపంచంలో రేపు తను కొన్ని లక్షలమంది ప్రేక్షకులు చూసే వ్యక్తిగా మారాలి. అది సాధ్యమా?

'ఛ! ఇప్పటికీ తనలో ఆ ప్రశ్న ఏమిటి? సాధ్యమా? మనిషి తలచుకుంటే సాధ్యంకానిదేదీ లేదని నిరూపించడానికే కదా తనీ రంగుల ప్రపంచంలోనికి వచ్చింది'

అతడు లోపలికి అడుగుపెట్టాడు.

ఆ చోట జనం వందమందికి పైగానే ఉన్నారు. వారెవరూ షూటింగ్ చూసేందుకు వచ్చినవారు కాదని తెలుస్తూనేఉంది. కోడైరెక్టర్, అసిస్టెంట్ డైరెక్టర్లు, కెమేరా వాళ్ళు, లైట్‌బాయ్‌లు, మేకప్ వాళ్ళు, భోజనాలు అందించే ప్రొడక్షన్ వాళ్ళు, కారుడ్రైవర్లు, చిన్నచిన్న నటులూ, నిర్మాత, దర్శకుల తరపు వ్యక్తులు.

ఒక సినిమా షూటింగ్ జరుగుతుంటే ఇంతమంది వ్యక్తులు అవసరమా? అనిపించింది అతడికి. అవసరమని అప్పుడే అర్థమయింది.

అతడు కొద్దిసేపు బిల్డింగ్ లోపల హాలు కేసి చూస్తూ ఉండిపోయాడు. ఆ హాలులోనే షూటింగ్ జరగడానికి ప్రయత్నాలు జరుగుతున్నట్టున్నాయి. ఇంకా హీరో, హీరోయిన్లు స్పాట్‌కి వచ్చినట్టులేదు. అసిస్టెంట్ డైరెక్టర్లు కాబోలు స్క్రిప్ట్ పేపర్లు పట్టుకుని అటూఇటూ హడావుడిగా తిరిగేస్తున్నారు. కుర్చీలో కూర్చుని కన్నులు మూసుకుని ఓ అద్భుత దృశ్యాన్ని వీక్షిస్తున్నట్టుగా కనిపిస్తున్న ఆ వ్యక్తి... ఆ వ్యక్తి తప్పక సినిమా డైరెక్టరే అయి ఉంటారు. అతడి పక్కనే కూర్చుని సంగ్రామంలో చిక్కుకుని దిక్కుతోచని సైనికుడిలా కనిపిస్తున్న ఆ మరో వ్యక్తి... తప్పక... తప్పక... సినిమా నిర్మాతే అయి ఉంటాడు.

అరుణ్ ఓ అడుగు ముందుకేసాడు. ఆ నిర్మాత, దర్శకులను కలుసుకుని తనకు అవకాశం ఇవ్వమని రిక్వెస్ట్ చేద్దామనుకున్నాడు. మరో అడుగు ముందుకేశాడు.

సరిగ్గా అదే సమయంలో పొడవైన కారు గేటుదాటి లోపలికొచ్చింది. ఆ కారు పోర్టికోలో ఆగడం చూడడంతోనే నిర్మాత, దర్శకులు తమ కుర్చీలలో నుండి పైకి లేచి వడివడిగా అటు అడుగులేసారు.

అతడు అటుగా చూశాడు.

కారు డోర్ తెరుచుకుని దిగాడు ఐదడుగుల మూడంగుళాల ఓ వ్యక్తి. ఆ వ్యక్తిని చూడడంతోనే అరుణ్ గుర్తుపట్టాడు. అతడు హీరో అవినాష్!

చిత్రపరిశ్రమ నిజంగానే విచిత్ర పరిశ్రమే




నేమో అనిపిస్తుంటుంది ఒక్కోసారి. లేక పోతే హీరో అంటే ఆరడగుల ఎత్తు, అంద మైన రూపం ఉండాలనుకునేవారు ఒక ప్పుడు. అయితే ఎత్తూ, రూపం, వాచకం, నటన ఏవీలేని అవినాష్‌ని జనం హీరోగా ఆదరిస్తున్నారంటే ఆశ్చర్యం కలగకమా నదు.

ఒక డైరెక్టర్‌కి ఒక హీరోతో చిన్నగొడవొ చ్చింది. నా హీరోయిజంతోనే నీ సినిమాలు ఆడాయంటే, నా క్రియేటివిటీతోనే నీకు హిట్స్ వచ్చాయని ఒకరినొకరు నిందించు కున్నారు. చివరికి ఆ డైరెక్టర్ 'నీ హీరో యిజం ఏంటీ? నా సినిమాల్లో కామెడీ యాక్టర్‌ని, సొట్టబుగ్గల అవినాష్‌ని హీరోగా చేసి విజయం సాధిస్తాను చూడు' అన్నాడా డైరెక్టర్. అలా హీరో, డైరెక్టర్ పంతాల మధ్య అవినాష్ హీరో అయ్యాడు. అతడి మొదటి సినిమా డైరెక్టర్‌గారి క్రియేటివిటి వలన సూపర్‌డూపర్ హిట్టయింది. అంతే అవినాష్ హీరోగా ఇండస్ట్రీలో సెటిలయిపో యాడు.

అవినాష్‌కన్నా అందగాళ్ళు, నటన, వాచ కంలో పరిపూర్ణత్వం సాధించినవారు కొన్ని వందల మంది ఇండస్ట్రీలో త్రిశంకుస్వర్గంలో కొట్టుమిట్టాడుతున్నట్టు స్టూడియోల చుట్టూ తిరుగాడుతున్నారు. వారెవరికీ రాని అవ కాశం అవినాష్‌కి రావడమంటే ఒక్కసారి అదృష్టందే పైచెయ్యేమోననిపిస్తుంది. అదీ తప్పేనేమో! కృషికీ పట్టుదలకూ, నటనకీ రూపానికీ అవకాశం తప్పక లభించి తీరుతుంది.

డైరెక్టర్ ప్రొడ్యూసర్‌లు ఎదురెళ్ళి అవినా ష్‌కి విష్‌చేశారు.

"హాసిని వచ్చిందా? " అవినాష్ ప్రొడ్యూ సర్‌ని అడగడం వినిపించింది అరుణ్‌కి.

"ఇంకా రాలేదు సార్"

అవినాష్ ముఖంలో చిరాకు కదలాడడం గమనించాడు అరుణ్. హీరో తలాడించి డ్రస్సింగ్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

షాట్‌కి అందరూ రెడీ అవుతున్నట్టు అర్థ మయింది అరుణ్‌కి. అందరూ షూటింగ్ మూడ్‌లోకి వెళితే దర్శకుడిని పలకరించడం అసలు కుదరదు.

అందుకే అతడు ఓ అడుగు ముందుకే శాడు. మరో కారు పోర్టికోలో ఆగడంతో అక్కడివారంతా అటుగా తలలు తిప్పారు. అందరితోపాటు అరుణ్ కూడా అటుకేసి చూశాడు.

ముప్పయ్యేళ్ళుండ వచ్చనిపించింది ఆమెకు. ఛామన ఛాయరంగే కానీ నిరం తరం మేకప్‌తో తనువులోని అధిక భాగం రుద్దడం వలన కాబోలు చర్మం అదోరకమ యిన నునుపుతో మెరిసిపోతోంది. సూపర్. స్ట్రక్చర్. అయితే ఆమెలో అన్నింటికన్నా ఆక ర్షించేవి ఆమె కళ్ళు. ఎప్పుడూ మత్తుగా తూలిపోతూ చూపులతోనే కైపెక్కించేలా కనిపిస్తాయి. ఆ చూపులే ప్రేక్షకులను సమ్మోహితులను చేసేవి. ఆమె డ్యాన్స్ ఉంటే చాలు సినిమా హిట్ అయ్యేలా తయారయింది వాతావరణం. అందువల్లే ప్రతి నిర్మాత తన సినిమాలో నలుగురు హీరోయిన్లను పెట్టుకున్నా- ఆమె కనీసం మూడు నిమిషాలు కనిపించే డ్యాన్స్ ఒకటి పెట్టి తీరుతాడు. ఆమె డ్యాన్స్ తన సిని మాకు కమర్షియల్‌గా చాలా ప్లస్ అని ప్రతి నిర్మాతకూ తెలుసు.

ఆమె ఎవరో అరుణ్‌కి తెలుసు. హాసిని! తన నడుము ఊపులతో కైపెక్కించే చూపు లతో తెలుగు ప్రేక్షకులను మత్తెక్కిస్తున్న సెక్సీ డ్యాన్సర్ హాసిని.

ఆ నిర్మాత, దర్శకుడు ఆమె రావడం చూసారుగానీ ఎవ్వరూ ఎదురెళ్లలేదు. ఆమె వారి దగ్గరగా వచ్చింది.

"నమస్తే డైరెక్టర్‌జీ" అంది నమ్రతగా చేతులు జోడిస్తూ.

"రామ్మారా! హీరోగారు కూడా వచ్చేశారు. నీ కోసమే అందరూ వెయిటింగ్"

"సారీ సార్! సారథిలో గ్రూప్‌సాంగ్ చేసి



వస్తున్నాను. కొద్దిగా లేటయింది"

"ఫర్వాలేదులే హాసినీ!" డైరెక్టర్ తన కుర్చీలో కూర్చుంటూ "కూర్చోమ్మా" అన్నాడు ఆమెతో. హాసిని డైరెక్టర్‌గారి పక్కనే ఉన్న కుర్చీలో కూర్చుంది. డైరెక్టర్ ఆమెకు సీన్ వివరించడం మొదలుపెట్టాడు.

"హాసినీ! ఈ సీన్‌లో నువ్వు నిరుద్యోగి అయిన హీరోగారు రోడ్డుమీద వెళుతుంటే, నచ్చి నీ గెస్ట్‌హౌస్‌కి తీసుకొచ్చుకున్నావన్న మాట. ఇక్కడ హీరోగారిని టెంప్ట్‌చేస్తూ నువ్వు పాట పాడుతున్నావ్... పాట పల్లవి ఏమిటంటే..."

ఆమె నిట్టూర్పులాంటి నవ్వు నవ్వింది. ఆమె నవ్వు గమనించాడు డైరెక్టర్. "ఏమిటి హాసినీ? ఎందుకు నవ్వుతున్నావ్?"

"అది కాదుసార్! ఇప్పుడే అక్కడ ఓ సాంగ్‌లో ఒళ్ళంతా చూపించి వస్తున్నాను. ఇక్కడికి వచ్చాక మళ్ళీ ఎక్స్‌పోజింగ్ డాన్సే!"

ఆమె గొంతులో ఆవేదన ధ్వనించింది. "నాకు ఈ ఎక్స్‌పోజింగ్ క్యారెక్టర్ తప్ప కాస్త మంచి క్యారెక్టర్ ఇవ్వకూడదా?"

వారిద్దరి సంభాషణా పది అడుగుల దూరంలో ఉన్న అరుణ్‌కి వినిపిస్తోంది.

డైరెక్టర్ నవ్వాడు. ఆ నవ్వులో వ్యంగ్యం ఆమె గుర్తించిందో లేదో తెలియదుగానీ అరుణ్‌కి అర్థమయింది. "భలేదానివే హాసినీ! మా సినిమాలు హిట్ కావడం నీకిష్టంలేదా?"

ఆమె కాస్త విస్మయంగా "అదేమిటి సార్ అలా అంటారు? సినిమాలు హిట్ కాకూడదని నేనెందుకంటాను? మీ సినిమాలు హిట్ కావడమే నాకిష్టం"

"హిట్ కావాలని కోరుకునే దానివి ఎక్స్‌పోజ్‌చేయాలి. నువ్వెంతగా చూపిస్తే మా సినిమా అంతగా హిట్ అవుతుంది. అలా కాకుండా హాసినికి చీరకట్టి యాక్ట్‌చేయించినా లేక హీరోగారికి మేకప్ లేకుండా చూపించినా జనం చూడరు" డైరెక్టర్ వెకిలిగా నవ్వాడు.

ఆమె ముఖం రక్తం లేనట్లుగా పాలిపోవడం అరుణ్ గుర్తించాడు. ఎందుకో... ఎందుకో తెలియదు... అప్పటివరకూ ఆమె అంటే ఒళ్ళంతా చూపించే ఓ 'అంగడి బొమ్మ' అనే అనుకునేవాడు. సినిమా తెర మీద ఆమెను చూసినప్పుడు కొద్దిగా ఇరిటేటింగ్‌గా అనిపించేది. కాని ఇప్పుడు ఆమె మాటలు వింటుంటే ఆ మనిషిలో మరో మనిషి ఉన్నట్లుగా తోస్తోంది.

అయితే అతడు ఆమె గురించి ఎక్కువగా ఆలోచించలేదు. మరో నిముషం గడిస్తే డైరెక్టర్ షూటింగ్ మూడ్‌లోకెళ్ళిపోతాడేమో నన్న ఆత్రుతతో అతడు ఉన్నాడు. ఆ మూడ్‌లోకి వెళ్ళిపోయాక డిస్టర్బ్ చేస్తే కసురుకుంటాడేమో! ఇప్పుడయినా కసురుకోడనే హామీ లేకపోయినా, అప్పటి మీద ఇప్పుడే మేలన్న ఆలోచన అతడిని ముందుకు నడిపించింది.

"నమస్తే సార్"

హాసినితో మాట్లాడుతున్న డైరెక్టర్ తల తిప్పి అతడికేసి చూస్తూ ప్రశ్నార్థకంగా తలాడించాడు. ఆ చూపులో కొంత దర్పం, మరికొంత అహం, ఇంకొంత విసుగు కదలాడాయి.

"...నా పేరు అరుణ్ సార్! యాక్టింగ్ మీద చాలా ఇంట్రస్ట్ వుంది. మీరేదయినా మంచి కేరక్టర్ ఇస్తారేమోనని మీ దగ్గరకు వచ్చాను..."

ఈసారి డైరెక్టర్ ముఖంలో విసుగు మరింత స్పష్టంగా కనిపించడమేకాదు, మాటల్లోనూ అది ప్రస్ఫుటించింది.

"వేషాలడిగేందుకు వేళాపాళా లేదటయ్యా! మేము మా బిజీలో, టెన్షన్ పడుతుంటే మీ వేషాలు గొడవొకటి"

ఇంతవరకూ ఎవ్వరూ తనను పల్లెత్తు మాట అని ఎరుగరు. ఇతరుల ముందు అవమాన భారంతో తలదించుకోవలసిన పరిస్థితి కూడా తనకెన్నడూ ఎదురుకాలేదు.




ఆ డైరెక్టర్ మాటలకు మనసు విలవిలలా డింది. ముఖం మాత్రం కందగడ్డలా ఎర్రబ డింది.

అతడి ముఖంలోని ఫీలింగ్ డైరెక్టర్ మాత్రమేకాదు హాసిని కూడా గమనిం చింది. అతడు ఇండస్ట్రీకి దగ్గరగా మొదటి సారి వచ్చాడన్నది వారిద్దరికీ అర్థమయింది. లేకపోతే ఇక్కడివారు ఆ కొద్దిమాటలకే అలా చిన్నబుచ్చుకోరు.

అయినా అతడు అక్కడే ఆగిపోయాడు.

డైరెక్టర్ ఏమనుకున్నాడో ఏమో, " సరేలే వయ్యా! నెక్స్ట్ సినిమా స్టార్ట్ చేసేముందు కనిపించు" అన్నాడు.

అతడు వెనుదిరిగి నాలుగడుగులు ముందుకేశాడు. హాలు దాటబోతూ ఆగి వెనక్కి చూసాడు. డైరెక్టర్ హాసినివైపు చూస్తున్నాడు. హాసిని మాత్రం తనవైపు చూస్తోంది.

అరుణ్ తల తిప్పుకుని ముందుకు సాగి పోయాడు.



"ఒక డైరెక్టర్ 'నో' అని ముఖాన చెప్పేశా డన్నమాట? "

అరుణ్ ఆ సమయంలో తన కాళ్ళను గట్టిగా రుద్దుకుంటున్నాడు. ఆరోజు అతడు సుమారు పాతిక కిలో మీటర్లు పైగా నడిచి ఉన్నాడేమో, కాళ్ళు లాగేస్తున్నాయి. రూమ్‌కి వచ్చాక ఆలోచిస్తే, నేనేనా ఇంతదూరం నడి చింది అనిపించింది. అతడు రమేష్ మాట లకు తలెత్తి చూశాడు. రమేష్ ముఖంలోని ఫీలింగ్ ఏమిటో తెలిసిపోయింది. చులకన భావం... ఓ విధమైన ఎగతాళి. అతడు నెమ్మదిగా తలాడించాడు.

"నువ్వు ఏమనుకోనంటే ఓ మాట చెప్పనా? "

"చెప్పు" నీరసంగా పలికాడు.

రమేష్ కొద్ది క్షణాలు మౌనంగా ఉన్నాక చెప్పడం మొదలుపెట్టాడు. "నాకు తెలిసి సినిమా ఇండస్ట్రీలో హీరోలు, డైరెక్టర్లు, నిర్మా తలు వారి కొడుకులనే హీరోలుగా చేస్తారు. బయటనుండి వచ్చినవాడు సినిమా హీరో కావడం కష్టంకాబోదుగానీ, అలా కావడానికి ఎక్స్‌ట్రార్డినరీ క్వాలిఫికేషన్సో లేదా కాసింత అదృష్టమో ఉండితీరాలి. ఎన్ని క్వాలిఫికే షన్స్ ఉన్నా, అదృష్టం కూడా వెన్నంటి ఉన్నా ఇంత తక్కువ సమయంలోనే హీరోగా మారగలగడం అన్నది హామీలేని విషయం. కాబట్టి కాస్తో కూస్తో డబ్బు ఉంటేనే మనం తృప్తిగా తిని నిశ్చింతగా ప్రయత్నాలు చేసుకోడానికి వీలవుతుంది. అది తెలిసినవారు జేబులో వేలు, లక్షలు వేసుకుని వచ్చి స్టూడియోల చుట్టూ తిరుగు తుంటారు. కాని నువ్వు సినిమా హీరోనవు తానంటూ జేబులో వందరూపాయలయినా లేకుండా రావడం నాకు ఆశ్చర్యం కలిగి స్తోంది. అఫ్‌కోర్స్! అది ఎంత పందెమయి నప్పటికీ కాలపరిమితి, డబ్బులేమి అనేవి ఇబ్బంది కలిగించే అంశాలు..."

అరుణ్ మౌనంగా ఉన్నాడు. జవాబు చెప్పడానికి కూడా ఓపికలేదు. జవాబు చెప్పడానికి ఓపిక లేకపోవచ్చుగానీ, ఆలో చించే మనసుకు అలసట కలగలేదు. మూడురోజుల క్రితం తన పోషణభారాన్ని స్వీకరించేసి, సర్వం ధారపోసి తనకోసమే కృషి చేస్తానన్నట్టు మాటాడిన మిత్రుడు ఇంతలోనే డబ్బులేమి వలన ఏర్పడే ఇబ్బం దులు చెప్పడం ఆశ్చర్యం కలిగిస్తోంది.

మనుషులు... మనుషులు ఇంత త్వరగా మారిపోతారా అనిపిస్తుంది. ఈ ప్రపంచాన్ని మార్చే శక్తి మాత్రమే కాదు, అనుబంధం ఆత్మీయతలను శాసించేశక్తి డబ్బుకి ఉందేమోననిపిస్తోంది.

"...ఇప్పటికయినా మించిపోయిందిలేదు. డబ్బులేకుండా కష్టపడతానన్న షరతు తొలగించేసి మీ నాన్నకు ఒక జాబు రాయి. తిరుగు టపాలో డబ్బు వచ్చి తీరుతుంది. అప్పుడు ఈ కాళ్ళు వత్తుకోవడం, కడుపు మాడ్చుకోవడం మానేసి హుందాగా వెళ్ళి ఛాన్స్ అడగవచ్చు. ఇంకో విషయం నువ్విలా కడుపు మాడ్చుకుని అస్థిపంజరంలా తయారయ్యావనుకో నీకు హీరో వేషంకాదుగదా... శవం వేషం కూడా ఇవ్వరు.. అది గుర్తుపెట్టుకో..."

అతడలా ఆలోచనల్లో ఉండగానే రమేష్ విసుగ్గా పలికాడు. "ఏమిత్రా, నేను అలసిపోయేలా మాట్లాడుతున్నా, నువ్వు నోరు విప్పి ఒక్కమాట... ఒక్కమాట మాట్లాడవేంటి? "

"ఏం మాట్లాడను? " నిర్లిప్తంగా అన్నాడు అరుణ్.

"నా మాట విని ఇంటినుండి డబ్బు తెచ్చుకోవడమో లేదా హాయిగా ఇంటికి తిరిగి వెళ్ళిపోవడమో చెయ్యి" చెప్పాడు రమేష్.

అరుణ్ తల అడ్డంగా ఆడించాడు. "చెయ్యను... ఆ రెండూ చెయ్యను" స్థిరంగా పలికాడు అతడు.

ఈసారి రమేష్ ముఖంలో అసహనమే కాదు, చిరుకోపం కదలాడి, గొంతులో వ్యంగ్యం పలికింది. "అయితే నువ్వీ జన్మకి హీరో కాలేకపోవటమేకాదు, ఇక్కడే ఏదో హోటల్‌లో సర్వర్ ఉద్యోగం చేస్తూ స్టూడియోల చుట్టూ జీవితాంతం తిరగాల్సి వస్తుంది. అప్పుడు నీ మేనమామ నీకిష్టమయిన రాజీని మరెవరికో ఇచ్చి పెళ్లి చేసేస్తాడు... చెయ్యడామరి? నువ్వు అటు హీరోవీకాక, ఇటు మంచి ఉద్యోగం సంపాదించుకోలేకపోతే అసమర్థుడయిన వ్యక్తి కించే జమ అవుతావ్! అసమర్థుడిని అల్లుడిగా చేసుకోవాలని ఎవ్వరూ అనుకోరు"

అతడి ఒక్కోమాట ఒక్కో బాణంలా మనసుకు తాకుతుంది. అరుణ్ పెదవులు బిగపట్టి అతడి మాటలు మౌనంగా వింటున్నాడు.

"పోనీ... ఇంకోపని చెయ్యరా"

అరుణ్ తలెత్తి మిత్రుడి ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఏ కంపెనీలోనయినా జాబ్ చూసుకో!"

అరుణ్ నెమ్మదిగా తలాడించాడు. ఇప్పుడిప్పుడే అతడికా ఆలోచన కలుగుతోంది. మరో వ్యక్తిమీద ఆధారపడి, అతడికి బరువై బాధపెట్టి, తనూ అవమానపడడంకన్నా, స్వంతంగా కొంత సంపాదించుకుంటూ ప్రయత్నాలు చేయాలనిపిస్తోంది.

"నేనూ అదే అనుకుంటున్నాను"

రమేష్ వెంటనే హుషారుగా "మరి మా కంపెనీలో ఉద్యోగం చూడమంటావా? " అడిగాడు.

అరుణ్ చెప్పాడు, "మీ కంపెనీలో కాదు... సినిమా ఇండస్ట్రీలోనే చిన్నపని వెతుక్కుంటాను"

"అలా ఎందుకు? "

"నేను కోరుకున్న రంగానికి అందుబాటులో ఉంటే అవకాశం అందుకునేందుకు వీలుంటుంది. ఆ రంగంలోని కష్టనష్టాలు, లోటుపాట్లు తెలుస్తాయి. అందుకే ఆ రంగంలో ఏదయినా చిన్న జాబ్ చూసుకుంటాను"

రమేష్ ముఖంలో అసంతృప్తి కదలాడింది. ఏదో చెప్పబోయి ఆగిపోయి "సరే నీ ఇష్టం" అన్నాడు.

ఆ రాత్రి అరుణ్‌కి విపరీతమైన ఆకలి అనిపించినా అలసట ఎక్కువయి సరిగా తినలేకపోయాడు. ఏదో తిన్నాననిపించి





బెడ్‌మీద వాలడంతోనే నిద్రముంచుకొచ్చేసింది.



ఆరోజు ఉదయమే లైబ్రరీకెళ్లి పేపర్ చూస్తే సినిమా పేజీలో కనిపించింది... ఆ సిటీకి దూరంగా టిబి హాస్పిటల్ దగ్గర ప్రముఖ దర్శకుడు ఈశ్వర్‌కుమార్ షూటింగ్ జరుపుతున్నారని.

ఈశ్వర్‌కుమార్‌కి కొత్తవారిని ఎంకరేజ్ చేసే డైరెక్టరని పేరుంది. ఆ డైరెక్టర్‌ని ఇంటిదగ్గరో, స్టూడియోల దగ్గరో కలుసుకోవడం వీలుకాదు కాబట్టి, అతడు టిబి హాస్పిటల్ దగ్గరకే వెళ్లడానికి నిర్ణయించుకున్నాడు.

రమేష్ జేబులో డబ్బులున్నాయా? అని ప్రశ్నించలేదు. అనవసరంగా షెల్టర్ ఇవ్వడంతో భోజనం ఖర్చు నెత్తిన పడిందే అని అప్పటికే అతడు బాధపడుతున్నట్టుంది అతడి ప్రవర్తన.

రూమ్ నుండి హాస్పిటల్ వరకూ పదీ, పన్నెండు కిలోమీటర్లు దూరం ఉంటుందని తెలుసు. జేబులో చాయ్ తాగేందుకు కూడా పైసలులేవు. అయినా అతడు ఆ చోటుకు వెళ్లేందుకే నిర్ణయించుకున్నాడు.

జేబులో పైసా లేకపోయినప్పటికీ నీట్‌గా డ్రస్ చేసుకుని రూమ్ దాటాడు.

రమేష్ ఆఫీసు ముందు స్కూటర్ దిగాక, అక్కడినుండి టిబి హాస్పిటల్ వైపు నడక సాగించాడు. హాస్పిటల్ దగ్గరకు చేరుకునే సరికి రెండు గంటలు పైగానే పట్టింది.

ఆ చోటకూడా నిన్న చూసిన లొకేషన్‌లోలానే వందమందికి పైగా జనంతో షూటింగ్ జరుగుతోంది. అయితే క్రితం రోజు షూటింగ్‌కి, నేటి షూటింగ్‌కీ తేడా ఏమిటంటే నిన్నటి షూటింగ్ చూసేందుకు ప్రేక్షకులు లేరు. జూబ్లీహిల్స్, బంజారాహిల్స్ ప్రాంతంలో రోడ్డుమీద, ప్రయివేట్ భవనాలలో అప్పుడప్పుడూ షూటింగ్స్ జరుగుతుంటాయి కాబట్టి అక్కడి వారెవరూ పట్టించుకోరు. అది టిబి హాస్పిటల్ కావడంతో పేషెంట్స్ మాత్రమేకాదు, దారిన వెళ్లేవారు కూడా స్పాట్‌కి వచ్చి చుట్టూ మూగిపోయి ఉన్నారు. పోలీసులు జనాన్ని కంట్రోల్ చేస్తున్నారు.

అతడు షూటింగ్ స్పాట్‌కి దగ్గరగా వెళ్లాడు. హాస్పిటల్ ఆవరణలో ఓ కేరక్టర్ ఆర్టిస్ట్ దగ్గుకుంటూ నడుస్తుంటే హీరోయిన్ కాబోలు పరిగెత్తుకొచ్చి "నాన్నా!" అంటూ ఆయనను కౌగిలించుకుంటుంది. వారి మధ్య కొన్ని డైలాగ్స్ పిక్చరైజ్ చేస్తున్నారు. దర్శకుడు ఈశ్వర్‌కుమార్ సెంటిమెంట్ సీన్స్ పండించడంలో మంచి పేరున్నవాడనే విషయం అరుణ్‌కి గుర్తొచ్చింది.

అతడు గుంపులో ఒకడిగా నిలబడిపోయాడు. ముందుకెళ్లి డైరెక్టర్‌ని కలుద్దామంటే పోలీసులు అడుగుముందుకేయనిచ్చేలాలేరు. అతడు అక్కడే ఆగిపోయి షూటింగ్ చూడసాగాడు. ఏదో సమయంలో పోలీసులు కొద్దిగా తప్పుకుంటే ముందుకు దూసుకెళ్లిపోవచ్చని అతడి ఆలోచన. అందుకే అతడు అలాగే నిలబడి అవకాశం కోసం ఎదురుచూస్తున్నాడు.

షూటింగ్ జరుగుతోంది... అతడు అలాగే నిలబడి ఉన్నాడు. ఓ గంట గడిచిపోయింది. అప్పటికీ డైరెక్టర్‌ని కలిసే అవకాశం మాత్రం రాలేదు. అతడు కాస్త అసహనంగా తలతిప్పి అటూఇటూ చూడసాగాడు.

అలా చూస్తున్నప్పుడు... అతడి చూపులు హాస్పిటల్ రెండో అంతస్థువైపు ప్రసరించాయి. అతడు కళ్లు చికిలించి చూశాడు. నమ్మలేనట్టు పరిశీలనగా చూశాడు. పోల్చుకోవడం కోసమన్నట్టు తదేకంగా చూశాడు.

ఆ వ్యక్తి అస్థిపంజరంలా చిక్కిపోయి ఉన్నాడు. రేపోమాపో కాటికెళ్లే ప్రేతకళ ముఖంలో తాండవిస్తోంది. అయినాసరే...



కేవలం ఆ కళ్లు, ఆ కళ్లలో వాటి మెరుపు తాలూకు శిథిలం స్పష్టంగా కనుపిస్తోంది... ఆ వ్యక్తి...

అరుణ్ గుంపులోనుండి బయటకు కదిలాడు. అలా నడుచుకుంటూ మెట్లెక్కి రెండో అంతస్థుకు చేరుకున్నాడు. ఆ వ్యక్తికి దగ్గరగా వెళ్లాక, "నమస్కారం సార్" అన్నాడు.

పిట్టగోడకు ఆనుకుని షూటింగ్‌కేసి తదేకంగా, తాదాత్మ్యతతో చూస్తున్న ఆ వ్యక్తి తలతిప్పి చూశాడు.

"మీరు... మీరు పీతాంబరంగారు కదూ? "

ఆయన కళ్లల్లో మెరుపు... ఓ కళాకారుడికి చప్పట్లు వినిపించినప్పుడు, అపరిచితులు తనను కళాకారుడిగా గుర్తించినప్పుడు కన్నుల్లో కదలాడే ఆ మెరుపును అరుణ్ స్పష్టంగా చూశాడు. ఆయన కన్‌ఫర్మ్ చేయకుండానే ఆయనెవరో తెలిసిపోయింది.

ఆయనే పీతాంబరం.

ఒకప్పుడు జానపద సినిమాలు తెలుగు చిత్ర జగత్తులో రాజ్యమేలే సమయంలో పీతాంబరం ప్రతినాయక వేషాలకు రారాజు. ఒకవిధంగా నాయక పాత్రధారులకన్నా అధిక పారితోషికం అందుకున్న ప్రతినాయకుడు. ఆ రోజుల్లో సినిమా నిర్మాతలూ, దర్శకులు ఆయన ఇంటి ఎదుట పడిగాపులు కాసేవారని చెప్పుకునేవాళ్లు. ఎంత అడిగితే అంత ఇచ్చి ఆయన్ని తమ చిత్రాల్లో నటించేందుకు ఒప్పించేవారట.

అలాంటి ఓ గొప్పవ్యక్తి టిబి హాస్పిటల్‌లో కనిపించడమేకాదు, అస్థిపంజరంలా ఆ రూపం, దరిద్రనారాయణుడిలా ఆ వేషం... అరుణ్‌ని ఆశ్చర్యపడేలా చేశాయి. అతడు నోటమాటరానట్టు చూస్తున్నప్పుడు పీతాంబరమే పలికాడు,

"అవును... నేనే బాబూ! పీతాంబరా..."





వాక్యం పూర్తి చేయకుండానే ఆయనను దగ్గు ఒక్కసారిగా ముంచేసింది. దగ్గుతూ దగ్గలేక దగ్గుతూ... ముందుకు తూలాడు. అలా తూలుతూ పిట్టగోడ పట్టుకున్నాడు. అప్పటికీ ఆ ఆసరా సరిపోనట్టు ముందుకు జారిపోతున్నాడు.

అరుణ్ చప్పున ఆయనను పట్టుకున్నాడు. అలా పట్టుకోవడంలో ఆప్యాయత మాత్రమేకాదు, ఓ మహానటుడిని తను తాకడం జరిగిందన్న గగుర్పాటు కూడా అతడి అణువణువు ఉత్తేజానికి గురయ్యేలా చేసింది. అతడు ఆయన చేతిని తన మెడ చుట్టూ వేసుకుని గుండెలమీద మెల్లగా రుద్దసాగాడు.

ఆయన ఆ దగ్గునుండి తేరుకునేందుకు మూడు నిముషాలు పట్టింది.

"థాంక్స్ నాయనా!" ఆయన తేరుకున్నాక చిన్నగా నిట్టూర్చాడు. "ఏమిటో ఈ పాడు దగ్గు అప్పుడప్పుడు నా ప్రాణం తోడేస్తుంది. పాడు ప్రాణం పోయేదేదో ఒక్కసారి పోయినా బాగుణ్ణు. ఈ దగ్గుతో చావూ, బతుకూ కాకుండా కాలం సాగిపోతోంది"

"సార్! మీరు... మీరు ఇక్కడ..." ఆ తర్వాత మరేం మాట్లాడాలో అరుణ్‌కి తోచలేదు.

ఆయన నీరసంగా పిట్టగోడ మీద కూర్చున్నాడు. అతడివైపు నిర్లిప్తంగా చూస్తూ "ఏం ఆశ్చర్యంగా ఉందా? " అన్నాడు.

"ఆశ్చర్యం కాక మరేంటిసార్? నాకు బాగా ఊహ తెలిసిన తరువాత మా నాన్నగారితో కలిసి తొలిసారిగా వెళ్లిన సినిమాలో మీరు కత్తిపట్టి యుద్ధం చేసే సీన్ ఇప్పటికీ నా కనులముందు కదలాడుతుంది. తెలిసీ తెలియని ఆ వయసులో సినిమాలో మీరు హీరోని ముప్పుతిప్పలు పెడుతుంటే మిమ్మల్ని తిట్టుకునేవాళ్లం. ఆ తర్వాత ఒక వయసొచ్చాక మీరు కార్లలో తిరుగుతూ, మేడల్లో నివసిస్తూ ఉంటారని తెలుసుకుని మీ గురించి ఎంతో గొప్పగా ఊహించుకునేవాళ్లం. మా ఊహల్లో ఆ స్థాయిలో నిలబ

డిన మీరు ఈ రోజు టి.బి. హాస్పిటల్‌లో ఇలా కనిపిస్తే... ఓ నమ్మలేని నిజాన్ని కన్నులతో చూస్తున్నట్టుంది"

ఆయన పెదాలమీద బలహీనమైన నవ్వొకటి ఉదయించింది. "అదే నాయనా జీవిత మంటే!"

"ఇది... ఇదెలా సంభవం సార్? "

"ఈ ప్రపంచంలో సంభవం కానిదంటూ ఏమీలేదు"

"కాని నిన్న కార్లలో తిరుగుతూ లక్షలు ఖర్చుపెట్టిన వ్యక్తి, నేడు..." అతడు ఆగాడు.

"బికారిగా కనిపిస్తున్నాడేంటి? అని అడగలేక ఆగావుకదూ? నా మీద గౌరవం నన్ను బికారి అని అనకుండా చేసినా ప్రస్తుతం నా పొజిషన్ మాత్రం అదే... బికారిని. హాస్పిటల్ వారి తిండితింటూ బతుకుతున్న అభాగ్యుడిని..." ఆయన పిట్ట గోడ మీదనుండి పైకి లేవడం గమనించి అరుణ్ ఆయన చెయ్యి పట్టుకుని భుజం మీద వేసుకున్నాడు.

ఆయన ఒకసారి ఆ షూటింగ్ వైపు చూసి తల తిప్పుకుని రూమ్‌వైపుగా నడవ సాగాడు. అతడు ఆయనకు అలాగే ఆసరా అందించి పక్కనే నడుస్తున్నాడు.

గదిలోకి వెళ్లాక చూస్తే నాలుగు బెడ్స్ ఉన్నాయి. ఆ మూడు బెడ్స్ మీద పేషెంట్స్‌లేరు. నాలుగో బెడ్‌మీద ఆయన కూర్చున్నాడు. అరుణ్ ఆయన ఎదురుగా నిలబడ్డాడు.

"కూర్చోనాయనా"

ఆయన ఎదురుగా ఉన్న కుర్చీ చూపించాక అతడు వినయంగా కూర్చున్నాడు.

"చెప్పు! నువ్వు జర్నలిస్ట్‌వా? లేక షూటింగ్ చూసేందుకు వచ్చిన వాడివా? "

అతడు కొద్ది క్షణాలు తన అరచేతులవైపు చూసుకున్నాడు.

"జవాబు చెప్పవేం? "

"నేను హీరో వేషం కోసం డైరెక్టర్‌ని అడుగుదామని వచ్చాను!"

ఆయన కొద్దిక్షణాలు అతడిమీదే చూపు నిలిపాడు. ఆ తరువాత సన్నగా నవ్వుతూ అడిగాడు "ఏవూరు మీది"

అతడు చెప్పాడు.

"బాగా చదువుకున్న వాడిలా ఉన్నావ్! మంచి కుటుంబంలోంచి వచ్చిన మనిషిలా కనిపిస్తున్నావ్. నీకు ఈ పిచ్చెందుకు పట్టింది? "

తన ఫ్లాష్‌బాక్ చెప్పడం అవసరమా లేదా అని కొద్ది క్షణాలు ఆలోచించాడు. ఆయనను చూస్తుంటే కలిగిన దగ్గరితనం అనే ఫీలింగ్ చప్పున మనసులోని మాట బయటపెట్టేలా చేసింది.

"నాకు సినిమా పిచ్చిలేదు సార్... నా మరదలికి సినిమా పిచ్చి! నన్ను సినిమా హీరోగా చూడాలనుకుంది. ఆమె కోరిక తీర్చాలనే మా మావయ్యతో ఒక్క సంవత్సరంలో సినిమా హీరో అవుతానని ఛాలెంజ్ చేసి మరీ హైదరాబాదుకి వచ్చాను. మూడు రోజులుగా వేషం కోసం తిరుగుతున్నాను. ఈ రోజు ఇక్కడ ఈశ్వర్‌కుమార్ సినిమా షూటింగ్ జరుగుతుందంటే ఆయన నెక్ట్స్ సినిమాలో నాకు హీరో వేషం ఇస్తాడేమోనని అడిగేందుకు వచ్చాను''

అతడు మాటలు ఆపాడో లేదో! అవతలి వైపునుండి నవ్వు వినిపించింది. ఆశ్చర్యంగా అతడు ఆయనకేసి చూశాడు. ఆయన నవ్వుతూ వున్నాడు. గుండెలు పట్టుకుని నవ్వుతూ ఉన్నాడు... నవ్వుతూ... దగ్గు అడ్డు రావడంతో ఆగిపోయాడు.

"ఏమిటి సార్ నవ్వుతున్నారు? "

"ఒక సంవత్సరం... ఒక్క సంవత్సరంలో సినిమా హీరో అయిపోతానని పందెంకాసి మరీ ఈ ఇండస్ట్రీకి వచ్చావా? ఒక్క సంవత్సరం.. ఒక్క సంవత్సరంలోనే హీరో అయిపోదామనే...? " ఆయన మళ్లీ నవ్వబో

యాడు. కాని నవ్వడానికి శక్తి చాలదన్నట్టు ఆగిపోయాడు.

అరుణ్ ముఖం సిగ్గుతోనో లేక మరే అర్థంకాని భావంతోనో ముడుచుకుపోయింది.

నవ్వు ఆపాక ఆయన అతడి ముఖంలోనికి చూశాడు. ముడుచుకుపోయిన ఆ ముఖం చూస్తే ఆయనకు బాధగా అనిపించిందేమో వెంటనే ఆప్యాయంగా భుజం మీద చెయ్యేశాడు. "క్షమించవోయ్! నీ మాటలు వింటే నాకు పసిపిల్లాడు అమాయకత్వంతో పలికే పలుకుల్లా అనిపించాయి. అందుకే అలా నవ్వాను. అంతే తప్ప నిన్ను బాధపెట్టాలని కాదు..."

"ఫర్వాలేదు సార్! నా నిర్ణయం విన్నాక నా ఫ్రెండ్స్ కూడా నన్ను అమాయకుడిలానే భావిస్తూ ఎగతాళి చేస్తున్నారు. కానీ ఎవరేమన్నా నా దారి నాదే. నా గమ్యం వైపు సాగిన నడక కాలపరిమితి ముగిసేదాకా ఆగదు. ఈలోపు విజయం సాధిస్తే సరే, లేకపోతే ఓడిపోయానని ఒప్పుకుని ఏ ప్రయివేట్ కంపెనీలోనో ఉద్యోగం చూసుకుని కాలం గడిపేయడం మొదలు పెడతాను"

పీతాంబరం అరుణ్‌కేసి తదేకంగా చూశాడు. ఆ తర్వాత అడిగాడు, "భోంచేశావా? " అని.

ఆ ప్రశ్న అదిమిపెట్టిన ఆకలి తిరిగి విజృంభించేలా చేసింది. మరచిపోతున్న ఆకలి బాధ గుర్తుకు వచ్చేలా చేసింది. ఉదయం రమేష్ ముభావంతో కడుపునిండేలా తినలేకపోయాడు. ఏదో అనీజీనెస్. తనపట్ల నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించేవాడి సంరక్షణలో తప్పనిసరయి ఉంటున్నానన్న ఫీలింగ్ ఆకలిని అణిచేయసాగింది. అందువల్లే తిన్నాననిపించి లేచేశాడు. మరి ఇప్పుడీయన పలుకులు...

ఆయన అతడి ముఖంలోని ఫీలింగ్స్ గమనిస్తున్న వాడల్లా, చప్పున తల తిప్పుకుని పక్కనే ఉన్న అల్మైరాలోంచి బ్రెడ్ తీశాడు. "తీసుకో... హాస్పిటల్ వాళ్లు ఇచ్చే బ్రెడ్‌కదా? అంత టేస్ట్‌గా మాత్రం వుండదు" అతడికి అందిస్తూ చెప్పాడు.

అరుణ్ మరేమి ఆలోచించలేదు. వద్దూ అని తిరస్కరించనూలేదు. ఆయన అందించిన బ్రెడ్‌ని ఆప్యాయంగా అందుకుని తింటూ ఉంటే ఎందుకో తెలియదు జీవితంలో తొలిసారిగా కన్నులలో నీళ్లు తిరిగాయి. ఆకలి... ఆకలి బాధ ఇంత భయంకరంగా ఉంటుందా? మూడు నిముషాల పరిచయంలోనే అవతలివ్యక్తి అందించిన ఆహారాన్ని ఆబగా తినేంత హీనస్థితికి మనిషిని దిగజారుస్తుందా? అతడు తింటూనే ఉన్నాడు. మనసు మాత్రమే ఖాళీగా ఉండడంతో అలా ఆలోచించిందేమో!

తింటున్నంతసేపూ అతడికేసి చిరునవ్వుతో చూస్తున్న పీతాంబరం, అతడు తినడం పూర్తిచేశాక జగ్‌లోని మంచినీళ్లు గ్లాసులోకి వంచి అందించాడు.

అతడు నీళ్లు తాగుతూ ఆయన తనకేసే చూస్తుండడం గమనించి "ఏమిటిసార్! అలా చూస్తున్నారు? మీరు మాట వరసకి తినమంటే తినేసి మీకు మధ్యాహ్నం తినేందుకు ఏమీ లేకుండా చేశానా? "

ఆయన తల అడ్డంగా ఆడించాడు... "అదికాదు"

"మరేంటి సార్? "

"నిన్ను చూస్తుంటే నాకు నా గతం గుర్తొస్తుంది. ఆ రోజుల్లో మద్రాసు పాండీబజార్లో అరకప్పు టీ తాగి స్టూడియోల చుట్టూ తిరిగిన దృశ్యాలు సజీవ చిత్రాల్లా కనుల ముందు కదలాడుతున్నాయి. ఆ రోజు నేను... నేడు నువ్వు... రేపు మరొకరు... సినిమా ప్రపంచంలో అవకాశమనే అదృష్టాల్ని అందిపుచ్చుకుని, మన గొప్పతనం నిరూపించుకుని, అందలమెక్కి మన కీర్తిప్రతిష్టలు నలుగురికీ చాటి చెప్పాలనే ప్రయత్నంలో సాగిపోయే ఎందరో...




ఎందరో మనుష్యులు. అదో నిరంతర ప్రవాహం.. కాని నీకు తెలుసో లేదో... స్టూడియోల చుట్టూ తిరిగే వేలమంది వ్యక్తు లలో ఏ ఒకరిద్దరో మాత్రమే విజయం సాధిస్తారు.

అతడు నిశ్శబ్దంగా తలాడించాడు. ఆయన అలసిపోయినట్టు గాఢంగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వదులుతుంటే అతడు ఆయన వైపు చూడసాగాడు. ఒక అనుభవజ్ఞుడి మాటల్లో తనకు కావలసిన నిజాలు దొరు కుతాయి. ఆయన అనుభవాలు తనకు పాఠాలు అవుతాయి. అందుకే ఒక సద్గు రువు యొక్క మాటలు శిష్యుడు వింటు న్నంత భక్తిశ్రద్ధలతో అతడు ఆయన మాటలు వింటున్నాడు.

"అయితే సినిమా ప్రయత్నాలు చేసేవా రికి అన్నింటికన్నా ముఖ్యంగా కావలసిన లక్షణాలు సహనం, పట్టుదల, ఏకాగ్రత, నిరంతర ప్రయత్నం! గోల్డెన్‌స్పూన్ నోట్లో పెట్టుకుని తల్లిదండ్రుల పేరు ప్రతిష్టలు ఆధారం చేసుకుని లక్షల పెట్టుబడితో సిని మాలు నిర్మించి హీరోలుగా రూపుదిద్దుకునే వ్యక్తులు నేడు అధికమయ్యారుగానీ, ఒక ప్పుడు సినిమా నటుడు కావాలన్న ప్రతి వాడూ నీలానే శ్రమపడ్డాడు. ఆ శ్రమ లోంచే తపన పుట్టుకొచ్చేది. ఆ తపనే ఒక మంచి నటుడిని సృష్టించేది. నేడూ హీరో లున్నారు కానీ వారు శ్రమపడకుండా తపన పడకుండా నటించడంతో మనకు హీరోలు కనిపిస్తున్నారేగానీ పాత్రలు మాత్రం కని పించడంలేదు. ఆపాత్ర పోషణలో ఏమాత్రం జీవం ఉండడంలేదు..."

ఆయన మరోసారి గాఢంగా ఊపిరిపీల్చి వదిలాడు. అప్పటికే ఆయన పూర్తిగా అల సిపోయినట్టు ఛాతీ ఎగిరెగిరి పడుతోంది. ఓ భయంకరమైన వ్యాధి ఆయనను చాలా వరకు క్రుంగదీసిందని అతడికి అర్థమ యింది.

అయినప్పటికీ ఆయనలోని కళాకారుడు లేని ఓపికను తెచ్చుకుంటున్నాడు. ఒక్కో మనిషిని చూస్తే ఒక్కొక్కరికి తెలియని ఆప్యాయత కలుగుతుంది. తనకు దగ్గర వాడనే ఫీలింగ్ ఏర్పడుతుంది. తనను చూస్తే ఆయనకు అలాంటి భావమే కలిగి ఉండొచ్చేమోననిపించింది అతడికి.

"... నీ తపన చూస్తుంటే నా గతం గుర్తుకొచ్చిందన్నానుగా! అలాగే నీ తపన నిన్నో మంచి నటుడిగా రూపుదిద్దగలదని నాకు తోస్తోంది. ప్రయత్నమే మనిషిని మహనీయుడిని చేస్తుంది. నీ ప్రయత్నమే నిన్ను నీ గమ్యం వైపు నడిపిస్తుంది. కాబట్టి ప్రయత్నించు... నిరాశపడకుండా ప్రయ త్నిస్తూ ఉండు తప్పకుండా విజయం సాధి స్తావ్"

ఆయన మాటలు, ఇచ్చిన ఆదరణ కలిసి ఓ అపురూప భావంగా మారి అరుణ్ మన సును కదిలించింది. అతడు మునుపె న్నడూ ఎవరికీ పాదాభివందనం చేసి ఉండ లేదు. ఆ క్షణం ఆయనపట్ల కలిగించిన గురుతుల్యభావం చప్పున ఆయన పాదాలం టేలా చేసింది. రాజకీయ నాయకులు చేసే పాదాభివందనాలు వేరు. ఆ పాదాభివంద నాలలో కోరిక ఉంటుంది. అవతలి వ్యక్తి 'అహంకారాన్ని' తృప్తిపరచి వారి దయా దాక్షిణ్యాలకోసం ప్రాకులాడే స్వార్థం కనిపి స్తుంది. కాని... ఒక కళాకారుడు మరో కళాకారుడికి చేసే ఆ పాదాభివందనం... ఆ వ్యక్తికి కాదు, ఆ వ్యక్తిలోని కళాకారుడికే ఆ వందనం అందుతుంది. అది ఆ కళాకారు డికీ తెలుస్తూనే ఉంటుంది. చేసిన వ్యక్తికి అర్థమవుతుంది. ఆ వందనం ఒక పూజ్యా భావం.

"మీ ఆశీస్సులే నన్ను విజయం సాధిం చేలా చేస్తాయని ఆశిస్తున్నాను"

ఆయన వంచిఉన్న అతడి తలమీద చేతులు వేశాడు. ఆ తర్వాత భుజాలు పట్టి మెల్లగా లేవనెత్తాడు.

"ఆశీస్సులే కాదు! మరి కొన్ని మెళకువలు



చెబుతాను వింటావా? " అన్నాడు.

"నేను అనుభవజ్ఞులైన మీరు ఏం చెప్పినా వినిపాటించాలనే అనుకుంటు న్నాను"

ఆయన కొద్దిక్షణాలు ఆగి ఆ తర్వాత చెప్పాడు. "మెళకువలు చెబుతాను. కాని అంతకన్నా ముందు ఓ సలహా చెబుతాను విను... నాకు హీరోయిన్ వేషం కావాలని ఒక ఆడపిల్ల సినిమా ఆఫీసుకెళితే, కనీసం స్క్రీన్‌టెస్ట్ వరకయినా ఎంటర్‌టైన్ చేస్తారు. ఎందుకంటే, ఆ స్క్రీన్‌టెస్ట్ పేరుతో ఆమె నుండి దోచుకోదగ్గదేదయినా ఉంటే దోచుకుందామనే ఆలోచన అక్కడివా రికి కలుగుతుంది. కానీ ఓ మగాడు హీరో వేషం కావాలని సినిమా ఆఫీసుకెళితే ఒకే ఒక మాటతో బయటకు పంపేస్తారు. కారణం ఆ మగాడిదగ్గర దోచుకోతగ్గది ఏమీ లేదు కదా? ఇక పెట్టుబడిలాంటి మనీమేటర్స్ ఆఫర్ చేస్తే అది వేరే విషయం. కానీ నిన్ను చూస్తుంటే... ఆకలి ప్రేగులకే అవకాశం కోసం తిరుగుతున్నట్టు కనిపిస్తుంది. కాబట్టి రెండో విషయంలో నువ్వు నెగ్గుకురాలేవు. ఇలా నువ్వు ప్రయ త్నాలు చేస్తూఉంటే ఏనాటికో ఒకనాటికి అవకాశం రావచ్చేమో, చెప్పలేం. కాని అలా అవకాశం వచ్చేసరికి ఈ ప్రయత్నాలలో నువ్వు నిరాశపడిపోతావ్. ఆకలికి అల్లాడి పోతావ్..."

అతడు నిలువుగా తలాడించాడు. "అవును... అది నా కిప్పుడిప్పుడే అర్థమవు తోంది"

"అందుకే నా మాట విని నువ్వు 'ఒకే సారి హీరో' ప్రయత్నం మానేసి, సినిమా ఇండస్ట్రీలో చిన్నవేషం కోసమో లేదా అదే ఇండస్ట్రీలో మరేదయినా డిపార్ట్‌మెంట్‌లోనో చేరిపో. అప్పుడు ముందుగా నీ ఆకలి తీరు తుంది. ఆ తర్వాత పరిచయాలు పెరుగు తాయి. ఆ ఇండస్ట్రీకి దగ్గరగా ఉండడంతో 'అవకాశాలు' వెతుక్కోవడమూ సులభమవు తుంది"

తనకు వచ్చిన ఆలోచన్నే ఆయన కూడా బలపరచడం మానసికంగా ఎంతో ఉత్సాహా న్నిచ్చింది అరుణ్‌కు. "అలాగే... అలాగే సార్" అన్నాడు వెంటనే.

అప్పుడడిగాడాయన "ఇండస్ట్రీలో నీకు తెలి సిన వ్యక్తులెవరయినా ఉన్నారా? "

అతడు తల అడ్డంగా ఆడించాడు.

ఆయన కొద్దినిమిషాలు మౌనంగా వుండి అతడి షర్ట్‌జేబుకేసి చూసి "ఆ పెన్ ఇటివ్వు" అన్నాడు. అరుణ్ అప్రయత్నం గానే జేబులోంచి పెన్‌తీసి అందించాడు.

ఆయన అల్మైరాలో ఉన్న ప్రిస్క్రిప్షన్ లోంచి ఓ కాగితం తీసి దాని వెనక ఏదో రాశాడు. అది అతడికి అందిస్తూ చెప్పాడు. "ఈ కాగితంమీద రాసి ఉన్న అడ్రస్‌కెళ్ళి ఆ వ్యక్తికి ఇవ్వు. ఆయన ఏదయినా చెబితే, అది నీకు అంగీకారమయితే చెయ్యి. లేక పోతే మరో పని చేద్దాం.... నువ్వు మాత్రం వీలయినప్పుడల్లా ఇలా వస్తుండు"

అతడు ఆయన అందించిన కాగితం తీసి జేబులో పెట్టుకున్నాడు.

మరి కొద్దినిమిషాల తర్వాత ఇద్దరూ రూమ్‌లోనుండి బయటకు నడిచారు. వరం డాలో నిలబడి అటు చూస్తే షూటింగ్ ఇంకా జరుగుతూనే ఉంది.

అరుణ్ మాత్రం షూటింగ్‌కేసి చూడడం లేదు. ఆయననే చూస్తున్నాడు. ఆ చూపుల్లో ఎన్నో ప్రశ్నలు ఉన్నాయి. నిన్నటి లక్షాధికారి, నేడు బికారిలా... అందులోనూ కాటికి కాళ్ళు జాపుకున్నట్టు ఈ టి. బి. హాస్పి టల్‌లో... ఇది... ఇదెలా జరిగింది?

అదే ప్రశ్న ఆయనను అడిగాడు.

ఆయన నవ్వి ఊరుకున్నాడు. జవాబు చెప్పలేదు. ఆయనకు జవాబు చెప్పడం ఇష్టం లేదన్నట్టు అర్థంకావడంతో అతడు మరి రెట్టించలేదు.

"ఆల్‌రైట్ సార్! నేను... ఆ వ్యక్తిని కలు

సుకున్నాక ఆ తర్వాత మిమ్మల్ని కలుస్తాను''

"విష్ యు బెస్టాఫ్ లక్" ఆయన చెయ్యి చాచాడు. అతడు ఆయనతో చెయ్యికలిపాక తల తిప్పుకుని ముందుకు నడిచాడు.

షూటింగ్ స్పాట్ దగ్గిరపడగానే అడుగు ముందుకు పడలేదు. ఈశ్వర్‌కుమార్‌ని కలుద్దామా వద్దా... అన్న డైలమా!

అయితే అంతలోనే పీతాంబరం మాటలు గుర్తొచ్చాయి. అందువల్లే అతడు తన ఆలోచనలు అంతటితో కట్ చేసి హాస్పిటల్ ఆవరణ దాటాడు.

★ ★ ★

సంజీవరెడ్డినగర్‌లో సాదాసీదాగా కనిపించే ఓ బిల్డింగ్‌లోని మేడమీద పోర్షన్ అది.

మెట్లెక్కి పైకెళ్ళాక డోర్ ముందు వేలాడుతోందా బోర్డు 'ధనరాజ్... కోడైరెక్టర్' అనే అక్షరాలతో.

అతడు తన జేబులోని కాగితం తీసి ఆ పేరు మరోసారి కన్‌ఫర్మ్ చేసుకున్నాకనే కాలింగ్‌బెల్ నొక్కాడు.

రెండు నిమిషాల తర్వాత డోర్ తెరుచుకుంది.

యాభైఐదేళ్ళుంటాయేమో ఆయనకు. నల్లగా లావుగా ఉన్నాడు. తల ముగ్గుబుట్టలా తెల్లగా కనిపిస్తోంది. అయితే ముఖంలో అదోరకమైన ప్రశాంతత మాత్రం కదలాడుతోంది. ఆ ప్రశాంతత పరిశీలనగా చూస్తేతప్ప తెలియట్లేదు.

తలుపు తీసిన ఆయన అతడిని చూసి "ఏం కావాలి?" అన్నాడు ఆ గొంతులో చిరాకులేదు.

రెండు మూడు రోజుల్లో తను విన్నదాన్ని, తెలుసుకున్నదాన్ని బట్టి ఇండస్ట్రీలోని జనం లైట్‌బాయ్ దగ్గరనుండి కమర్షియల్ డైరెక్టర్ వరకూ ప్రతిక్షణం ఏదో బిజీగా ఉన్నట్లు నటిస్తూ ఉంటారు. అదేదో గొప్పతనంలా ఫీలవుతూ ఉంటారు వారు. అయితే ధన్‌రాజ్‌లో అలాంటి హిపోక్రసీ లేకపోవడం ఆనందం కలిగించింది అతడికి.

అతడు జేబులో నుండి కాగితం తీస్తూ, "నా పేరు అరుణ్ సార్! పీతాంబరంగారు మీకిది ఇవ్వమన్నారు" అన్నాడు.

పీతాంబరం పేరు వినడంతోనే ధనరాజ్ ముఖంలో ఓ ఉద్విగ్నభావం అలా కదలాడి ఇలా మాయమయింది. ఆయన ఆ ఉత్తరం అందుకుంటూ "లోపలికి రాబాబూ" అన్నాడు.

అతడు లోపలికి నడిచాక, హాలులోని కుర్చీ చూపించాడాయన. అతడు కూర్చున్నాడు.

ఆయన కుర్చీలో వెనక్కువాలి, ఆ కాగితం మడతలు విప్పాడు. అరుణ్ ఆయనకేసే చూస్తూ ఉండిపోయాడు.

చదవడం ముగించాక ధనరాజ్ కుర్చీలో ముందుకు వంగి "పీతాంబరంగారు బాగున్నారా" అడిగాడు.

"మా పరిచయం జరిగింది నిన్ననే. హాస్పిటల్‌లో ఆయన పొజిషన్ అంత బాగోలేదు... అన్నింటికన్నా ముఖ్యంగా ఆయన ఒంటరితనంతో బాధపడుతున్నట్టుగా ఉంది"

ఓ గాఢమైన నిట్టూర్పు వదిలి కన్నులు మూసుకున్నాడు ధనరాజ్.

"ఆయన మీకెలా పరిచయమయ్యారు?" కొద్దిసేపటి తర్వాత అడిగాడు ధనరాజ్.

చెప్పాడు అతడు.

"హాస్పిటల్‌లో ఉన్నా ఆయనకు ఉపకారబుద్ధి మాత్రం పోలేదు. ఎంత మంచిమనసో"

ఆయనకు పీతాంబరంపట్ల ఉన్న అభిమానం కన్నులలో ప్రతిఫలించడమే కాదు, మాటల్లోనూ వ్యక్తమౌతోంది. అరుణ్ మౌనంగా ఉన్నాడు.

మరికొద్దిసేపటి తర్వాత ఆయన

అన్నాడు.

"ఇండస్ట్రీలో మీకు ఏదయినా పని చూపించమని ఇందులో రాశారు పీతాంబరంగారు. ఆయన అలా రాశాక నాకిక చేయక తప్పదు. చెప్పండి! మీరు ఇండస్ట్రీలో ఏం పనిచేయగలరు? "

"ఫలానా పనే చేయాలని నేను నిర్ణయించుకోలేదండీ. ప్రస్తుతం బతకడం కోసం ఏదయినా సరే ఓ పని చేయాలనుకుంటున్నాను"

ఆయన కొద్దిక్షణాలు ఆలోచించి చెప్పాడు. "అయితే మీరు అసిస్టెంట్ డైరెక్టర్‌గా చేయగలరా? "

అరుణ్ ముఖంలో సంతోషం కనబరుస్తూ పలికాడు, "చేయలేక పోవడమేమిటి సార్! అసిస్టెంట్ డైరెక్టర్ ఉద్యోగమయితే ఆనందంగా చేస్తాను. ప్రస్తుతం నా పొజిషన్‌కి లైట్‌బాయ్ పోస్ట్ అయినా చేయడానికి సిద్ధమే"

ధనరాజ్ ముఖం నవ్వుతో విచ్చుకుంది.

"మంచివాడివే! పీతాంబరంగారు పంపించాక కూడా నీతో లైట్లు మోయించే పని



చేయించడమేమిటి? స్క్రిప్ట్ ఫెయిర్ చేయడంలాంటి కాస్త మంచిపనులే అప్పగిస్తాలే"

అప్పటివరకూ తనను 'మీరు' అంటూ గౌరవించిన వ్యక్తి తను లైట్‌బాయ్‌గా చేయడానికి సిద్ధమయ్యేసరికి 'నువ్వు' అనేవరకూ చనువు వచ్చేసిందంటే, తాను కొంత హుందాగా మాట్లాడలేదేమోననిపించింది అతడికి.

"మరి నన్నెప్పుడు కలవమంటారు సార్? "

"మరో రెండు రోజులలో మా డైరెక్టర్‌గారిది కొత్త సినిమా ప్రారంభం కాబోతోంది. ఆ సినిమాకి నువ్వు అసిస్టెంట్ డైరెక్టర్‌గా చెయ్యి. నీకు వీలయితే రేపు పూర్ణా డబ్బింగ్ థియేటర్ దగ్గరకి రా! మా సినిమా రీ-రికార్డింగ్ జరుగుతోంది. అక్కడికి వస్తే డైరెక్టర్‌ని ఒకసారి పరిచయం చేస్తాను. ఆయన కూడా నిన్నోసారి చూస్తే బాగుంటుంది కదా? అఫ్‌కోర్స్! నేను తీసుకొచ్చానన్నాక కాదనడనుకో!"

'మరో రెండురోజులు కూడా ఆగే పరిస్థితి కాదు తనది' అని చెప్పాలనిపించింది అతడికి. అలా చెపితే మరింత అలుసు ఇచ్చినట్లుగా అవుతుందేమోనని ఆగిపోయాడు అరుణ్.

"అలాగే సార్! రేపు మిమ్మల్ని డబ్బింగ్ థియేటర్‌లో కలుసుకుంటాను" లేస్తూ అన్నాడు.

"అలాగే"

అరుణ్ ఆయనకు నమస్కరించి వచ్చేశాడు.

ఆ రాత్రి-

అరుణ్ తన ప్రోగ్రెస్ గురించి రమేష్‌కి చెపితే ముఖం అదోలా పెట్టాడు.

"మరీ అసిస్టెంట్ డైరెక్టర్‌గా చేరడమే మిత్రా? "

"ఏం? "

"నేను అసిస్టెంట్ డైరెక్టర్స్ గురించి కొంత విని ఉన్నాను. పేరుకు అసిస్టెంట్స్ అనే గాని డైరెక్టర్స్ వారిచేత అడ్డమైన పనులన్నీ చేయిస్తారట కదా? "

"అడ్డమైన పనులన్నీ అంటే? "

రమేష్ కొద్దిక్షణాలు ఇబ్బంది ఫీలయి, ఆ తరువాత పలికాడు, "అడ్డమైన పనులంటే కాఫీ, టీలు అందించమనడమే కాదు. అప్పుడప్పుడూ ఆ హీరోయిన్ ఇంటికెళ్ళి నేను రాత్రికి రమ్మన్నానని చెప్పు. రాత్రికి గెస్ట్ హౌస్ బయట కాపలా ఉండు... ఇలాంటి పనులన్నీ అప్పగిస్తారట"

అరుణ్ పెదవులు బిగపట్టి బాధను దిగమింగడానికి కొద్ది సెకనులు పట్టింది. "అవన్నీ నాకు తెలియదు" అన్నాడు నిజంగానే తనకు తెలియవు కూడా!

"నాకు తెలుసు కాబట్టే ముందుగా హెచ్చరిస్తున్నా! తీరా ఎంటరయ్యాక మళ్ళీ ఆ పని చేయలేను. ఈ పని చేయలేను అంటూ వెనక్కు తిరిగి రావడం బాగుండదేమో? "

అరుణ్ కొద్దిక్షణాలు ఆలోచించుకున్నాక చెప్పాడు. "రమేష్! ఇండస్ట్రీ గురించి నాకు ఏ మాత్రం తెలియదు. అసిస్టెంట్స్ చేత అలాంటి పనులు చేయిస్తారని నువ్వు చెబుతుంటేనే తెలుస్తోంది... అయినా సరే నేను అసిస్టెంట్ డైరెక్టర్‌గానే ఫీల్డ్‌లోకి ఎంటరవుతాను. నా 'ఆత్మాభిమానం' దెబ్బతిననంత వరకూ అక్కడే కొనసాగుతాను. అలా ఉంటూనే నా లక్ష్యం సాధిస్తాను..."

"నీ ఇష్టం" భుజాలెగరేశాడు రమేష్.

★ ★ ★

అరుణ్ డబ్బింగ్ థియేటర్ దగ్గరకెళ్ళేసరికి, ధనరాజ్, మరో పదిమంది వ్యక్తులు టిఫిన్ తింటూ కనిపించారు. అతడిని చూసిన ధనరాజ్ "రావోయ్ రా టిఫిన్ తిందువు" అన్నాడు.

"ఫర్వాలేదు సార్" మొహమాటపడ్డాడు అతడు.

"రమ్మంటుంటే..." అని బోయ్‌వైపు తిరిగి "మరో ప్లేట్ పట్రా" అన్నాడు.

అతడీసారి అభ్యంతరపెట్టలేదు. బోయ్ అందించిన ప్లేట్ పట్టుకుని వారి పక్కనే కూర్చున్నాడు. బోయ్ టిఫిన్ ప్లేట్‌లో పెట్టాడు.

ధనరాజ్ కూర్చుని టిఫిన్ తింటున్నవారిని పరిచయం చేస్తూ "ఈయన ప్రసాద్, అతడు విజయకుమార్, ఆయన 'డబ్బింగ్ భాస్కర్...' ఒక్కొరికీ చూపిస్తూ చెప్పసాగాడు. అరుణ్ వారందరితో కరచాలనం చేశాడు. వారంతా డబ్బింగ్ ఆర్టిస్టులని అర్ధమయింది అతడికి.

సినిమా ఇండస్ట్రీలో ఒక తరంలో డబ్బింగ్ ఆర్టిస్టులు, ప్లేబ్యాక్ సింగర్స్ అని ప్రత్యేకంగా ఉండేవారు కాదు. హీరో హీరోయిన్లు తమ పాటలు తామే పాడుకునేవారు. అప్పట్లో రూపం, వాచకమే కాదు. కాస్తోకూస్తో సంగీత పరిజ్ఞానం ఉండి పాటలు కూడా పాడుకోగలిగిన వారినే తమ సినిమాలలో నటింపచేసేవారు. అవి మరీ తెలుగు సినిమారంగంలో మొదటి రోజులు. ఆ తర్వాత గాయకులు రంగప్రవేశం చేశారు. అప్పుడు హీరోకి రూపం, నటన, సరయిన గొంతు ఉంటేచాలు. పాటలు పాడవలసిన అవసరం లేకపోయింది. అది తెలుగు సినిమారంగంలో రెండవదశ అని చెప్పవచ్చు ఆ తర్వాత వచ్చిన దశ, ప్రస్తుత చరిత్ర... సరయిన గొంతు లేకపోయినా ఫర్వాలేదు. కాస్తరూపం, నటన ఉంటే చాలు. అరువు గొంతుతో డైలాగ్స్ చెప్పించవచ్చు అరువుగొంతు నటీనటులు ఎప్పుడయితే ఇండస్ట్రీలో ప్రవేశించారో, అప్పుడే డబ్బింగ్ ఆర్టిస్టులంటూ ఒక కొత్త డిపార్ట్‌మెంట్ పుట్టుకొచ్చింది. ప్రస్తుతం ఇండస్ట్రీలో డబ్బింగ్ ఆర్టిస్టులకు విపరీతమయిన డిమాండ్ ఉంది

అరుణ్‌కి సినిమారంగంలోకి ప్రవేశించాకే ఈ విషయాలన్నీ తెలుస్తున్నాయి. అతడు తెలుసుకుంటూ ఉన్నాడు. ఇండస్ట్రీకి సంబంధించిన పుస్తకాలు, పత్రికలు, తిరగేస్తున్నాడు... ఈ రంగానికి సంబంధించిన ప్రతీదీ... ప్రతీదీ తెలుసుకోవాలి.

"మరో రెండు ఇడ్లీ వెయ్యనా సార్?" బోయ్ మాటలకు అతడీ లోకంలోకి వచ్చాడు.

"ఆ" అని తలాడించాడు. బోయ్ రెండు ఇడ్లీలు ప్లేటులో వేసి గరిటెతో గట్టి చెట్నీ వడ్డించాడు.

సినిమా ఇండస్ట్రీలో ఉండే గొప్పతనం ఏమిటంటే ఆ ఇండస్ట్రీలో బతికే ఏ వ్యక్తికీ ఆకలి సమస్య ఉండదు. సినిమా పరిశ్రమలోని ఒక కార్మికుడి కుటుంబం ఆకలితో అల్లాడుతూ ఉండొచ్చుగానీ ఆ కార్మికుడు మాత్రం స్పాట్‌లో నాన్‌వెజిటేరియన్ భోజనం చేస్తుంటాడు. దటీజ్ ఇండస్ట్రీ.

అరుణ్ తిరిగి డబ్బింగ్ ఆర్టిస్టుల గురించిన ఆలోచనల్లోకి జారిపోయాడు. ప్రస్తుతం సాగుతున్న అరువుగొంతుల నటులతో సినిమాలు తీసే స్థితి అంత మెరుగైన పరిస్థితి కాదని చాలామంది అభిప్రాయం.

ఒకప్పుడు గొంతు విని ఏ నటుడో చెప్పగలిగేవారు. కానీ ప్రస్తుతం నలుగురయిదుగురు నటులకు ఒకే డబ్బింగ్ ఆర్టిస్ట్ గొంతు అరువివ్వడంతో ప్రేక్షకుడు కాస్త కన్‌ఫ్యూజ్ అవుతున్నాడు. అలాగే హీరోయిన్ల విషయంలోనూ... ఒక డబ్బింగ్ ఆర్టిస్టే నలుగురయిదుగురు హీరోయిన్లుకు డబ్బింగ్ చెపుతుంటుంది.

ఈ పరిస్థితి ప్రస్తుతం ఇండస్ట్రీమీద పెద్దగా ప్రభావం చూపించకపోవచ్చు గానీ, లాంగ్‌రన్‌లో ఆ ఎఫెక్ట్ పడి తీరుతుంది. ఈ కన్‌ఫ్యూజన్‌లో ప్రేక్షకుడికి సినిమా అంటే విరక్తి కలుగుతుంది. నటులు అంటే చులకన భావం ఏర్పడుతుంది. హీరో కావడమంటే కాస్త అందంగా ఉంటే చాలు... మాటలు రాకపోయినా ఫర్వాలేదు అనుకోవడంతో సినిమా నటులపట్ల ఉన్న క్రేజ్ తగ్గిపోతుంది.

క్రేజ్ తగ్గిపోవడం అంటే జనం సినిమాలకు మెల్లమెల్లగా దూరమయిపోవడమే!

కాని ఇండస్ట్రీలోని జనం ప్రస్తుతం ఆలోచిస్తూ భవిష్యత్తుని పట్టించుకోవడం లేదు. రాబోతున్న ప్రమాదాన్ని అసలు ఊహించడం లేదు"

అతడు టిఫిన్ తినడం పూర్తయింది.

అప్పుడు చెప్పాడు ధనరాజ్ "డైరెక్టర్ గారు మధ్యాహ్నం వస్తానని ఫోన్ చేశారు. పనేం లేకపోతే ఇక్కడే ఉండు. కాదంటే మధ్యాహ్నం వచ్చినా ఫరవాలేదు"

"పనేం లేదు సార్, ఉంటాను"

టిఫిన్ తినడం పూర్తయ్యాక ఇద్దరు డబ్బింగ్ ఆర్టిస్టులు, డబ్బింగ్ డైరెక్టర్, డబ్బింగ్ థియేటర్ లోపలికి వెళ్ళారు. ధనరాజ్ కూడా అటుగా వెళ్తూ "రా లోపల కూర్చుందాం" అన్నాడు.

అతడు తలాడించి ఆయన వెనక నడిచాడు.

మినీ థియేటర్ అది. సినిమా హాలుల్లోలా అంతస్క్రీన్ లేదుగాని మరీ చిన్నది కూడా కాదు. స్క్రీన్‌మీద అప్పుడే బొమ్మ ప్రత్యక్షమైంది. డబ్బింగ్ ఆర్టిస్ట్ తన చేతిలోని స్క్రిప్ట్‌ని ఒకసారి చదివి చూసుకుని ఆ తర్వాత తెరమీద నటుడి హావభావాలు పరిశీలించాడు. సీన్ మళ్ళీ రిపీట్ అయింది. ఈసారి ఆర్టిస్ట్ తెరమీది కదలికలకు అనుగుణంగా ఒకసారి పెద్దగా పలికి రిహార్సల్ చేశాడు. డబ్బింగ్ డైరెక్టర్ 'దట్స్ కరెక్ట్' అన్నాడు. మూడోసారి ఆరిస్ట్ డైలాగ్‌ని పలికాడు. అయితే డైలాగ్ సరిగా 'సింక్' కాలేదంటూ డైరెక్టర్ 'వన్స్‌మోర్' చెప్పాడు. నాలుగోసారి ఆర్టిస్ట్ డైలాగ్ కరెక్ట్‌గా పలికాడు. డబ్బింగ్ డైరెక్టర్ ఓ.కే అన్నాడు. నెక్స్ట్‌సీన్‌లో మరో ఆర్టిస్ట్ డైలాగ్ సాధారణంగా సీన్‌కి సంబంధించిన ఒకటీ రెండు వాక్యాలు లేదా ఒక పూర్తి డైలాగ్ మాత్రమే రికార్డ్ చేయడం గమనించాడు అరుణ్.

మరో గంట తరువాత టీ బ్రేక్ అంటూ అంతా బయటికి వచ్చినప్పుడు అరుణ్ ధనరాజ్‌ని అడిగాడు. "డైలాగ్ సింక్ కావడం అంటే ఏమిటి సార్? "

ధనరాజ్ సిగరెట్ ముట్టించి గట్టిగా పొగపీల్చి వదులుతూ పలికాడు. "డైలాగ్ సింక్ కావడమంటే యాక్టర్ లిప్ మూమెంట్‌కి సరిపోయేలా డైలాగ్ పలకడానికి ఒక నటుడు రెండు సెకనులు తీసుకుంటే, మరో నటుడు ఒకటిన్నర సెకనుల్లో పెదవుల కదలిక ఆపేస్తాడు. నటుడి పెదవుల కదలిక ఆగిపోయాక డైలాగ్ వినిపించడం ప్రేక్షకులకు బాగుండదు. అందుకే తెరమీద లిప్ మూమెంట్‌కి సరియైన టైమింగ్‌లో డైలాగ్ కట్ కావాలి. అది చూసుకోవడం డబ్బింగ్ డైరెక్టర్ పని..."

సినిమారంగంలో డబ్బింగ్ డైరెక్టర్ అంటూ ఒక వృత్తి ఉందని తనకింతకాలం తెలియదు. అది తెలిసింది ఇప్పుడే. ఆ వృత్తి తెలియడమే కాదు. వారు చేసే పని ఎలా ఉంటుందో కూడా తెలిసిపోయింది.

"నాకు డబ్బింగ్ డైరెక్టర్ అంటూ ఒకరుంటారని తెలియదు సార్"

"చాలా మందికి తెలియదు... ఎందుకంటే చాలా సినిమాలకి డబ్బింగ్ వ్యవహారాలు కోడైరెక్టర్లే చూసుకుంటారు. ఎవరయినా డబ్బింగ్‌లో కూడా పెర్‌ఫెక్షన్ కావాలనుకునేవారు ఇలా డబ్బింగ్ డైరెక్టర్‌ని పెట్టుకుంటారు... ముఖ్యంగా ఇది ద్వారకానాథ్‌గారి సినిమా కదా? ఆయన ప్రతీదీ పర్‌ఫెక్ట్‌గా ఉండాలని కోరుకుంటారు"

అరుణ్ తలాడించి ఊరకుండిపోయాడు. అయితే ఆయన మాత్రం మాట్లాడడం ఆపలేదు.

"స్ట్రెయిట్ సినిమాలకు డబ్బింగ్ ప్రోబ్లెమ్ కాబోదు. ఎందుకంటే వారు తెలుగు స్క్రిప్ట్‌నే చదువుతారు కాబట్టి. అందువల్ల నటుడి తెరమీద టైమింగ్‌కి, డబ్బింగ్ ఆర్టిస్ట్




టైమింగ్‌కి పెద్ద తేడారాదు. అదే డబ్బింగ్ సినిమాలనుకో... వారు ఏ తమిళ, హిందీ మాటలో పలికి ఉంటారు. ఆ భాషకు తెలుగు అనువాదం రాసేసరికి డైలాగ్ లెంగ్త్ పెరుగుతుంది. ఆ తర్వాత లిప్ లెటర్స్ అని కొన్ని అక్షరాలు ఉన్నాయి. 'ప, బ, మ' ఇవి పలికేప్పుడు పెదాలు టచ్ అవుతాయి. ఈ అక్షరాలు వచ్చిన ఇతర భాషల్లోని స్క్రిప్ట్‌కి అదే అక్షరాలు వచ్చేలా పదాలను తయారుచేసుకోవాలి. కాబట్టి డబ్బింగ్ రైటర్ కూడా కొంత కష్టపడాలి. ఆ తర్వాత డబ్బింగ్ ఆర్టిస్ట్ కూడా ఎక్కువ శ్రమపడాల్సివస్తుంది"

టీ బ్రేక్ అయిపోయింది. డబ్బింగ్ డైరెక్టర్ మరో ఇద్దరు డబ్బింగ్ ఆర్టిస్టులు థియేటర్ లోపలికి వెళుతున్నారు. ధనరాజ్ థియేటర్ లోపలికి వెళ్ళలేదు. బయటే సిగరెట్ పొగ పీలుస్తూ ఉండిపోవడంతో అతడూ ఆ చోటనే ఆగిపోయాడు.

వారలా నిలబడి ఉండగానే థియేటర్ ముందు అంబాసిడర్ కారు ఆగింది.

ఓ బట్టతల వ్యక్తి కారు లోంచి కిందికి దిగాడు.

"ఆయనే ద్వారకానాథ్" చెప్పాడు ధనరాజ్.

అరుణ్ ఆవైపు చూస్తూ ఉండిపోయాడు. ద్వారకానాథ్ తొలుత క్రైమ్ చిత్రాల దర్శకుడిగా ప్రవేశించి ఆ తర్వాత సంగీత ప్రధాన చిత్రాల దర్శకుడిగా పేరు తెచ్చుకున్నాడు. ఆయన సినిమాలు అశ్లీలం లేకుండా, కళాత్మక విలువలతో ఉన్నతంగా ఉంటాయి. ఎన్నో అవార్డులు, రివార్డులు పొందిన దర్శకుడాయన.

ఆయన వారిద్దరి దగ్గరగా వచ్చాక ధనరాజ్‌ని అడిగాడు. "ఎంతవరకూ వచ్చింది? "

"మురళిగారి కేరక్టర్, అతని గ్యాంగ్ సీన్ డబ్బింగ్ జరుగుతోంది"

లోపల డబ్బింగ్ జరుగుతుంటే మధ్యలో వెళ్ళి డిస్టర్బ్ చేయడం సాధారణంగా చేయరెవరూ. సీన్‌కీ సీన్‌కీ మధ్య బ్రేక్‌లోనే లోపలికి వెళుతుంటారు.

డబ్బింగ్‌కి, ఎడిటింగ్‌కీ సంబంధించిన విషయంలో దర్శకుడు జోక్యం చేసుకోవలసిందంటూ పెద్దగా ఏమీ ఉండదు. అందువల్లేనేమో ఆయన లోపలికి వెళ్ళేందుకు ప్రయత్నించకుండా "జరుగుతుంటుంది కదా? నేను స్టూడియోకెళ్ళి సెట్ చూసి వస్తాను. వచ్చాకే ఈ రోజు జరిగిన వర్క్ చూస్తాను" అన్నాడు

"అలాగే" తలాడించాడు ధనరాజ్.

ఆయన వెనుదిరిగి వెళ్ళిపోతుంటే వెనుక నుండి "ద్వారకానాథ్‌గారూ" పిలిచాడు ధనరాజ్.

ద్వారకానాధ్ వెనుతిరిగి చూసి ఏమిటన్నట్లు తలూపాడు.

ధనరాజ్ చెప్పాడు, "ఇతన్ని పీతాంబరం గారు నా దగ్గరకు పంపారు. ఏదయినా పని ఇప్పించమని లెటర్ రాశారు.

"పీతాంబరంగారంటే... ఆ పీతాంబరంగారేనా? "

"అవునండి"

ఆయన అరుణ్‌వైపు ఓ రెండు సెకన్లు అలా చూసి తల తిప్పుకుని ధనరాజ్‌ని అడిగాడు.

"పీతాంబరంగారు ఇంకా హాస్పిటల్‌లోనే ఉన్నారా? "

"అవునండి"

"ఏమిటో! ఏ స్థాయి వ్యక్తి ఏ స్థాయికి దిగజారిపోయాడు? ... ప్చ్" కొద్దిసెకనులు బాధగా ముఖం పెట్టాడు.

"ఆయనను చూసి పరామర్శించి రావాలని చాలా రోజులుగా అనుకుంటూనే ఉన్నాను. వీలుకావడంలేదు"

వారిద్దరూ మౌనంగా ఉన్నారు.

ఆయన అరుణ్‌వైపు మరోసారి చూసి "సరే! మన కొత్త సినిమాకు అసిస్టెంట్ డైరెక్టర్స్ ఎలాగూ అవసరమే కదా? రేపటి

నుండి రమ్మని చెప్పండి" తల తిప్పి ధనరాజ్‌తో చెప్పాడు.

ధనరాజ్ చిరునవ్వుతో అరుణ్‌కేసి చూశాడు.

అరుణ్ ముఖంలో సంతోషం కదలాడింది.

ద్వారకానాథ్ "వస్తాను" అనేసి వెనుతిరిగి వెళ్లిపోయాడు.

ఆయన వెళ్లిపోయాక ధనరాజ్ అతడితో చెప్పాడు, "నీ పని పూర్తయినట్టే! నువ్వు రేపు తొమ్మిది గంటలకు స్టూడియో దగ్గర కొచ్చెయ్యి. రేపు సినిమా ప్రారంభోత్సవమే కాబట్టి హడావిడి తప్ప పెద్దగా పనేం ఉండదు. మధ్యాహ్నానికే పేకప్ అయిపోతుంది కూడా"

"అలాగే సార్"

అతడు ఆయనకు నమస్కరించి డబ్బింగ్ థియేటర్‌లోనుండి రోడ్డుమీదకు వచ్చి పీతాంబరం దగ్గరకు బయల్దేరాడు.

సాయంకాలపు నీరెండ చల్లగా పరుచుకుని ఉంది.

జనవరి నెల చలిగాలి ఆరింటికే మొదలయి శరీరాలను వణికించడం మొదలెట్టింది.

వయసు మీదపడడమే కాదు, అస్థిపంజరంలాంటి ఆకారంతో, రోగబాధతో ఉన్న పీతాంబరం ఆ చలిగాలిని ఏ మాత్రం తట్టుకోలేకపోతున్నారు. అయినా సరే, సన్నగా వణికిపోతూనే, ఆయన ఆ చెట్టుకింద కూర్చుని అరుణ్ మాటలు ఆలకిస్తున్నారు.

"అయితే నామాటమీద గౌరవంతో ధనరాజ్, నిన్ను అసిస్టెంట్ డైరెక్టర్‌గా రికమెండ్ చేశాడన్నమాట" అతడు చెప్పడం అయ్యాక అన్నాడు పీతాంబరం.

"అవును సార్" పలికాడు అరుణ్.

"పోనీలే, ఏదో రూపంలో ఇండస్ట్రీకి దగ్గరగా వెళ్లగలిగావ్. చెప్పానుగా, ఇండస్ట్రీకి దగ్గరగా ఉంటే నీ ప్రయత్నాలు మరింత సులువవుతాయి. నీ లక్ష్యాన్ని త్వరగా సాధించవచ్చు కూడా"

"అది నిజమే సార్"

కాసేపాగాక పీతాంబరమే అన్నాడు, "ఆ విచిత్ర పరిశ్రమ గురించి నీకో విషయం చెప్పనా..."

"చెప్పండి సార్"

"ఆ ఇండస్ట్రీలో అన్నింటికన్నా గొప్ప పదమేమిటంటే- 'సక్సెస్'! నీతి, నిజాయితీ, మంచితనం, మానవత్వం, చివరికి సమర్థత కూడా సక్సెస్ ముందు బలాదూర్. ఎంతో సమర్థుడయిన వ్యక్తి కూడా సక్సెస్ లేకపోతే ఆ ఇండస్ట్రీలో చివరికి 'అనామకుడు'గానే మిగిలిపోతారు. దానికి సరయిన ఉదాహరణ ధనరాజ్..."

"ధనరాజ్?"

ఆయన తలతిప్పి అతడి ముఖంలోకి కాస్త విస్మయంగా చూశాడు. "ధనరాజ్ గురించి నీకు ఏమీ తెలియదా?"

"తెలియదు సార్" సిన్సియర్‌గా పలికాడు అతడు.

"ఇండస్ట్రీలోకి ప్రవేశించే ముందు ముఖ్యంగా ఒక అవసరంతో ఓ వ్యక్తిని కలుసుకునేముందు ఆ వ్యక్తి గురించిన పూర్తి వివరాలు తెలుసుకోవడం ఎంతోఅవసరం"

అతడు మౌనంగా ఉన్నాడు.

ఆయన తల తిప్పుకుని చెప్పడం మొదలుపెట్టారు.

"ధనరాజ్ మంచి టాలెంట్ ఉన్న దర్శకుడు. చాలాకాలం క్రితం అంటే నేను నటుడిగా మంచి పొజిషన్‌లో ఉన్నప్పుడు తను ఓ చిత్రాన్ని డైరెక్ట్ చేశాడు. మంచి కథ, గొప్ప సాంకేతిక విలువలు, అద్భుతమైన సృజనాత్మకత- ఇవన్నీ కలిసిన ఆ సినిమా, తెలుగు సినిమా ఇండస్ట్రీని 'మరో మలుపు' తిప్పుతుందనుకున్నారు సినిమా జనం. కానీ... ప్చ్! ఎందుకనో తెలియదు ప్రేక్షకులు ఆ చిత్రాన్ని ఘోరంగా తిప్పికొట్టారు. దాంతో ధనరాజ్ డిప్రెషన్‌లో పడిపో

యాడు. ఆ సినిమా హిట్ అయివుంటే, తెలుగు ఇండస్ట్రీకి జరిగే మేలు గురించే కాదు, ధనరాజ్ ఈరోజు ఏ పొజిషన్‌లో ఉండేవాడో మనం ఊహించుకోలేం... విచిత్రమయిన విషయం ఏమిటో తెలుసా? తొలి చిత్రాన్ని అంత అద్భుతంగా తీసిన ఆ దర్శకుడికి మరో చిత్రానికి దర్శకత్వం చేసే అవకాశం మరే నిర్మాతా ఇవ్వలేదు. చెప్పానుగా, అదే కారణం సక్సెస్! ఎవడయితే ఈ పోటీలో 'విజేత'గా నిలుస్తాడో వాడి చుట్టూనే ఈ సినిమా ప్రపంచమంతా తిరుగుతుంది. కాబట్టి నువ్వు 'విజేత'గా నిలిచేందుకే ప్రయత్నించు..."

కొద్దిక్షణాల తర్వాత అరుణ్ అడిగాడు.

"అంటే... ధనరాజ్ దర్శకుడిగా విఫలమయ్యాకే కో-డైరెక్టర్‌గా జీవితం వెళ్ళదీస్తున్నాడన్నమాట"

ఆయన నిశ్శబ్దంగా తలాడించాడు.

అప్పుడే అరుణ్ మనసులో ఆ రెండు పదాలు స్థిరంగా నిలిచిపోయాయి. సక్సెస్-విజేత'

అరుణ్‌కు అప్పుడే మరో విషయం అడగాలనిపించింది. అయితే మనసులోని సందిగ్ధం కొద్దిసేపు తటపటాయించేలా చేసింది. చివరికి తెలుసుకోవాలన్న ఆరాటమే సందిగ్ధాన్ని దూరం చేసింది. "మరి సక్సెస్ బాటలో ఉండి శిఖరాగ్రం చేరిన మీరు నేడు ఇలా ఉన్నారు. ఇండస్ట్రీకి మీరు దూరమయ్యారా లేక ఇండస్ట్రీ మిమ్మల్ని దూరం చేసిందా?

ఆయన కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయాడు. తర్వాత చెప్పాడు, "కొత్తనీరు వస్తే పాతనీరు కొట్టుకుపోతుంది. ఇది ప్రకృతి సహజం. ఈ సహజం చిత్రపరిశ్రమకు కూడా వర్తిస్తుంది. అయితే ఈ ప్రభావం హీరోలకు కాస్త తక్కువే! ఎందుకంటే అప్పటికే వారికంటూ కొంతమంది అభిమానులు ఏర్పడిపోతారు. ఒకరిపట్ల పెంచుకున్న అభిమానం అంత సులభంగా మారదు. అందువల్ల హీరో ముసలివాడయినా అతడి అభిమానులు అతడి సినిమాలు చూస్తూనే ఉంటారు. కేరక్టర్ ఆర్టిస్టులు చాలామంది ఇండస్ట్రీలోకి ప్రవేశించడంతో నాకు అవకాశాలు తగ్గిపోయాయి"

"అవకాశాలు తగ్గిపోవచ్చు కాని ఈ పరిస్థితి!!"

"అది మాత్రం నా స్వయంకృతాపరాధం"

వెంటనే చెప్పారాయన. కాసేపాగి నేటి తరం నటీనటులలో ఉండే ముందుజాగ్రత్త నాటి తరం నటీనటులలో ఉండేది కాదు బాబు! అందువల్లే ఒక్కసారిగా వచ్చే పేరు పాడు చేసుకోకపోయినా డబ్బు మాత్రం పాడు చేసుకునేవారు. దానధర్మాలు, అందర్నీ నమ్మేయడం, నిర్మొహమాటంగా ఉండలేకపోవడం, ఇతరుల బాధలకు స్పందించడం, ఇవన్నీ నాటితరం నటీనటులను తీరని వ్యధలకు లోను చేశాయి. అందువల్లనే కాబోలు నాటితరం నటీనటుల చరిత్ర చూస్తే ఎక్కువమంది చివరిదశలో కటికదారిద్ర్యం అనుభవిస్తూనే మరణించారు"

"అంటే మీరు కూడా...? "

"అవును... నేను కూడా నా అనుకున్నవారిని దగ్గరకు తీశాను. నా కెరీర్ బాగున్నప్పుడు నా డబ్బు, ఇతర సమస్యల గురించి పట్టించుకోలేదు. తీరా కెరీర్ ట్రబుల్స్‌లో పడ్డాక నా ఆర్థికపరిస్థితి చక్కదిద్దుకుందామని ప్రయత్నిస్తే నేను నమ్మిన వ్యక్తులు నన్ను మోసం చేశారు. నాకంటూ ఏమీ మిగల్చలేదు. వారిని ఏమనగలను? ఏమన్నా నా ఆస్థి నాకు తిరిగివస్తుందా! అందుకే దిగజారిన నా పరిస్థితిని నిశ్శబ్దంగా ఆహ్వానించాను..."

అతడికి పాతతరం నటీనటులలో కొందరి చరిత్రలు కనులముందు కదలాడాయి. ఒక మహానటి పెళ్లయిన మరో నటుడిని నమ్మింది. ఆమె ధన, మానాలు హరించిన

ఆ నటుడు చివరిదశలో ఆమె నీచ, నికృష్ట, దరిద్ర పరిస్థితుల్లో 'కోమా'లో కెళ్ళిపోయిన ప్పటికీ జాలి చూపలేదు. మరో మహానటుడు దానధర్మాలతో తాను సంపాదించిన దంతా ఖర్చుచేసేసి చివరిదశలో పేదరికంతో మరణించాడు. మరో హాస్యనటుడూ అంతే... 'సినిమాజనం జీవితాలలో చాలా వరకూ దుఃఖాంతాలే కావడం విచిత్రమయిన విషయం- ఎంతో కీర్తిప్రతిష్టలు సంపాదించే ఆ నటీనటుల జీవితాలు దుఃఖాంతం కావడానికి కారణమేమిటి? నాడే కాదు, నేడు కూడా ముఖ్యంగా హీరోయిన్ల బతుకులు ఇతరుల మీదనే ఆధారపడి వుంటాయి. వారి అమ్మ, అన్న లేదా మరో పరాయి మగాడి నీడలోనే వారు కాలాన్ని గడుపుతుంటారు. చివరికి పెళ్ళయిన ఏ మగాడికో తమ సర్వస్వం అర్పిస్తుంటారు. ఎందుకు... ఎందుకిలా? ఎందరిలా?

"ఆస్తులు పోయాక అనారోగ్యం మొదలయింది. అప్పటివరకూ నా చుట్టూ తిరిగిన జనం ఒక్కసారి మాయమయ్యారు. నా అనుభవాలు మాత్రమే నాకు తోడుగా మిగిలాయి. వయసులో ఉన్నప్పుడు ఆడది బెడ్ మీద మాత్రమే అవసరమనుకునేవాడిని. ఆడదాని తోడు వార్ధక్యంలో ఎంత అవసరమో ఇప్పుడిప్పుడే అర్థమవుతోంది. ప్చ్ కాని కాలం దాటిపోయింది..."

వృద్ధాప్యంలో ఒంటరితనం అనేది మహానటులకీ తప్పలేదేమో. ఆ ఒంటరితనం ఒక మహానటుడిని కుటుంబంనుంచి దూరం చేసింది.

"...తోడు గురించిన బాధ మాత్రమే కాదు, నలుగురికి దానధర్మాలు చేసిన చెయ్యి నేడు మరొకరిని యాచించేస్థితికి తిరగబడింది. ఎల్లుండి సంక్రాంతి... సంక్రాంతి మరో వారంరోజులుండగానే నేను మద్రాసులోని స్లమ్ ఏరియాలకెళ్ళి బట్టలు పంచేవాడిని... కాని నేడు... నాకు ఎవరయినా బట్టలిస్తారేమోనని ఎదురుచూస్తున్నాను..."

సంక్రాంతి!

ఆ పదం వినగానే అతడి మనసు క్షణకాలం వూగిసలాడింది. సంక్రాంతి! తెలుగువారి ఆనందాల హేల! తెలుగునాట అది పెద్ద పండుగ.

తన ఇంట నాలుగురోజులముందునుండే మొదలయ్యే ఆ పండుగ సందడి అతడి మనసులో మెదలాడింది. కొత్త బట్టలు, పిండివంటలు, రంగవల్లులు, బంధుమిత్రుల రాకతో కళకళలాడే ఇళ్లు...

ఏ సంక్రాంతికీ తను ఇంట లేకుండా లేడు. ఈ సంక్రాంతికే తను ఇంట లేకుండా, ఇలా వీధినపడి పోరాటం సాగిస్తున్నాడు. ఇప్పుడు తన ఇంట్లో మాత్రం పండుగసందడి ఉంటుందా? ఊహు! ఉండదు. వారు కూడా తన గురించే ఆలోచిస్తూ, పండగ వాతావరణాన్ని ఎంజాయ్ చేయలేకపోవచ్చు.

ఆ క్షణం అతడికి రాజేశ్వరి గుర్తుకొచ్చింది.

"ఏమిటాలోచిస్తున్నావ్ అరుణ్" పక్కనుండి ఆప్యాయంగా వినిపించడంతో అతడు ఈ లోకంలోకి వచ్చాడు.

తల విదిలిస్తూ, "ఏమీ లేదు" అన్నాడు.

"నాకర్థమయింది, మీవాళ్లు గుర్తుకొచ్చారు కదూ?"

అతడు తల అడ్డంగా ఆడించాలని ప్రయత్నించలేదు. "అవును" అన్నాడు.

"మనం ఒక లక్ష్యాన్ని నిర్ణయించుకుని పోరాడుతున్నప్పుడు, సర్వం మరచిపోవాలి గుర్తుచేసుకోకు. నీవారిని గుర్తు చేసుకోకు. కేవలం నీ లక్ష్యాన్ని మాత్రమేగుర్తుంచుకో"

అతడు నిలువుగా తలాడించాడు.

★ ★ ★

పశువుల కొట్టంలోనుండి ఇవతలకొస్తున్న ఈశ్వరయ్య వీధివాకిలివైపు చూసి

ముఖంలోకి సంతోషం తెచ్చుకున్నాడు. కాస్త సంబరంగా అటువైపు అడుగులేస్తూ, "రా బావా రా..." అన్నాడు రఘురామయ్యను పలకరిస్తూ.

రఘురామయ్య ఎప్పుడోగానీ ఆ ఇంటి వైపు రాడు.

ఇద్దరూ ఇంటివరండా మెట్లు ఎక్కుతూ ఉండగా హాలులోనుండి అటుగా చూసిన రుక్మిణమ్మ ముఖం చాటంత చేసుకుని వరండావైపు వచ్చింది.

ఈశ్వరయ్య రఘురామయ్యను వెంటబెట్టుకుని హాల్లోకి తీసుకెళ్ళాడు. హాల్లో ఉన్న తూగుటుయ్యాలమీద ఆయనను కూర్చోబెట్టి ఎదురుగా ఉన్న కుర్చీలో తను కూర్చున్నాడు.

"చెప్పండి బావా! ఏమిటి విశేషాలు?"

"ఏమున్నాయ్? ఊరికే ఇలా వచ్చాను"

"వదినగారు బాగున్నారా అన్నయ్య గారూ?" అడిగింది రుక్మిణమ్మ.

అతడు తలాడించాక, ఆమె ఆరోజు చేసిన పిండివంటలు తీసుకొచ్చేందుకు వంటింట్లోకి వెళ్ళింది.

"రాజేశ్వరి ఎక్కడికెళ్ళింది?" ఇంట్లో అటూనిటూ చూస్తూ అడిగాడాయన.

"ఈరోజు సంక్రాంతి పండగయినా ఆ పిల్లకు పండుగ ధ్యాసే లేదు. ఉదయం ఇంటిముందు ముగ్గులు పెట్టలేదు. తల స్నానం చేసిందేగానీ, కొత్తబట్టలు కట్టుకోలేదు. పిండివంట ఒక్కటయినా ముట్టుకోలేదు. ఏదో టిఫిన్, భోజనం తిన్నాననంటే తిని తన గదిలోకెళ్ళి పడుకుండిపోయింది..."

"ఆ ఇంట్లో కూడా పరిస్థితి అలాగే ఉందమ్మా... జానకి నలుగురికీ పిండివంటలు పెట్టక తప్పదు కాబట్టి, ఆ వంటలు చేసిందిగానీ లేకపోతే అసలీరోజు వంట వండి ఉండేదే కాదు. మేమిద్దరం ఉపవాసం పడుకుని ఉండేవారం"

వంటగదిలోనుండి ఇవతలకొస్తున్న రుక్మిణమ్మకూ ఆ మాటలు వినిపించాయి. మనసు కలుక్కుమంది. ఆమె తలొంచుకుని వచ్చి ప్లేట్ తూగుటుయ్యాలమీద పెట్టి "తీసుకో అన్నయ్యా" అంది.

"వద్దమ్మా" అన్నాడు రఘురామయ్య. "ఈరోజు ఏమీ తినాలనిపించడంలేదు... అసలు ఆ ఇంట్లో పండుగ కళే లేదు"

"ఈ ఇంట్లోనూ పరిస్థితి అలాగే ఉంది అన్నయ్యా"

ఆయన తూగుటుయ్యాల దిగి ఆ వైపు నడిచాడు. రఘురామయ్య రాజేశ్వరి గదిలోకి వెళ్ళడం గమనించి హాల్లోనే ఆగిపోయారు వారిద్దరూ.

రఘురామయ్య ఆ గదిలోకెళ్ళాక అటు కేసి చూశాడు. రాజేశ్వరి ముఖం అటుతిప్పుకుని బోర్లాపడుకుని ఉంది.

ఆయన ఆమె దగ్గరగా వెళ్ళి, "రాజీ..." అన్నాడు. బహుశ నిద్రపోతోందేమోనను కుని కాస్త గట్టిగానే పిలిచాడు. ఆమె ఉలిక్కిపడి తలతిప్పింది. ఆయనను చూడడంతోనే అదిరిపాటుతో పడుకున్నదల్లా లేచి కూర్చుంది.

ఆమె ముఖంలోకి యధాలాపంగా చూసిన ఆయన కంగారుపడ్డాడు. రాజేశ్వరి బుగ్గలమీద కన్నీటి చారికలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. బాగా ఏడ్చినట్టు కన్నులు ఉబ్బిఉన్నాయి. ఆయనకు తన ఏడుపు తెలియకూడదన్నట్లు ఆమె తల దించుకోబోయిందిగానీ, రఘురామయ్య అప్పటికే కోడలిపిల్ల చుబుకం పట్టి పైకెత్తి కళ్ళలోకి సూటిగా చూస్తూ "ఏమిటే... ఏమిటే ఇదీ?" అన్నాడు.

రాజేశ్వరి ఇక ఆగలేకపోయింది. అప్పటివరకూ ఆగి వున్న దుఃఖం ఇక ఆగలేనట్టు కట్టలు తెంచుకుని ప్రవహించింది. కన్నుల లోనుండి నీళ్ళు ధారగా కారసాగాయి. కాని ఆమె ఆయన ప్రశ్నకు జవాబు చెప్పకుండా వెక్కి వెక్కి ఏడవసాగింది.



ఇంకా ఉంది

ఆయన మరోసారి అవే మాటలు రిపీట్ చేశాడు.

"ఎందుకే... ఎందుకేడుస్తున్నావ్?"

"మనమంతా ఇక్కడ పండుగ సంతోషంతో ఉంటే అక్కడ బావ ఎన్ని కష్టాలు పడుతున్నాడోకదా మామయ్యా?"

ఆమె దుఃఖానికి కారణం ఏమయిఉండొచ్చు తను సరిగానే ఊహించగలిగాననుకున్నాడు రఘురామయ్య. ఆ క్షణం రాజేశ్వరిమీద మితిమీరిన ఆప్యాయం పొంగుకొచ్చింది.

అదే క్షణం ఆ గది వాకిటవరకూ వచ్చిన ఈశ్వరయ్య, రుక్మిణమ్మలు కూతురి మాటలు వినడంతోనే అదేచోట ఆగిపోయి ముఖాలు చూసుకున్నారు. కూతురి ముఖానికి కారణం స్పష్టంగా అర్థమయిన క్షణం అది!

రఘురామయ్య రాజేశ్వరి తలమీద చెయ్యి ఉంచి, ఆప్యాయంగా తలను కదిలించాడు. "పిచ్చిపిల్లా! ఆ బాధ మాకు మాత్రం లేదనుకున్నావా?... మీ అత్తమ్మ కూడా నీలాగే ఈరోజు ఏదో తిన్నాననంటే భోజనం ముగించబోతే, నేనే కసురుకుని తినిపించాల్సివచ్చింది"

"అత్తమ్మ బాధపడడం వేరు. కాని నా బాధ..." ఆమె ఏదో తప్పు చేసినట్టుగా ఫీల్ కావడం గమనించారు రఘురామయ్య.

"చెప్పవే! ఏమిటే నీ బాధ?"

"బావ పండుగరోజు కూడా మనందరికీ దగ్గరగా లేకపోవడానికి కారణం నేనే... నేనేకదా మామయ్యా?"

ఆయన వెంటనే పలికాడు "అలా ఎందుకనుకుంటున్నావే పిచ్చిమొహమా! వాడు సిటీకి వెళ్లడానికి నువ్వు ఓ కారణం మాత్రమే! మేమూ వాడి చుట్టూ వలపన్ని వాడు తనంతట తను పందెం కాసి సిటీకి వెళ్ళేలా చేశాం. వాడిని మనందరికీ దూరంగా వెళ్ళేలా చేశామని బాధపడాల్సి వస్తే నీతోపాటూ మేమూ బాధపడాలి తెలుసా?"

"బాధపడుతూనే ఉన్నాంగా?" లోపలికొస్తూ అంది రుక్మిణమ్మ.

రాజేశ్వరి మంచంమీదే సర్దుకుని కూర్చుంది. ఈశ్వరయ్య, రుక్మిణమ్మ అదే మంచంమీద ఓవైపు కూర్చున్నారు. కాసేపాగాక రఘురామయ్య అన్నాడు. "బాధపడటమే కాదు రాజీ! మనందరం తప్పుగా ఆలోచించామేమోనన్న భావం ఇప్పుడిప్పుడే నా మదిలో కలుగుతోంది. రేపు వాడు సినిమా హీరో అయితే సంతోషమే. వాడి కీర్తిప్రతిష్టలు తలుచుకునయినా మనం ఇక్కడ హాయిగా కాలం గడిపేయొచ్చు అలాకాక మనం వాస్తవానికి కోరుకున్నట్టుగా వాడు అక్కడేదయినా చిన్న ఉద్యోగం చూసుకున్నాడనుకో- నాటి మన పరిస్థితి ఏమిటో నేడు నా కళ్లముందు కదలాడుతోంది. సిటీల్లో ఉద్యోగాలు చేసుకునే బిడ్డలు, ప్రతి పండుగకూ పల్లెకు రాగలుగుతారా? వారు పల్లెకు రాలేకపోతే, ఈ పల్లెలోని ముసలి తల్లిదండ్రులు పండుగ ఆనందాన్ని అనుభవించగలరా? అది తొలి పండుగనాడే నాకు అర్థమయింది. అసలు పండుగనే కాదు... వాడు దూరంగా సిటీలో బతుకుతుంటే మేమిక్కడ వాడిని చూడకుండా బతకాలి. వాడు అక్కడ ఎలా బతుకుతున్నాడో తెలియకుండా బతకాలి. బతకొచ్చు కష్టం కాబోదు. కాని అలా బతకాల్సిన అవసరం ఉందా?"

ఈశ్వరయ్య, రుక్మిణమ్మలు తొలిసారిగా ఆయనకేసి తదేకంగా చూశారు. రాజేశ్వరి కూడా మామయ్యవైపు అర్థంకానట్లుగా చూసింది.

..."సిటీకి మనవాడు వెళ్ళి అక్కడ బతకగలగాలి! కాని ఎందుకు? సిటీలో ఉద్యోగం అంటే అది మనకు గౌరవప్రదమా? కావచ్చు! కాని... సిటీలో పిల్లలు, పల్లెల్లో




తల్లిదండ్రులు ఉంటే ఆ గౌరవాన్ని మించిన బాధ వారి మనసులను రంపపు కోతకోస్తూ ఉంటుంది. ముఖ్యంగా ఇలాంటి పండుగ పబ్బాలలో అక్కడ తమ బిడ్డలు పండుగ చేసుకున్నారో, లేదో, వారు తింటున్నారో లేదో... ఈ ఆలోచనలలో ఇక్కడ మనమూ ఆనందాన్ని అనుభవించలేం... ఏనాడో ఓనాడు అలాంటి బాధ తప్పదని తెలిసీ వారిని సిటీకి పంపడం ఎందుకు? ..."

ఈశ్వరయ్య నెమ్మదిగా తలొంచుకున్నాడు.

అది గమనించి చెప్పాడు రఘురామయ్య "ఈ విషయంలో తప్పు మాత్రం నాదే. పెద్ద చదువులు చదివిన నా కొడుకు సిటీలో పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తుంటే చూడాలని అనుకున్నాను. కాని నా కోరిక కారణంగా, నేను ఏం కోల్పోవలసివస్తోందో, నాకిప్పుడే అర్థమయింది."

ఈశ్వరయ్య తలెత్తి, "అయితే బావా! మనవాడిని వెనక్కురమ్మని వెళ్ళి పిలుచుకు రానా? "

"వాడు ఎక్కడున్నాడని వెళతావు? "

"వాడి ఫ్రెండ్స్ రూములన్నీ నాకు తెలిసినవేకదా? వాడు అక్కడ చదివేప్పుడు నేను హైదరాబాద్ వెళ్ళినప్పుడల్లా ఆ రూముల్లోనే దిగేవాడిని. కాబట్టి కనుక్కోవడం పెద్ద కష్టం కాబోదు"

రఘురామయ్య కొద్దిక్షణాలు ఆలోచిస్తున్నట్లుగా తల పైకెత్తి, "వద్దులే! వాడి పట్టుదల గురించి నాకు బాగా తెలుసు. ఇప్పుడు మనం ఎంతలా పిలిచినా వెనక్కు తిరిగి రాడు. ఈ సంవత్సరకాలం వాడు పోరాడుతూనే ఉంటాడు"

ఈశ్వరయ్య మౌనంగా ఉండిపోయాడు. తేలికపరచే ఉద్దేశంతో "లేవవే రాజీ! బావ కోసం బెంగపడి భోజనం మానేస్తే మీ బావ వచ్చేసరికి నువ్వుండవు. లే! లేచి కాస్త ఏదయినా తిను" అన్నాడు.

అప్పుడన్నాడు ఈశ్వరయ్య "అమ్మాయి ఏదో తింటుందిలే... నువ్వూ కాస్త నోరు తీపి చేసుకో. పండుగపూట నోరు తీపి చేసుకోకపోతే, సంవత్సరకాలం నోరంతా చేదుగానే ఉంటుంది."

రుక్మిణమ్మ హాలులోకెళ్ళి తూగుటుయ్యాల మీదున్న ప్లేట్ ఆ గదిలోకి తీసుకొచ్చింది. రఘురామయ్య రాజేశ్వరికి ఒక అరిసె అందించి, తనొకటి తినసాగాడు. అలా తింటూ చెప్పాడు. "నేనిప్పుడు ఇంటికెళ్ళి జానకిచేత కూడా బలవంతంగా తినిపించాలి"

"వదినను ఇక్కడకు తీసుకురావలసింది" చెప్పింది రుక్మిణమ్మ.

ఆయన జవాబుగా నవ్వి ఊరుకున్నాడు.

కాసేపు అక్కడ కూర్చున్నాక, ఆయన మనసుకు కాస్త ప్రశాంతత చిక్కినట్టు అనిపించిందేమో!

ఓ రెండు గంటల తర్వాత ఆయన లేచి "వెళ్ళొస్తాను" అంటూ ఇంట్లోంచి బయటకు నడిచాడు.

★ ★ ★

"అరుణ్! ఈ సీన్ పేపర్స్ కాస్త ఫెయిర్ చేసి పెట్టు" ధనరాజ్ అతడి చేతికి కొన్ని పేపర్స్ అందించాడు.

అక్షరాలను నీట్‌గా వ్రాసిపెట్టడం అసిస్టెంట్ డైరెక్టర్లకు ప్లస్ పాయింట్. ఒకవిధంగా అది వారి బాధ్యత కూడా.

అరుణ్ ఆ పేపర్స్ అందుకుని లొకేషన్‌లో ఓ మూలగా వెళ్ళాడు.

అవుట్ డోర్‌లో జరుగుతోందారోజు షూటింగ్.

అది ఓ పార్క్. హీరో ఫ్రెండ్స్‌తో కలిసి కాలక్షేపం కోసం పార్క్‌కి వస్తాడు. ఆ హీరోయిన్ కూడా పార్క్‌కి వస్తుంది. ఆమె తన ఫ్రెండ్స్‌తో దాగుడుమూతలు ఆట ఆడుతూ, పొరపాటున అతడిని పట్టేసుకుంటుంది. అదీ సీను.

ద్వారాకానాథ్‌కి తనదంటూ ఒక ముద్ర

ఉంది. ఆయన ప్రతి సీనూ 'ఇది ద్వారకానాథ్‌గారి సినిమా' అనేలా చిత్రీకరిస్తారు.

అరుణ్ పేపర్స్ తీసుకుని రాయడం మొదలుపెట్టాడు.

లైట్‌బాయ్‌లు లైట్లు అడ్జస్ట్ చేసుకుంటున్నారు. కెమేరామెన్ కెమేరా సరిచూసుకుంటున్నాడు. మేకప్‌మెన్‌లు హీరో హీరోయిన్లకు మేకప్ చేస్తున్నారు. వారి ఫ్రెండ్స్‌గా నటించే జూనియర్ ఆర్టిస్టులు దూరంగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు... పార్కులోని జనమంతా షూటింగ్ చూసేందుకు చుట్టూ మూగివున్నారు.

అంతా హడావిడి... ఎవరి పనుల్లో వారు బిజీగా ఉంటూ, లేక బిజీ నటిస్తూ...

అతడు రాయడం పూర్తయింది.

పేపర్స్ తీసుకెళ్ళి ధనరాజ్‌కి అందించాడు. ఆయన పేపర్స్ ఒకసారి చూసుకుని "అక్షరాలు చాలా బాగున్నాయోయ్" అన్నాడు.

"ఆర్టిస్ట్ అనేవాడికి అక్షరాలు నీట్‌గా కుదురుతాయి సార్" అని చెప్పాలనిపించింది. కాని అనవసర ప్రసంగం అనిపించి మౌనంగా ఉండిపోయాడు అతడు.

ధనరాజ్ పేపర్స్ పట్టుకుని హీరో రామ్ ప్రసాద్ దగ్గరగా వెళ్ళాడు. హీరో మేకప్ అవుతూ ఉండగానే, ఆయన హీరోగారి పక్కనే కూర్చుని సీన్ వివరించడం మొదలుపెట్టాడు.

డైరెక్టర్ ద్వారకానాథ్ కెమేరా దగ్గర నిలబడి కెమేరా యాంగిల్స్ చూసుకుంటున్నవాడల్లా, అప్పుడు ధనరాజ్ దగ్గరగా వచ్చి "హీరోగారికి సీన్ వివరించావా?" అడిగాడు.

"చెప్పానండీ" బదులిచ్చాడు ధనరాజ్.

ఆయన సీన్ తాలూకూ పేపర్స్ తీసుకుని హీరోయిన్ దగ్గరగా వెళ్లాడు. హీరోలకు సీన్ కో-డైరెక్టర్, అసోసియేట్ డైరెక్టర్లు వినిపిస్తే- హీరోయిన్లకు మాత్రం సాధారణంగా డైరెక్టరే సీన్ వివరిస్తాడు... సినిమా ప్రారంభమయిన ఈ రెండు మూడు రోజుల్లో అరుణ్ గమనించిన విషయం ఇది.

ద్వారకానాథ్ హీరోయిన్ పక్కనే కూర్చుని నవ్వుతూ సీన్ వివరిస్తుంటే అటే చూస్తుండిపోయాడు అరుణ్.

'సినిమా ఇండస్ట్రీ మగవాళ్లని అంతగా ఆకర్షించడానికి ఉన్న కొన్ని కారణాలలో 'స్త్రీ శరీరమూ' ఒక కారణమేమోననిపిస్తుంది అతడికి.

అందమైన ఆడవాళ్లు ఈచోట అతి సులువుగా దొరుకుతారు. కోరికలు తీర్చుకోవడానికిది అనువయినచోటు...

మరి ఆడవాళ్లు ఈ రంగంపట్ల ఎందుకు ఆకర్షితులవుతున్నారు? ఆ ప్రశ్నకు అతడికి వెంటనే జవాబు దొరకలేదు. కాసేపు ఆలోచించాక జవాబు తోచింది. ఇక్కడ ఈజీమనీకి అవకాశం ఉంది. సినిమా స్టార్‌గా పాపులారిటీ దొరుకుతుంది. తన అందాన్ని ఎరవేసి సకల సౌకర్యాలూ అనుభవించవచ్చు. డబ్బు, పాపులారిటీ ఆశించకుండా, కేవలం నటనమీద ఆసక్తితో ఏ ఆడదీ ఈ ఇండస్ట్రీకి రావడం జరగదు..."

హీరో హీరోయిన్ల మేకప్ పూర్తయింది.

సూర్యుడు మబ్బులచాటునుండి బయట కొస్తూ కనిపించాడు. సరయిన లైటింగ్ లేకపోతే అవుట్‌డోర్‌లో షూటింగ్ అసలు జరగదు.

ధనరాజ్ అరుణ్ దగ్గరగా వచ్చి చెప్పాడు. "క్లాప్‌బోర్డు తీసుకుని డేట్, సీన్ నంబర్, టేక్‌నంబర్ తీసుకో. టేక్ నంబర్ చాలా జాగ్రత్తగా మార్చుకోవాలి. ఎందుకంటే, ఎడిటింగ్‌కి ఆ నంబర్ చాలా అవసరం"

"అలాగే సార్"

అతడు అక్కడే ఉన్న క్లాప్‌బోర్డు తీసుకున్నాడు. క్లాప్ బోర్డ్ చేతిలోకి తీసుకుంటూ ఉంటే అతడికి నవ్వొచ్చింది. ఈరోజు హీరో




హీరోయిన్లమీద క్లాప్ కొడుతున్న తను రేపు సినిమా హీరో కావాలనుకుంటున్నాడు. తన ముఖాన మరొకరు క్లాప్ కొట్టాలని అనుకుంటున్నాడు. అది అత్యాశేనా? అసాధ్యమా...?

ఈ రెండూ కాదనిపించింది. మనిషి అన్నవాడు ఆశపడడం సహజం! టీ కొట్టులో పనిచేసిన ఒబెరాయ్, భారతదేశంలోని ఓ గ్రూప్ ఆఫ్ ఫైవ్‌స్టార్ హోటల్స్‌కి అధిపతిని కావాలని కోరుకుని ఉంటే అది అత్యాశనా? కాదే... పోనీ అసాధ్యమా? కాదు, కాబోదు. అందులోనూ ఈ విచిత్ర పరిశ్రమలో కాఫీ కప్పులు అందించిన ప్రొడక్షన్‌బాయ్ సినిమా నిర్మాత అయ్యాడు. క్లాప్ కొట్టిన అసిస్టెంట్ డైరెక్టర్ కలెక్షన్ కింగ్ లాంటి హీరో అయ్యాడు. ఆశించడంలో, లక్ష్యం ఏర్పరచుకోవడంలో తప్పు లేదు. కాకపోతే ఆ లక్ష్యంవైపు ఏకాగ్రతగా, పట్టుదలగా సాగిపోవాలి. అంతే.

అతడు క్లాప్ బోర్డ్ మీద డేట్, సీన్ నంబర్, టేక్‌నంబర్ వేశాడు.

"షాట్ రెడీ" అంటూ వినిపించాక, అరుణ్ క్లాప్‌బోర్డ్ పట్టుకుని అటుగా వెళ్ళాడు.

హీరో నిలబడి ఉన్నాడు. కెమేరా వ్యూలెంగ్త్ చూసుకున్నారు. అరుణ్ హీరో ముఖాన క్లాప్ కొట్టి పక్కకు తప్పుకున్నాడు. హీరో వెనుకకు వెళుతుంటే, వెనకగా వచ్చిన హీరోయిన్ అతడిని పట్టేసుకుని "పట్టేశా... పట్టేశా" అని కళ్లగంతలు విప్పుకుంది.

ద్వారకానాథ్ ఆ టేక్ పట్ల తృప్తి కనపరచలేదు. "వన్‌మోర్" అన్నాడు. అరుణ్ క్లాప్‌బోర్డుమీద టేక్ నంబర్ మార్చాడు.

నాలుగు టేకులు తిన్నాక టేక్ ఓ.కె. అయింది. ఒకటి రెండు సెకనులు మాత్రమే కనులముందు నిలచే సీన్‌కోసం వందల మంది జనం శ్రమపడి వేల రూపాయలు ఖర్చుపెట్టి పిక్చరైజ్ చేస్తారని ప్రేక్షకుల్లో చాలాకొద్ది మందికి మాత్రమే తెలిసి ఉంటుంది. ఇంతమంది జనం శ్రమను ప్రేక్షకుడు ఒక్క సెకనులో 'ప్చ్' అంటూ తేల్చేస్తాడు.

మధ్యాహ్నానికి ఆ ఒక్క సీన్ పిక్చరైజ్ చేసుకున్నాక పేకప్ అన్నారు.

ముందుగా హీరో హీరోయిన్లు కార్లలో వెళ్ళిపోతే వారి వెనుకే దర్శకుడు మరో కారులో ఆ ప్రదేశాన్ని విడిచేశాడు.

ఒక చిత్రం 'పేకప్' అయ్యాక సెట్ ప్రాపర్టీలనుండి స్క్రిప్ట్ పేపర్స్ వరకూ భద్రపరచవలసిన బాధ్యత అసిస్టెంట్ డైరెక్టర్లమీద ఉంటుంది. కుర్చీలు, భోజన సామాగ్రిలాంటివి మాత్రం ప్రొడక్షన్ డిపార్ట్‌మెంట్ చూసుకుంటుంది.

సెట్ ప్రాపర్టీ సరిచూసుకుంటున్నప్పుడు ధనరాజ్ అరుణ్ దగ్గరగా వచ్చి అడిగాడు, "అవునూ! ఇంతకీ నువ్వుండేది ఎక్కడ?"

"గాంధీనగర్‌లో ఓ ఫ్రెండ్ రూమ్‌లో సార్"

"అబ్బా! ఇండస్ట్రీకి చాలా దూరం కదూ?"

ఆయన సాలోచనగా పలికాడు "మనం ఇండస్ట్రీలో బతకదలచుకున్నవారం. ఇండస్ట్రీకి దగ్గరగా అందుబాటులో ఉండాలి"

"తెలుసు సార్"

"తెలిసీ మరి అక్కడే ఉండడం ఏమిటి?"

అతడు మొహమాటపడకుండా చెప్పాడు.

"ఆర్థిక సమస్య"

ధనరాజ్ తలమీద గట్టిగా కొట్టుకున్నాడు. "ప్చ్! నాకు బాగా మతిమరుపు వచ్చేస్తోందోయ్. నీ పరిస్థితి గురించి పీతాంబరం పూర్తిగా వివరించాడు. అయినా నేనిలా అడగడం బాగోలేదు. ముఖ్యంగా నీకు ఇంతవరకూ నిర్మాత నుండి కొంతయినా డబ్బు ఇప్పించకపోవడం అసలు బాగోలేదు"

అరుణ్ మౌనంగా ఉండిపోయాడు.

ఆయనే అన్నాడు, "నీకో విషయం

తెలుసా? ఇలా డైరెక్షన్ డిపార్ట్‌మెంట్‌లో తొలి సినిమాకు చేస్తున్నప్పుడు సాధారణంగా డబ్బులు ఇవ్వరు. 'అప్రెంటిస్' అంటూ ఏదో ఖర్చులకోసం వందా, రెండొందలు ఇస్తుంటారు. అదీ నిర్మాత మంచివాడయితేనే. నేను నీ గురించి కాస్త ఎక్కువే చెప్పాను. కాబట్టి ఓ ఐదువేల వరకూ ఈ సినిమాకు ఇప్పించగలను. అందులో కొంత రేపు నిర్మాతకు చెప్పి ఇప్పిస్తాను"

"థాంక్స్ సార్"

"థాంక్స్ చెప్పడానికి కాదు. ఆ డబ్బులతో కృష్ణానగర్‌లో ఎక్కడయినా ఓ రూమ్ తీసుకుని ఉండు. లేదా మన కుర్రాళ్ళ రూమ్‌లో కొంత రెంట్ షేర్ చేసుకుంటూ ఉండిపో"

అతడు జవాబుగా తలాడించాడు.

ఆ సాయంత్రం అతడు రమేష్‌కి ఈ విషయం చెబితే కాస్త ఇబ్బందిగా ఫీలయ్యాడు. తను మొదట్లో అరుణ్‌ని అలా హర్టయ్యేలా మాట్లాడి ఉండకూడదనుకున్నాడు. ఎందుకో... ఎందుకో తెలియదు. ఈ మధ్య అరుణ్ పట్టుదల పోరాటం చూస్తుంటే, అతడు లక్ష్యం చేరగలడేమోనని పిస్తోంది.

లక్ష్యం చేరగలిగిన అలాంటి వ్యక్తికి తొలుత తాను కాస్త సహాయపడి ఉంటే, ఒకవేళ అతడు కనుక సినిమా హీరో అయితే అప్పుడు తనీ ఉద్యోగం చేయనవసరం లేదు. కేవలం అతడి పక్కనే తిరుగుతున్నా చాలు... తన జీవితం హేపీగా గడిచిపోతుంది. అందుకే తను పొరపాటు చేశాడేమోనని బాధపడుతున్నాడు.

"రేయ్! కృష్ణానగర్ వరకూ ఎందుకురా? ప్రతిరోజూ నన్ను ఆఫీసులో దించేసి నువ్వు నా స్కూటర్‌లో వెళ్ళిపోవచ్చు కదా"

"వద్దులే..."

"పోనీ, నేనూ నీ వెంట కృష్ణానగర్‌కి..."

రమేష్ మాటలు మధ్యలోనే కట్‌చేస్తూ, అరుణ్ పలికాడు. "నేనే మరో కుర్రాడి రూమ్‌లో చేరాలనుకుంటున్నాను. నా వెంట నిన్నూ తీసుకెళ్లడం అంత బాగోదేమో"

తనతో అరుణ్ ఫ్రెండ్‌షిప్ కట్ చేసుకోవాలనుకుంటున్నాడన్నది రమేష్‌కి అర్థమయిపోయింది. అతడు మరేం మాట్లాడలేకపోయాడు.

ఆ తర్వాత రెండు రోజులకు అరుణ్ ఓ అసిస్టెంట్ డైరెక్టర్ రూమ్‌లోకి షిఫ్ట్ అయ్యాడు.

ఆ అసిస్టెంట్ డైరెక్టర్‌తో నాలుగు రోజులలోనే చాలా క్లోజ్‌నెస్ ఏర్పడింది. ఆ కుర్రాడు కూడా అరుణ్‌ని గౌరవిస్తూ "గురూజీ" అనేవాడు.

ఆ కుర్రాడే అరుణ్‌కి ఇండస్ట్రీ గురించి ఎన్నో విషయాలూ, నిజాలూ చెప్పేవాడు. హీరోగా అవకాశాలకోసం వెళ్ళవలసిన దారులన్నీ వివరించి చెప్పేవాడు.

ఆ కుర్రాడి పేరు- తిరుపతి.

★ ★ ★

"చూశావా గురూజీ! ద్వారకానాథ్ గారేమో పేరుకి కళాత్మక చిత్రాల దర్శకుడు. కాని ఆయన సినిమాలలో కూడా హీరోయిని డ్యాన్స్ పెట్టాలట. చాలా చిత్రమయిన విషయం కదూ? "

తిరుపతి మాటలకు నవ్వి ఊరుకున్నాడు అరుణ్.

"ఎంత గొప్ప డైరెక్టరయినా సరే, ఆడదాన్ని ఎక్స్‌పోజ్ చేయకుండా సినిమా సక్సెస్ చేయడం చాలా కష్టమయిన పని అయిపోయింది గురూ... సినిమాలో ఎంతగా... ఎంతగా ఎక్స్‌పోజ్ ఉంటే ఆ సినిమా అంతగా హిట్ అవుతుందని మన డైరెక్టర్లకి నమ్మకం కుదిరిపోయింది"

"హిట్ కావడానికి ఎక్స్‌పోజింగ్ అవసరంలేదనీ, కాసింత చక్కని కథ, ఆహ్లాదకరమైన వాతావరణం చిత్రీకరిస్తే చాలు సినిమాలో హీరో ఎవరు, ఎక్స్‌పోజింగ్ ఉందా లేదా అన్నది కూడా చూడకుండా జనం సినిమాను సక్సెస్ చేస్తున్నారన్నది ఈమధ్య




విజయవంతమయిన కొన్ని సినిమాలు రుజువు చేశాయి కదా? "

తిరుపతి సాలోచనగా కాసేపు ఉండి పోయి "అది నిజమేననుకో గురూజీ! కాని మన ఇండస్ట్రీ జనం మంచిని అంత సులభంగా ఆహ్వానించరు. చెడునయితే మాత్రం అలాగే పట్టేసుకుంటారు. సినిమా హిట్‌కి ఎక్స్‌పోజింగ్ అవసరమని నమ్మిన దర్శకులు, ఇప్పుడు ఆ భావాన్ని వదిలేయడానికి అంతగా ఇష్టపడడంలేదు"

కాసేపాగాక "అయితే రేపటి నుండి హాసినిమీద సాంగ్ పిక్చరైజేషన్ జరగబోతోందా? " అడిగాడు అరుణ్.

"అవును... స్టూడియోలోనే"

అతడికి ఆ క్షణం తను సిటీకి వచ్చిన కొత్తలో ఓ షూటింగ్ స్పాట్‌లో డైరెక్టర్‌ని కలుసుకునేందుకు వెళితే, ఆ చోట హాసిని కనిపించడం గుర్తొచ్చింది. ఆమె డైరెక్టర్‌ని చీర కట్టుతో మంచి వేషాలు అడగడం మనసులో మెదలాడింది.

ఆ హాసినిని... మళ్ళీ... మళ్ళీ ఒకసారి చూడబోతున్నాడు. ఎందుకో తెలియదు మనసు కొత్తగా స్పందించింది. ఆ స్పందనకు అతడు 'జాలి' అనే పేరుపెట్టుకున్నాడు.

"గురూజీ! ఇంతకీ నీ ప్రయత్నాలు ఎంత వరకూ వచ్చాయి? "

తను హీరో వేషాల కోసం ప్రయత్నాలు సాగించడం తిరుపతికి ఏనాడో చెప్పాడు అతడు. ఆ ప్రయత్నాలు తిరుపతికి కొంత వరకూ తెలుసు.

"డైరెక్టర్లని కలుస్తూనే ఉన్నాను తిరుపతీ! అందరూ ఏదో చెప్పి పంపిస్తూనే ఉన్నారు తప్ప, ఏ ఒక్కరూ కనీసం ఇంతవరకూ ప్రామిస్ కూడా చేయలేదు" అతడి గొంతులో మొదటిసారిగా నిరాశ పలికింది. అది గమనించాడు తిరుపతి.

"ఇంత త్వరగా ప్రయత్నం సఫలం కాదు గురూజీ! తిరగాలి... తిరగాలి... తిరగాలి... ఎప్పటికో, ఎవరికో జాలి పుడుతుంది లేదా వారి అవసరానికి నువ్వు గుర్తురావడం జరుగుతుంది. లేదా నీ టాలెంట్ ఏమిటో చూడాలన్న ఆలోచన కలుగుతుంది. అప్పుడే నీ ప్రయత్నం ఫలిస్తుంది"

అతడు మౌనంగా ఉన్నాడు.

తిరిగి తిరుపతి అన్నాడు "ఇండస్ట్రీలో 'హీరో' అనే వాడికి వచ్చే ఇమేజ్, డబ్బూ చూశాక నిర్మాత, దర్శకులు, హీరోలు- ఏ అనామకుడికో ఆ 'ఇమేజ్' కల్పించి వాడిని గొప్ప వాడిని చేయడం ఎందుకు అనుకుంటున్నారు. అందుకే రిస్క్ ఎలాగూ తప్పదనుకుంటున్నప్పుడు ఆ రిస్క్ తమ వారిమీదే చేయాలనుకుంటున్నారు. అందుకే వారు తమ బిడ్డల్ని హీరోలుగా చేయడం మొదలు పెట్టారు. వారసత్వ సాంప్రదాయం మొదలయ్యాక బయటనుండి ఒక వ్యక్తి వచ్చి తన టాలెంట్‌తో హీరోకావడం అన్నది చాలా... చాలా కష్టమయిపోయింది"

"అది నిజమే" ఒప్పుకున్నాడు అరుణ్.

అందువల్లే కాబోలు ఈమధ్యకాలంలో తెలుగు సినిమా ఇండస్ట్రీలో నటనను ఊపిరిగా, నటనే జీవితంగా తలచుకునే హీరోలు తక్కువయ్యారు. నాలుగైదు సినిమాలు చేశాకే నటనను ఇంప్రూవ్ చేసుకోవడం మొదలుపెట్టారు. జనం కూడా సరిపెట్టుకోవడం మొదలుపెట్టారు గానీ ఒక పాత్రకు తగిన నటనను దర్శించలేకపోతున్నారు.

అతడికిప్పుడిప్పుడే ఆ ఆలోచన కలుగుతోంది. అవకాశాలకోసం ప్రయత్నిస్తున్నాడు తను. సరే! అంతవరకూ బాగానే ఉంది. కాని ఆ అవకాశం లభించాక తను నటనను ప్రదర్శించగలడా? ఆ అనుమానమే తననుకొద్దిగా భయపెడుతోంది కూడా! అందుకు... అందుకు తనేం చేయాలి? నటన అన్నది ప్రదర్శించడానికి తనేం నేర్చుకోవాలి?

అతడికి ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్స్ గుర్తుకొచ్చాయి. అయితే ఆ ఇన్‌స్టిట్యూట్స్‌లో యాక్టింగ్‌కోర్స్ కంప్లీట్ చేయాలంటే రెండు, మూడేళ్ళు అవసరపడుతుంది. కాని తను అంతకాలం నటన నేర్చుకుంటూ ఉండిపోలేడు. ఒక్క సంవత్సరం ఇప్పటికే అందులో ఇరవైరోజులు అయిపోయాయి. ఇక పదకొండు నెలలా పదిరోజుల్లో తను హీరోగా దర్శనమివ్వాలి? ఇది ఎలా సాధ్యం?

తన వెనుక పెట్టుబడి పెట్టే నిర్మాత లేడు. దగ్గరి బంధువయిన డైరెక్టర్ లేడు. మరి తనెలా హీరో కాగలడు?

కేవలం తన టాలెంట్‌తోనే హీరో కావాలి.

అతడు తల తిప్పి తిరుపతికేసి చూస్తూ అడిగాడు.

"తిరుపతీ! 'నటన' గురించి తెలుసుకునేందుకు పుస్తకాలేమయినా ఉన్నాయా? "

అరుణ్ ఆ ప్రశ్న ఎందుకడిగాడో అర్థంకాలేదు తిరుపతికి. అర్థమయ్యాక సన్నగా నవ్వుతూ పలికాడు. "నటన గురించి తెలుసుకోవడం కోసం పుస్తకాలు చదవడంకన్నా, క్యాసెట్స్ తెచ్చుకుని ఒక్కో నటుడిని పరిశీలించడమే ఉత్తమమని నా అభిప్రాయం. ఒక్కో నటుడి నటనే ఒక్కో పరిశీలనా గ్రంథం అవుతుంది. ఆ గ్రంధాలను పరిశీలించు. ఆ గ్రంథాలను సంపూర్ణంగా అర్థం చేసుకోగలిగితే నువ్వు నటనలో డాక్టరేట్ సంపాదించినవాడివవుతావు"

అతడు మెల్లగా ఓ నిర్ణయానికి వచ్చాడు. 'ధనరాజ్ తనకు ఇప్పించిన డబ్బు తన స్వంత ఖర్చులకే కాదు... అది వీడియో క్యాసెట్స్ చూడడానికీ, నటన నేర్చుకోవడానికీ కూడా!'

హాసిని కారు దిగి అందరినీ విష్ చేసుకుంటూ నడుస్తోంది. ఆమె వెనుకే కారు దిగిన ఓ గడ్డపు వ్యక్తి అటూ ఇటూ చూస్తూ ముందుకు నడుస్తున్నాడు.

ఆ సమయంలో అరుణ్ ఓచోట కుర్చీలో కూర్చుని స్క్రిప్ట్ పేపర్లు ఫెయిర్ చేస్తున్నాడు. అతడు హాసినిని చూశాడు. మనసులో ఏదో స్పందన... అర్థంకాని బాధ...

అరుణ్ అప్పుడే అటుగా వచ్చిన తిరుపతిని పిలిచి "హాసిని వెనక దిగిన ఆ గడ్డం వ్యక్తి ఎవరు? " అడిగాడు.

"ఆయనెవరా? ..." అని అతడు ఇటూ అటూ చూసి "ఆ కథ చెప్పాలంటే చాలా ఉంది. ఇప్పుడు టైమ్ లేదు గురూజీ! సాయంత్రం రూమ్‌కెళ్ళాక గుర్తుచెయ్యి. వివరంగా చెపుతా..." అంటూ తిరుపతి మరోవైపు హడావిడిగా వెళ్ళిపోయాడు.

అరుణ్ తలతిప్పి హాసినికేసి చూశాడు. ఆమె ద్వారకానాథ్‌తో ఏదో మాట్లాడి, దూరంగా వెళ్ళి ఓ కుర్చీలో కూర్చుంది. అతడు అటుకేసే చూస్తున్నాడు. ఆ కూర్చోవడంలో ఆమె కాలుమీద కాలేసుకుని హుందాగా కూర్చుంది. కుర్చీలో వెనక్కువాలి కూర్చోవడంలో తనమీద తనకు నమ్మకం కనిపిస్తోంది. ఎవరికేసీ చూడని ఆ చూపులలో ఓ నిర్లక్ష్యం కదలాడుతోంది.

అంతలో మరో కారు ఫ్లోర్‌ముందు ఆగింది. హీరోగారు కారు దిగారు. ఓ నిర్మాత కొడుకు అతడు. చాలాకాలంపాటు ఇతరులను హీరోలుగా పెట్టి సినిమా తీసిన ఆ నిర్మాత ఆ తర్వాత తన కొడుకునే హీరోగా ఇంట్రడ్యూస్ చేశాడు. అనుభవంతో సొంతస్టయిలంటూ ఒకటి క్రియేట్ చేసుకోగలిగాడు అతడు. ఆ హీరో మెల్లగా పాపులర్ హీరో కాగలిగాడు. అరుణ్ హీరోగారికేసి కూడా చూడడంలేదు. హాసినికేసే చూస్తున్నాడు. హీరోగారు సెట్‌లోకొచ్చాడంటే సాధారణంగా, హీరోయిన్ నుంచి నిర్మాత, దర్శకుల వరకూ మర్యాద పూర్వకంగా లేచి నిలబడతారు. అలాంటిది హాసిని కాలుమీద వేసుకున్న కాలు కూడా తీయకుండానే ఎటో చూస్తోంది.

అరుణ్‌కి చాలా ఆశ్చర్యమేసింది. ఏమిటీ

మేధీమా? తమ కెరీర్ కోసం ఈ ఇండస్ట్రీ లోని ప్రతి ఒక్కరూ తమకు ఇష్టమున్నా లేకపోయినా ఎదుటి వ్యక్తితో నవ్వుతూ మాట్లాడుతారు. అవతలి వ్యక్తి మహాదుర్మార్గుడని తెలిసినా, మర్యాదలోపం మాత్రం చేయరు. అలా చేయకపోతే అవతలి వ్యక్తి ఇవతలి వాడిని వీలయినంత వరకూ అణగదొక్కేందుకే ప్రయత్నిస్తాడు.

అలాంటి హిపోక్రసీ ప్రధానమైన రంగంలో, ఆమె హిపోక్రసీ ప్రదర్శించకుండా, తనకు నచ్చిన విధంగా ప్రవర్తించడం అతడికి ఆశ్చర్యం కలిగించింది.

హీరోగారే హాసిని దగ్గరగా వెళ్ళి ఆమెను విష్‌చేశాడు. ఆమె కుర్చీలో నుండి లేవకుండానే అతడిని విష్ చేసింది.

అప్పుడే ధనరాజ్ కెమేరా దగ్గరనుండి కేకవేశాడు. "అరుణ్... అరుణ్"

అతడు చప్పున పైకి లేస్తూ "వస్తున్నాను సార్!" అన్నాడు.

అరుణ్ దగ్గరగా వెళ్ళాక "స్క్రిప్ట్ పేపర్స్ ఫెయిర్ చేయడం అయిపోయిందా? " అడిగాడు ధనరాజ్. అతడు తలాడించి తన చేతిలోని పేపర్స్ ఆయనకు అందించాడు.

అతడు ఆయనకు పేపర్స్ అందించి, క్లాప్ బోర్డువైపు నడుస్తుండగా "హలో" అన్న సుమధురస్వరం వినిపించింది. అరుణ్ చప్పున తలతిప్పి ఆవైపు చూశాడు.

హాసిని... హాసిని తనకేసే ఆశ్చర్యంగా చూస్తోంది. అంతే కాదు. ఆమె తనను దగ్గరకు పిలుస్తోంది.

అరుణ్ ఆమె దగ్గరకు అడుగువేశాడు.

"మీరు... మీరు... సినిమా హీరో కావాలని ప్రయత్నాలు సాగిస్తున్నట్టున్నారు కదూ? "

ఆమె తనను గుర్తుపట్టిందని అతడికి అర్థమయింది. ఎప్పుడో... ఎప్పుడో షూటింగ్ స్పాట్‌లో కొద్దిక్షణాలు మాత్రమే చూసినా తనను గుర్తుపెట్టుకుని ఆమె అలా అడగడం ఆశ్చర్యం కలిగించడమే కాదు. కాస్త ఇబ్బందిగా అనిపించింది కూడా! ఏదేమయినా ఆమె జ్ఞాపకశక్తిని మాత్రం మెచ్చుకోకుండా ఉండలేకపోయాడు.

అయితే తన ప్రయత్నాలు తన యూనిట్‌లోని వారికి తెలియడం ఇష్టంలేదు. అందుకే ఆ ఇబ్బంది.

అతడు ఇబ్బందిగా తలాడిస్తూ "ఆఁ!..." అన్నాడు.

ఆమె అతడిని తదేకంగా చూస్తూ "మరి ఆ ప్రయత్నాలు చేసేవారు, ఈ పోస్ట్‌కి ఎందుకొచ్చారు? " ప్రశ్నించింది. అలా ప్రశ్నించడంలో వ్యంగ్యం కనిపించడంలేదు. కేవలం క్యూరియాసిటీ మాత్రమే పలుకుతోంది.

అతడు చుట్టూ చూశాడు. యూనిట్‌లోని చాలామంది తమ ఇద్దరినే గమనించడం గుర్తించాడు అతడు. అందరికన్నా ముఖ్యంగా ఆ గడ్డం వ్యక్తి తనకేసే పరీక్షగా, అనుమానంగా చూస్తున్నాడు. ఆ గడ్డం వ్యక్తి చూపులు ఏదోలా ఇబ్బందికరంగా ఉన్నాయి.

అరుణ్‌వెంటనే తడబాటును సర్దుకున్నాడు. తన కుడిచెయ్యి కదిలిస్తూ చెప్పాడు. "బతకడంకోసం" అనేసి క్లాప్ బోర్డ్‌వైపు వెళ్ళిపోయాడు.

హాసిని తనతో మాట్లాడడం చూసి కాబోలు, డైరెక్టర్ ద్వారకానాథ్ ఆమె దగ్గరగా వెళ్ళాడు. ఆయన ఆమెను ఏమడిగాడో తెలియడంలేదు గానీ, ఆమె మాత్రం తన కేసే చెయ్యి చూపించడం గమనించాడు అరుణ్. అంటే... ఆమె తన ప్రయత్నాల గురించి ద్వారకానాథ్‌కి చెప్పి ఎగతాళి చేస్తోందా?

ఊహుఁ! ఆమె అలాంటి వ్యక్తిత్వం కలదని అనిపించడంలేదు. ఈ ప్రపంచంలో ఎవరినీ కేర్ చేయని వ్యక్తి మరో వ్యక్తి గురించి అలా చీప్‌గా కామెంట్ చేయడం జరగదేమో!



అతడి ఊహ నిజమయింది.

ఆ మధ్యాహ్నం... లంచ్ బ్రేక్‌లో తనను ఎన్నడూ పలకరించని ద్వారకానాథ్ దగ్గ రగా పిలిచాడు. తనను పరీక్షగా చూస్తూ "హాసిని చెప్పింది నిజమేనోయ్! నీలో హీరో కాగలిగిన లక్షణాలన్నీ ఉన్నాయి. చూద్దాం... మరేదయినా సినిమాలో మొదట హీరో కాకపోయినా, కనీసం చిన్న కారెక్టరయినా ఇచ్చి నీలో 'నటన' ఎంతవ రకూ ఉందో తెలుసుకోవాలి" అన్నాడు.

ద్వారకానాథ్‌లాంటి వ్యక్తి ఆ మాటలు అన్నాడంటే అటువంటి కాంప్లిమెంట్ ఇచ్చా డంటే... అతడికి అవకాశం చేతచిక్కినంత ఆనందం కలిగింది. తన బ్రతుకు 'మరోమ లుపు' తిరుగబోతోందన్న ఆశ కలిగింది.

అతడు లంచ్ చేస్తున్న హాసినికేసి చూశాడు. హాసిని తల వంచుకుని తింటు న్నదల్లా, ఎందుకో తలెత్తడంతో తనవైపే చూస్తున్న అతడు కనిపించాడు. చూపులు కలుసుకున్నాయి. తన చూపులలోని కృత జ్ఞత ఆమె గుర్తించిందో లేదో అతడికి తెలి యదు.



"హాసిని ఓ పల్లెటూరి నుండి సినిమా మోజుతో సిటీకి చేరుకుంది. ఆ తర్వాత వేషాలకోసం ఎన్ని ప్రయత్నాలు చేసిందో, ఎన్ని కష్టాలు పడిందో తెలియదు... ఎట్టకే లకు 'వాంప్' కేరక్టర్స్ దొరికాయి. బాగా పాపులారిటీ తెచ్చుకుంది. నేడు ప్రతి సిని మాలో హాసిని డ్యాన్స్ కంపల్సరీగా ఉండితీ రాలి. ఆమె డబ్బు కూడా బాగా సంపాదిం చింది. అయితే గురూజీ! ఈ చిత్రపరిశ్ర మలో తరతరాల చరిత్ర గమనించిచూడు గొప్ప పేరు, కోట్లకొలదీ డబ్బు సంపాదిం చిన ఆడది ఓ మగాడికి దాసోహమం టుంది. అది కూడా ఓ పెళ్ళయి మొదటి భార్యకు పిల్లలుండిన మగాడికి రెండోపె ళ్ళాంగా లేదా ఉంపుడు గత్తెగా మిగిలిపో తుంది. ఎందుకిలా జరుగుతోంది. ఏ ఒక్క నటో కాదు, ఆలిండియా లేడీ సూపర్‌స్టార్ అని పేరు తెచ్చుకున్న నటి కూడా ఓ రెండో పెళ్ళి మగాడిని కట్టుకుని కష్టాలను కొనితె చ్చుకుంది"

హాసిని గురించి అరుణ్‌కి ఏమీ తెలి యదు. తిరుపతి చాలా కాలంగా ఇండస్ట్రీలో ఉన్న వ్యక్తి కాబట్టి ఆ రంగంలోని వ్యక్తుల పర్సనల్‌లైఫ్ గురించి కొంత తెలుసు. హాసిని గురించి తిరుపతి కొంత చెప్పబోతు న్నాడని అర్థమయింది అతడికి.

తిరుపతి కంటిన్యూ చేసాడు. "తాను వేషాల కోసం ప్రయత్నాలు చేసేప్పుడు, కష్టాలు పడేప్పుడూ లేని ఆ గడ్డపు వాడు ఎక్కడినుండి వచ్చాడో, ఎలా వచ్చాడో తెలి యదు. ఆమెను తన గుప్పిట్లో ఇరికించుకు న్నాడు. ఆమె అందం, డబ్బు సొంతం చేసు కోవడమే కాదు, ఈ రోజు అతడు ఎలాచె పితే, ఆమె అది విని తీరాలి. అతడు ఒప్పు కున్న సినిమాలలోనే నటించాలి. అతడు అటెండ్ అవమన్న కాల్షీట్స్‌కి అటెండ్ కావాలి. అంతే కాదు, ఆ వ్యక్తి ఆమెను శారీ రకంగా కూడా హింసిస్తుంటాడని కూడా అనుకుంటూ ఉంటారు. కాని ఆ మాట ఎంత నిజమో నాకయితే తెలియదు. ఏదే మయినా ఆమె కెరీర్‌నే కాదు, ఆమెనూ నాశనం చేస్తున్నాడు ఆ వ్యక్తి"

ఎందుకో తెలియదు, అరుణ్‌కి గుండె కింద నరమేదో మెలిపడినట్టనిపించింది.





తెరమీద మత్తు చూపులతో, కవ్వించే ఊపులతో ప్రేక్షకులను మరో ప్రపంచంలో నికి తీసుకెళ్ళే నటి వెనుక ఇలాంటి విషాద గాథ ఉంటుందని ఎవరు మాత్రం అనుకో గలరు. అయితే, చూస్తూ ఉంటే ఈ రంగుల ప్రపంచంలో తెరవెనుక కనిపించేది ఎక్కువగా విషాదగాథలే!

"...హాసిని గురించిన కథ అదీ గురూజీ!"

అరుణ్ మౌనంగా తలాడించాడు. అయితే జవాబుగా మరేం మాట్లాడలేకపో యాడు. మనసులో తెలియని బాధ సుడులు తిరుగుతుంటే పెదవి విప్పడానికి శక్తిచాలదేమో! తిరుపతికి అతడి మనసు లోని వేదన గురించి తెలియదు.

"... అయినా హాసిని మీ గురించి డైరె క్టర్‌గారికి ఫ్లస్‌గా చెప్పిందట కదా? ... ఈ రోజు లొకేషన్‌లో అందరూ ఆ విషయం గురించే చర్చించుకున్నారు. తెలుసా గురూజీ? "

అతడు ఆ మాటలు వినిపించుకోలేదు. ఆమె గురించే ఆలోచిస్తూ ఉన్నాడు. 'ఒక తార తెరవెనుక జీవితమే కాదు, తెర ముందు కూడా తను కోరుకున్న పాత్రల్లో కాకుండా, కోరుకోని కేరెక్టర్స్‌లో కని పిస్తూ...'

ఆ క్షణం ఓ దృశ్యం అతడి కనుల ముందు కదలాడింది. చాలా... చాలా కాలం తర్వాత అతడిలోని చిత్రకారుడు స్పందించాడు.

మరోగంట తర్వాత తిరుపతి "పద గురూజీ, మెస్‌కెళ్ళి భోంచేసి వద్దాం" అన్న ప్పుడు అతడు పైకిలేచాడు.

ఇద్దరూ రూమ్‌లో నుండి బయటపడ్డారు.

మెస్‌లో భోంచేసాక, తిరిగి రూమ్‌వైపు నడుస్తున్నప్పుడు, కొద్దిదూరం, సాగాక అరుణ్, "తిరుపతీ! నువ్వు రూమ్‌కెళ్ళు. నేను ఓ అర్థగంటలో వస్తాను" అన్నాడు.

"ఎక్కడికి గురూజీ!"

అతడు జవాబు చెప్పలేదు.

"ఏ డైరెక్టర్ ఇంటికో వెళ్ళడం లేదు కదా? "

అతడు తల అడ్డంగా ఆడించి "కాదు, కేన్వాస్‌లు తెచ్చుకుందామని" చెప్పాడు.

"ఎందుకు? "

"అది తర్వాత చెపుతాను. ముందు నువ్వు రూమ్‌కెళ్ళు" అనేసి అరుణ్ ఇందిరా నగర్‌లో ఆటో ఎక్కాడు.

అతను డ్రాయింగ్ మెటీరియల్ తీసుకుని రూమ్‌కి వచ్చేసరికి తిరుపతి ముసుగేసుకుని పడుకుని ఉన్నాడు. అరుణ్ కేన్వాస్‌ని గోడకు ఫిక్స్‌చేశాడు. రంగులను కుంచెతో అద్దుకుని, కేన్వాస్‌మీద బొమ్మ గీయడం మొదలుపెట్టాడు.

చాలారోజుల తర్వాత, తనకు ఇష్టమ యిన పని చేయడం మొదలుపెట్టడం వలన కాబోలు అపురూపమైన సంతృప్తి మనసు నిండుగా నిలిచిపోయింది. చాలాకాలం తర్వాత తల్లి ఒడిలో తలదాచు కున్నంత సంతృప్తి...

అతడు తననుతాను మరచిపోయాడు. కాలమూ మరచిపోయాడు... అలా ఎంత సమయం గడిచిందో తెలియదు. కుంచెతో రంగులు రంగరించడం కేన్వాస్‌మీద అద్దడం... ఏర్పడుతున్న బొమ్మకేసి తన్మ యత్వంగా చూసుకోవటం.

ఓ కునుకేశాక, దాహంగా అనిపించ డంతో, తిరుపతికి మెలుకువొచ్చింది. గదిలో ట్యూబ్‌లైట్ అలాగే వెలుగుతుండడంతో చిట్లించాడు. ఈ మహానుభావుడు లైట్ కూడా ఆఫ్ చేయకుండా అలాగే పడుకు న్నాడు కాబోలు అనుకుంటూ, పక్కకు చూస్తే బెడ్‌మీద అరుణ్ కనిపించలేదు. అతడు కాస్త ఆశ్చర్యంగా పరికించి చూస్తే, ఓ మూల నిలబడి కనిపించాడు.

తిరుపతి దుప్పటి తొలగించి అటుగా వెళ్ళాడు. దగ్గరగా వెళ్ళాక అటుగా చూసి,

విస్మయంతో నోరుతెరిచేశాడు.

పక్కనే చప్పుడు కావడంతో, తల తిప్పి చూసిన అరుణ్, తిరుపతి ముఖంలోని ఫీలింగ్స్ గమనించకుండానే "తిరుపతీ! ఎలా ఉంది బొమ్మ" అడిగాడు. అతడి చూపులు మాత్రం ఆ బొమ్మమీదే ఉన్నాయి.

"గు... గురూజీ! నీకు... ఈ విద్య కూడా వచ్చా?" చాలాసేపటి తర్వాత నోరు విప్పాడు తిరుపతి.

"నాకు తనువు మరిచేంత ఆనందం కలిగించే వ్యాపకం అంటూ ఏదయినా ఉంటే అది బొమ్మలు గీయడం" అని ఆగి, ఆ తర్వాత ప్రశ్నించాడు "అది సరే! ఇంతకీ ఈ బొమ్మ ఎలా ఉందో చెప్పనేలేదు."

తిరుపతి ఆ కేన్వాస్‌కేసి చూశాడు. కొద్దిసేపు కళ్ళప్పగించి అలాగే చూస్తుండిపోయాడు.

"ఏమిటలా చూస్తున్నావ్?"

"హాసిని బొమ్మ అద్భుతంగా ఉంది గురూజీ! కాని ఆమెకు చీరకట్టి, నుదుటన పెద్దబొట్టు పెట్టడం మాత్రం అసహజంగా అనిపిస్తుంది. హాసినిని ముప్పాతిక నగ్నంగా చూడడం అలవాటయిన ఈ కళ్ళకు, ఈ చీరకట్టు అసలు నచ్చదు"

"చూసేవాళ్ళకు నచ్చకపోవచ్చు కాని, ఈ కట్టూ బొట్టూ ఆమె మనసులోని చిత్రానికి ప్రతిరూపం"

అంతవరకే చెప్పాడు గానీ తిరుపతి ఆ బొమ్మను పరిశీలించి ఉంటే కళ్ళలోని తేడా కనిపెట్టి ఉండేవాడనుకున్నాడు అరుణ్.

ఆ కన్నుల్లో ఓ కన్ను ఆనందాన్ని ప్రతిఫలింపజేస్తోంది. అది ప్రపంచానికి తెలిసిన హాసిని బాహ్యరూపానికి సింబాలిజమ్. మరో కంటిలో కన్నీళ్ళు... అది ఈ ప్రపంచానికి తెలియని ఆమె పర్సనల్ లైఫ్!

తిరుపతి మరీ అంతగా అబ్జర్వ్ చేయక పోవచ్చుగానీ, మొత్తంమీద ఆ బొమ్మ అతడిని అమితంగా ఆకర్షించిందని అర్థమయిపోయింది అరుణ్‌కి.

అతడు ఆ బొమ్మవైపు అపురూపమైన వస్తువునేదో చూస్తున్నట్టుగా, తదేకంగా చూస్తుంటే తిరుపతి అన్నాడు, "ఏంటి గురూజీ! ఆవిడేమో డైరెక్టర్‌గారికి నీ గురించి చెప్పడం, నువ్వేమో ఆవిడను కట్టుబొట్టుతో బొమ్మ గీయడం.. వద్దు గురూజీ! గడ్డపోడు అసలే డేంజర్ పర్సన్.. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆశలు మాత్రం పెంచుకోకు..."

"ఛీఛీ..." తిరుపతి మనసులోని మాటలు అర్థమవడంతోనే అన్నాడు అరుణ్... "ఆమెను చూస్తుంటే ఓ జాలిపడాల్సిన కేరక్టర్ అనిపిస్తుందే తప్ప నువ్వనుకునే ఫీలింగ్ మాత్రం నాకు కలగడంలేదు తిరుపతీ!"

"అదేంటి గురూజీ! హాసినిని చూస్తే ఎవరికైనా మొదట కలిగేది అదే ఫీలింగ్.. ఒక్కసారి... ఒక్కసారయినా ఆ అందాన్ని అనుభవించాలని..."

అరుణ్ పెదవులు బిగపట్టి మౌనంగా ఉండిపోయాడు. అతడివైపు చూడకుండానే తిరుపతి "సరేలే గురూజీ! మీ ఫీలింగ్‌ని నేనెందుకు కాదనాలిగానీ రా పడుకుందాం" అన్నాడు.

అరుణ్ కేన్వాస్‌ని మరోసారి చూసుకున్నాక, లైట్ ఆఫ్ చేసి బెడ్ ఎక్కాడు.

★ ★ ★

లొకేషన్‌లో కొద్దిసేపు షూటింగ్ జరిగాక తెలిసింది ఆ రోజు హాసిని బర్త్‌డే అని.

నిర్మాత, దర్శకుడు ఆమెకు బర్త్‌డే విషెస్ చెప్పడమే కాదు, లొకేషన్‌కి కేక్ తెప్పించి కట్ చేయించారు.

అందరూ ఆమెకు విషెస్ చెపుతుంటే అరుణ్ ఆమె దగ్గరగా వెళ్ళి "విష్‌యూ హేపీ బర్త్‌డే మేడమ్" అన్నాడు కన్నులలో కృతజ్ఞతను ప్రతిఫలింపజేస్తూ.

ఆమె అతడిని చూస్తూ అందంగా నవ్వింది. "కేవలం విషెస్ మాత్రమేనా?




ప్రజంటేషన్ ఏమీలేదా? "

అతడు తడబడ్డాడు. ఆమె అంత చనువు ప్రదర్శించినందుకో, లేక ఆమె ఎవ్వరినీ అడ గని ఆ మాట ప్రజంటేషన్ అంటూ తనతో అన్నందుకో తెలియదు. తడబాటు పడిన మాట మాత్రం వాస్తవం.

ప్రజంటేషన్! ప్రజంటేషన్ అంటే... ఆమె జోక్‌గానే అడిగి ఉండొచ్చు కాని తనకు మాత్రం ఏదైనా ఇవ్వాలనే అనిపి స్తుంది. ఏమివ్వాలి? అతడికి చప్పున తన రూమ్‌లోని చిత్రం గుర్తుకు వచ్చింది.

"ప్రజంటేషన్ ఇంట్లో... ఇంట్లో ఉంది మేడమ్"

ఈసారి ఆమె షాక్ తిన్నట్టు "ప్రజంటే షన్ ఇంట్లో ఉందా? " ప్రశ్నించింది.

"ఆ.. అవును"

ఆమె నమ్మలేనట్టు అతడికేసి చూసింది. ఆ మధ్యాహ్నం లంచ్ బ్రేక్‌లో కారువైపు నడుస్తూ అతడిని పిలిచింది... "మీరు నాతో రండి"

అతడు ఆశ్చర్యంగా ఆమెకేసి చూశాడు. యూనిట్‌లోని చాలామంది తమిద్దరికేసే చూడడం అతడు కను చివరలనుండి గమ నించాడు. "ఎక్కడికి మేడమ్? "

"మీరేదో ప్రజంటేషన్ అన్నారుగా? అది తీసుకొచ్చేందుకు!"

ఆమె తన మాటలు నమ్మి అలా మాట్లా డుతోందో లేదా తన మాటల్లో నిజమెంత ఉందో తెలుసుకునే ప్రయత్నం చేస్తోందో అతడికి అర్థం కాలేదు.

"మేడమ్! నేనిలా వచ్చేస్తే ఇక్కడి పనులు..."

"నేను డైరెక్టర్‌గారికి చెప్పాను. నా గెస్ట్ హౌస్‌లో ఉండే స్క్రిప్ట్ మీకిచ్చేందుకు తీసు కెళుతున్నానని చెప్పాను. ఆయన ఓకే అన్నారు. సో నో ప్రాబ్లమ్... ఫాలోమీ"

అతడికిక తప్పించుకునే అవకాశం లేకపో యింది.

అరుణ్ ఆమెను ఫాలో అవుతూ కారు దగ్గరగా వెళ్లాడు. ఆమె కారు డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాక అతడు బ్యాక్ డోర్ తీస్తుంటే ఆమె నవ్వుతూ చెప్పింది... "ముందు సీట్లోకి రండి"

అతడు కొద్దిగా ఇబ్బంది ఫీలయ్యాడు. అప్పటికే అందరూ తమవైపే చూస్తున్నట్టని పించడంతో చప్పున కారెక్కి కూర్చున్నాడు.

ఆమె కారు ముందుకు పోనిచ్చింది.

కారు స్టూడియో దాటాక అతడు సీట్లో వెనక్కు వాలుతూ ఇబ్బంది పడుతూనే అడి గాడు... "ఈరోజు... ఈరోజు... ఆయన... ఆయన రాలేదా మేడమ్? "

ఆమె రోడ్డుమీద నుండి చూపు మరల్చ కుండానే "ఆయన అంటే? " అంది.

"అదే... మీ వెంట వస్తుంటారు"

"ఓహ్! ప్రభాకర్ గురించా? .." ఆమె నిస్సత్తువుగా నవ్వింది. "తనీరోజు ఏదో పనిమీద బాంబే వెళ్లాడు"

"అలాగా" తలాడించాడు అరుణ్.

ఆమె సీట్లో వెనక్కు వాలి కారు డ్రైవ్ చేస్తోంది. అతడూ ఆమెవైపు చూడడం లేదు. రోడ్డువైపు చూస్తున్నాడు.

అంతలో పక్కనుండి మాటలు వినిపిం చాయి. "నేను మిమ్మల్నిలా హఠాత్తుగా కారెక్కించుకుని వచ్చేస్తే, ఇప్పుడు మన షూటింగ్ స్పాట్‌లోని జనమంతా ఏమను కుంటుంటారో తెలుసా? "

అతడు తలతిప్పి ఆమె ముఖంలోకి చూశాడు.

"హసిని బాడీగార్డ్ లేకపోవడంతో తనకు నచ్చిన మగాడిని తీసుకుని గెస్ట్‌హౌస్‌కి వెళ్లిందని... తన అవసరం తీర్చుకుని తీసు కొచ్చేస్తుందనీను"

అతడు మాట్లాడలేదు. మౌనంగా రోడ్డు కేసే చూడసాగాడు.

ఆమె తిరిగి అంది... "ఈ ప్రపంచంలోని అనుబంధాలు, సంబంధాలు చాలావరకూ అవసరార్థం ఏర్పడేవే. కాదనను... అయితే

కొన్ని బంధాలు ఏర్పడడానికి ఏదో అవస రమే కారణమయి ఉంటుందంటే మాత్రం నేను ఒప్పుకోలేను!"

హాసిని ఏం మాట్లాడదలుచుకుందో, టాపిక్ ఏ వైపుకు తీసుకు వెళుతుందో అత డికి అర్థంకాలేదు. అయితే ఆమె అందరిలో తనకో ప్రత్యేకత ఇచ్చిందనీ తనతో క్లోజ్‌గా మూవ్ కావడానికి నిర్ణయించుకున్నదనీ అర్థ మయిపోయింది. కానీ ఆ ప్రత్యేకత ఎందుకు? క్లోజ్‌గా మూవ్ కావడంలో వెనుక ఉన్న ఉద్దేశ్యమేమిటి?

"నేను మీ మనసులోని అనుమానాలకు జవాబు చెప్పడానికే నిర్ణయించుకుని ఉపోద్ఘాతంగా ఆ మాటలు పలికాను. నేను వేరే ఏ ఉద్దేశ్యంతోనో మీతో ఇలా చను వుగా మాట్లాడడం లేదు. నాకు మీతో ఎలాంటి అవసరమూ లేదు కూడా"

అతడు చప్పున తలతిప్పి ఆమెకేసి చూశాడు. ఆమె రోడ్డుమీద దృష్టి నిలిపి, ఏకాగ్రతతో డ్రైవ్ చేస్తోంది. మాటలు మాత్రం అనాలోచితంగా పెదవులు దాటి జారిపోతున్నట్టు అతడు గమనించాడు.

"ఏ అవసరమూ లేకుండా నేను మిమ్మల్ని ఇలా కారులో ఎక్కించుకుని ఎందుకు తీసుకొచ్చానంటే కొందరిని చూస్తే మనసుకు దగ్గరయిన వ్యక్తులనే ఫీలింగ్ కలుగుతుంది. నేను మొదట మిమ్మల్ని చూసినప్పుడు నాకు అలాంటి ఫీలింగే కలి గింది. ఆతర్వాత మీ ప్రయత్నం తెలిశాక ఇండస్ట్రీకి రాకముందు నేను పడిన కష్టాలు నా కనులముందు కదలాడాయి. ఆ రోజుల్లో ఎన్ని కష్టాలు... నాకు వేషం కావాలి అని ఏ నిర్మాతనయినా అడిగితే రాత్రికి ఏం చేస్తున్నావ్? అని అడిగేవాడు. దర్శకుని కోసం ప్రయత్నిస్తే ఫిజిక్ ఎలా ఉందో చూడాలంటూ బట్టలు విప్పమనే వాడు. ఇంకా ఫొటో జెనిక్ ఫేసోకాదో తెలుసుకోవాలంటూ కెమేరామెన్, మేకప్ నీట్‌గా చేస్తానంటూ మేకప్‌మేన్.. అందరూ అందరూ ఈ ఇండస్ట్రీలోని అవకా శమున్న ప్రతి మగాడు ఆడదాని శరీరాన్ని ఆశించేవాడే! అలాంటి కష్టాలన్నీ ఎదుర్కొని ఏదో కోల్పోయి, ఎంతో అనుభవం సంపా దించి ఈ రోజు ఈ పొజిషన్‌లో ఉన్నాను. ఇదంతా ఎందుకు చెపుతున్నానో తెలు సాండీ! మీ ప్రయత్నాలు చూశాక మీరు తప్పక, తప్పక హీరో కాగలరనే నమ్మకం నాకు కలిగింది. ఆ స్థాయి అందుకున్నాక నాలాంటి అభాగిని కథ గుర్తుండి ఉంటే రేపు ఇండస్ట్రీలో వేషాలకోసం వచ్చే మరో హాసినికి మీరు సహాయపడతారేమోనన్న ఆశ...!"

అతడికి తన మనసులోని మాట చెప్పా లనిపించింది. కాని ఇప్పుడే ఆ విషయం బయట ప్రపంచానికి వెల్లడి చేయడం తన కిష్టంలేదు.

"ఇక మనం ఎటు వెళ్లాలి? "

అతడు అప్పుడే ఈ లోకంలోకి వచ్చినట్టు ఉలిక్కిపడి చుట్టూ చూశాడు. కారు ఇందిరా నగర్ క్రాస్‌రోడ్ దగ్గర ఉంది. కుడివైపుకు తిరిగితే ఇందిరానగర్, స్ట్రయిట్‌గా వెళితే కృష్ణానగర్...

"తిన్నగా పోనివ్వండి మేడమ్!"

ఆమె తలాడించి కారు ముందుకు పోని చ్చింది.

రెండు మూడు సందులు తిప్పాక అతడు ఓ ఇంటిముందు కారు ఆపమన్నాడు. కారు ఆగింది. అతడు చుట్టూ చూశాడు.

మిట్టమధ్యాహ్నం కావడంతో ఆ సందులో జనసంచారం లేదు. అలా కాకుండా జనం వీధులలో తిరుగుతూ హాసినిని చూశారంటే కొద్ది మందయినా ఇంటిముందు గుమికూడ తారు. ఆ ప్రాబ్లెమ్ లేదని నిర్ణయించుకు న్నాక అతడు తలవంచి కారులోకి తొంగి చూస్తూ "ఎవ్వరూ గమనించడంలేదు మేడమ్" అన్నాడు.

ఆమె చప్పున కారుడోర్ తీసుకుని కిందికి




దిగింది. ఇద్దరూ రూమ్‌లోకెళ్లారు.

హాసిని రూమ్‌లోకొచ్చాక కుర్చీలో కూర్చుని రూమ్‌ని పరిశీలనగా చూసింది. "రూమ్ చాలా నీట్‌గా ఉంది" అంది.

అతడు చిరునవ్వే బదులిచ్చాడు. ఆ తర్వాత ఆమెకు అతిథి మర్యాద చేసేందుకు చుట్టూ పరికించి చూస్తే అల్మైరాలో బిస్కెట్ ప్యాకెట్ కనిపించింది. ప్లేట్ తీసుకుని ప్యాకెట్‌లోని బిస్కెట్స్ అందులో వేసి "తీసుకోండి" అన్నాడు.

ఆమె మొహమాట పడినట్టు ఓ బిస్కెట్ అందుకుని "ఇంతకీ నా బర్త్‌డే ప్రజంటేషన్ ఎక్కడ? ఇవ్వండి" అంది నవ్వుతూ.

అరుణ్ అల్మైరా పైన ఉన్న కేన్వాస్‌ను అందుకున్నాడు. గుండ్రంగా చుట్టి ఉన్న ఆ షీట్‌ను వెనకకు పెట్టుకుని "మీరు.. మీరొక్కసారి కళ్లు మూసుకోండి... సిన్సియర్‌గా ప్లీజ్!" అన్నాడు.

ఆమె అతడికేసి· చిరునవ్వుతో చూసింది. అతడు తనకేదో చేస్తాడనే ఆలోచన ఆమెకు లేదు. అతడి మీద పూర్తి నమ్మకం ఉంది. ఒకవేళ ఏదయినా జరిగినా... తను కొత్తగా కోల్పోయేదేమీ లేదు.

హాసిని కన్నులు మూసుకుంది.

ఆ గదిలో ఏదో చప్పుడు... గోడకు ఏదో వస్తువు తగిలిస్తున్నట్టు.

అర నిమిషం తర్వాత "ఇక కళ్లు విప్పండి" అన్నాడు అతడు ఆమె దగ్గరగా వచ్చి.

ఆమె కన్నులు విప్పింది. చుట్టూ తొలుత చీకటి. చీకటి చెదిరాక చూపులు ఆ వైపు ప్రసరించాయి.

ఆమె కళ్లు వెడల్పయ్యాయి. ఆ తర్వాత నుదుటిమీద కొన్ని అడ్డగీతలు ఏర్పడ్డాయి. పెదవులు మెల్లగా విచ్చుకున్నాయి. ఆశ్చర్యం... ఆనందం... ఓ అపురూప వస్తువుని దర్శిస్తున్నప్పుడు కలిగే ఉద్విగ్న స్థితి.. అన్నీ.. అన్నీ ఆమెలో వెంటవెంటనే కదలాడాయి.

అయితే ఆమె ఫీలింగ్స్ అర్థంకాని అతడు కాస్త అనుమానంగా "ఏమండీ! నా పెయింటింగ్.. బాగో... బాగోలేదా"

అప్పటివరకూ కుర్చీలో ఉన్నదల్లా ఆమె చప్పున పైకి లేచింది. ఆర్తిగా, ఆవేశంగా అతడివైపు ఒక అడుగు వేసింది. మరో రెండడుగులు వేసివుంటే అతడిని చేరుకుని ఉండేదే. అయితే మరొక్క అడుగేశాక ఆమె నీరసంగా ఆగిపోయింది. ఆ తర్వాత మరొక్క అడుగు కూడా ముందుకు వేయలేనట్టు నిలబడిపోయింది.

అరుణ్‌కి ఇంకా ఇంకా ఆ అనుమానం అలాగే మిగిలి ఉంది. "చెప్పండి... మీకు నా పెయింటింగ్ నచ్చలేదా? "

ఆమె ఇక ఆగలేకపోయింది. అయినా ఆగిపోయింది అతికష్టం మీద.

"అరుణ్..." ఆమె తొలిసారి అతడిని అలా పిలవడం. అందుకే అతడు ఆశ్చర్యంగా ఆమెలోకి చూశాడు.

"అరుణ్! ఈ క్షణం ఈ క్షణం నాకేమనిపిస్తోందో తెలుసా? ఎవ్వరికీ తెలియని నా మనసు లోతులను నువ్వు స్పృశించావేమోననిపిస్తోంది. ఎవ్వరూ అర్థం చేసుకోలేకపోయిన హాసినిని నువ్వు అర్థం చేసుకున్నావేమోననిపిస్తోంది. లేకపోతే నేను కోరుకునే నేను నా మదిలో ప్రతిఫలించే నా ఆకారం.. నాకనుల ముందు సాక్షాత్కరింపచేయడం, నా మనసు తెలియని మరెవ్వరికీ సాధ్యంకాదు. అందుకే నా మనసును ఇంతగా అర్థం చేసుకున్న నీకు ఏం బహుమతిని ఇవ్వాలో అర్థం కావడంలేదు. ఒకవేళ ఆర్తిగా అల్లుకుపోదామన్నా, అందులో కోరిక కనిపించి నేను ఈ రూమ్‌కి వచ్చింది అందుకోసమేనేమోనన్న అనుమానం నీలో బలపడుతుందని, నా ఆవేశాన్ని నేను అణుచుకున్నాను. ఏదేమయినా అరుణ్ ఈ ఆర్ట్‌ని నేను నేను పదికాలాల పాటు పదిలంగా దాచుకుంటాను"

ఆ క్షణం.. ఆక్షణం అతడి కళ్లు చెమ్మగి



ల్లాయి. ఓ ఆర్టిస్ట్‌గా తన కళను ఎదుటి వారు మెచ్చుకోవటం వలననా? లేక ఆమె మనసులోని వేదనకు చలించడం వల ననా? అలా ఎందుకు జరిగిందో అతడికే తెలియదు.

వారినీ లోకంలోకి తీసుకురావడం కోస మన్నట్టు గోడమీది మ్యూజికల్ వాల్ క్లాక్ సంగీతాన్ని వినిపించింది.

అతడు చప్పున తల పైకెత్తి అటు చూసి "రెండయింది మేడమ్! ఇక మనం వెళ్దామా? " అన్నాడు.

ఆమె తలాడించింది. అతడు వరం డాలోకొచ్చి అటునిటు చూశాక ఎవ్వరూ లేరని నిర్ణయించుకుని "రండి మేడమ్" అన్నాడు.

హాసిని రూమ్‌లోనుండి వడివడిగా బయ టకు నడిచి వెళ్లి కారులో కూర్చుంది. అతడా రూమ్‌లాక్ చేసి వచ్చి కారులో కూర్చున్నాడు.

కారు ముందుకు కదిలింది.

కొద్దిదూరం సాగాక ఆమె అంది. "అరుణ్ నేను నిన్ను చనువుగా పిలుస్తుంటే ఫీల్ అవుతున్నావా? "

అతడు సిన్సియర్‌గా తల అడ్డంగా ఆడిం చాడు.

"ఆప్తులుగా ఫీలయ్యే వ్యక్తిని, మీరు అంటూ పరాయి వ్యక్తులుగా చేసి మాట్లా డడం నాకిష్టంలేదు. అలాగే నేను నీకు దగ్గర వ్యక్తి అనిపిస్తే హాసిని అని పిలువు! లేకపోతే ఇలాగే మేడమ్ అంటే నేను ఫీల యినట్లు నువ్వు ఫీల్‌కాలేకపోతున్నావని, ఇది నా ఖర్మ అని సరిపెట్టుకుంటాను"

అతడు ఆ క్షణం మరేం మాట్లాడలేదు.

కారు షూటింగ్ స్పాట్‌కి చేరుకున్నాక, అతడు కారు దిగాడు. యూనిట్‌లోని కళ్లన్నీ తనవైపే ఉండడం గమనించాడు. అతడు కారు దిగి చుట్టు తిరిగి వచ్చి ఆ వైపు కారు డోర్ తీస్తూ "హాసినీ! దిగు" అన్నాడు.

ఆమె కారు దిగుతూ అతడి ముఖంలోకి చూసింది.

ఆ చూపుల్లో వెన్నెల కాంతిని అతడు స్పష్టంగా చూడగలిగాడు.

అతడి మనసు సంతృప్తితో నిండిపో యింది.

ఆ మధ్యాహ్నానికే షూటింగ్ పేకప్ కావ డంతో తిరుపతి, అరుణ్‌లు స్టూడియోనుంచి బయటపడ్డారు.

"గురూజీ! ఏదయినా సినిమాకెళ్దామా? " రోడ్డు అంచునే నడుస్తుండగా అడిగాడు తిరుపతి.

"వద్దు తిరుపతీ! తెలిసిన షాపు ఉంటే టీవీ వీసీఆర్ పట్టుకురా మంచి క్యాసెట్ ఏదైనా చూద్దాం"

"నిజంగానా? "

"నిజంగానే!"

"అయితే ఆ క్యాసెట్స్ పట్టుకురానా? " అన్నాడు తిరుపతి ఆ క్యాసెట్స్ అన్న పదా లను నొక్కి పలుకుతూ.

"ఏ క్యాసెట్స్? " అర్థం కాకపోవడంతో అడిగాడు అరుణ్.

"అదే గురూజీ...కలిగులా... బాంబే మసాలా, లేదాకేరళా క్యాసెట్స్.."

అర్థమయింది అరుణ్‌కి. "వద్దు బాబోయ్" చేతులు జోడించాడు అతడు. "నా ఉద్దేశ్యం వీసీఆర్ తెచ్చుకోవడం ఆ క్యాసెట్స్ చూడడానికి కాదు. ఈ రాత్రంతా టైమ్ వేస్టుకాకుండా పాత తెలుగు సినిమాలు చూసి నాటి నటుల నటన పరిశీలిద్దామని"

"అదా తమరి ఆలోచన" నిరాశగా పలి కాడు తిరుపతి. "నేనింకా ఎంతో ఊహించే సుకున్నానులే.. సర్లే ఏం చేద్దాం... తెస్తాను"

ఆ సాయంత్రం తిరుపతి టి.వి., వీసీఆర్, క్యాసెట్స్ రూముకి తీసుకొచ్చాడు. అరుణ్ చెప్పిన ఒక తెలుగు సినిమా క్యాసెట్ ఇన్




సర్ట్ చేసి కూర్చున్నాడు.

తిరుపతి యథాలాపంగా సినిమా చూస్తుంటే అరుణ్ కొద్దిసేపు సినిమా చూశాక పక్కనే ఉన్న పేపర్స్ అందుకున్నాడు. అతడు సినిమా చూస్తూనే పేపర్ మీద ఏదేదో రాస్తూ ఉంటే తిరుపతి అడిగాడు, "ఏంటి గురూజీ! రాస్తున్నావ్? "

"ఈ సినిమాలోని నటుడు నటనాపరంగా చేసిన మైనస్‌లు ఏమిటో నోట్ చేసుకుంటున్నాను"

"ఎందుకు గురూజీ? "

"ఎదుటి వారిలోని మైనస్‌లు మనలో లేకుండా చేసుకోడమే మన గొప్పతనం"

"మరి ఈ సినిమాలోని నటుడికి ఉన్న మైనస్‌లేంటో చెప్పుకోండి గురూజీ"

"డైలాగ్ డెలివరి బాగోలేదు"

తిరుపతి ఇండస్ట్రీలో బతుకుతున్న వ్యక్తి కాబట్టి కాస్త క్యూరియాసిటీగా అడిగాడు, "గొంతు అన్నది దేవుడిచ్చిన వరం. సహజ సిద్ధమయిన గొంతులో మార్పు ఎలా వస్తుంది? "

తిరుపతి మాటలు మధ్యలోనే కట్ చేస్తూ "దేవుడిచ్చిన స్వరానికి మరికాస్త సాధనతో మెరుగులు దిద్ది అదే గొంతులో గంభీరత్వాన్ని, తియ్యదనాన్ని పలికించవచ్చు నీకు తెలుసోలేదో.. ఒక మహానటుడు తొలిసారి పౌరాణిక చిత్రంలో నటించేముందు గొంతులో గంభీరత్వం తక్కువ కనిపించింది. గొంతులో బేస్ పెంచుకునేందుకు ఆయన చలికాలం చల్లని నీళ్లకుండను కడుపుకానించుకుని రాగాలు తీసేవాడట... అలాగే మరో గొప్ప నటుడు ఓ తాగుబోతు పాత్రలో చిత్రం చివరి సన్నివేశాలలో నటించేప్పుడు విరోచనాలయ్యేలా చేసుకుని ముఖం పీక్కుపోయి, కళ్లు గుంటలు పడేలా చేసుకున్నాడట. ఒక చిత్రం చూసి అందులోని నటీనటుల నటన పరిశీలిస్తూ గతంలోని మహానటుల అనుభవాలు గుర్తుకు తెచ్చుకుంటూ ఉంటే మనం నేటితరం నటులలోని లోపాలు మనలో లేకుండా చేసుకోవచ్చు."

"నేటితరం నటులు నాటితరం నటుల్లా కష్టపడడం లేదనే అందరూ అంటుంటారు మరి నువ్వేమంటావ్ గురూజీ? "

"ఆ అభిప్రాయం ఖచ్చితంగా నిజమేనంటాను" వెంటనే చెప్పాడు అరుణ్. "నేటి నటులు పాత్ర పరిధిలో నటించడంకన్నా ఏ పాత్రలోనయినా గ్లామర్‌గా కనిపించేందుకే ప్రయత్నిస్తున్నారు. ఒకప్పుడు వచ్చిన చిత్రాలను చూడు రాజు-పేద చిత్రంలో ఓ మహానటుడు కొడుకును హింసించే తండ్రి పాత్రలో ఎంత అద్భుతంగా నటించాడు? అదే కేరక్టర్‌ని నేటితరం నటులచేత నటింపచేయవలసి వస్తే అందులోనూ తమ గ్లామర్ కనిపించేలా చూసుకుంటారు. సో మనకి ఇప్పటి చిత్రాలలో నటులు కనిపిస్తున్నారే గానీ పాత్రలు కనిపించడంలేదు"

అరుణ్ మాటలకు తిరుపతి మెల్లగా తలాడించాడు. అతడు మాత్రం తన మాటలను కంటిన్యూ చేశాడు.

"అంతేకాదు తిరుపతీ! ఈ తరం నటులను చూడు నటన నా జీవితం, నటనే నా ప్రాణం అనే పలుకులే పలకడంలేదు. ఎంతకాలం నటిస్తారు అని విలేకరులు అడిగితే ప్రేక్షకులు ఆదరించినంత కాలమనో లేక నిర్మాతలు సరైన రెమ్యూనరేషన్ ఆఫర్ చేసినంతకాలమనో సమాధానాలు చెపుతున్నారు. అదే పాతతరం నటులను చూడు నటనే ఊపిరిగా బతికేవారు. నటుడిగానే తుదిశ్వాస తీసుకోవాలని కోరుకునేవారు. నటుడిగా తుదిశ్వాస అంటే గుర్తుకొచ్చింది. లండన్‌లో ప్రఖ్యాతి పొందిన స్టేజి ఆర్టిస్టు ఆల్బర్ట్ క్యాట్సో మరణం గురించి మాట్లాడుతూ నేను నటుడిగా స్టేజీమీదే మరణించాలి అనేవాడు. ఒకరోజు అతను ఒక నాటక ప్రదర్శనలో అద్భుత నటనను ప్రదర్శిస్తూ ఆఖరి సన్నివేశంలో భాగంగా




రంగస్థలాన్ని ముద్దుపెట్టుకుని అలాగే ఉండిపోయాడు. ప్రేక్షకులు అది నటనలో భాగమని అలాగే చూస్తుండిపోయారు. అయితే ఆల్బర్ట్ మాత్రం ఎంతకీ లేవనే లేదు. అతడు తనకిష్టమయిన రంగస్థలాన్ని చివరి క్షణాల్లో కూడా వదల్లేదనీ, తను అనుకున్న విధంగానే మరణించాడనీ చాలా సేపటి తర్వాతే అక్కడివారికి అర్థమయింది. నటులంటే వారు. సిసలైన కళాకారులంటే వారే"

అరుణ్ మాటలాపి, అటువైపు చూస్తే తిరుపతి తనకేసే ఆశ్చర్యంగా చూడడం కనిపించింది. "ఏమిటలా చూస్తున్నావ్!?" అడిగాడు అతడు.

"గురూజీ! ఇవన్నీ ఇవన్నీ ఎలా తెలుసుకున్నావ్?"

"మనం సాధించదలచుకున్న దాన్ని గురించి సంపూర్ణంగా తెలుసుకోవడం మనం మొదటి చేయవలసిన పని"

కొద్దిసేపటి తరువాత తిరుపతి ప్రశ్నించాడు, "అదిసరే గురూజీ! నటనే జీవితం అనేవారే చక్కగా నటించగలరని చెప్పావ్ బాగానే ఉంది. మరి రేపు నీకు ఛాన్స్ వస్తే... వస్తే ఏంటిలే గురూ వచ్చి తీరుతుంది! అప్పుడు నువ్వు నటనే నా ప్రాణం అంటూ చివరివరకూ ఈ రంగంలోనే ఉంటావా?"

"ఉండను" ఆలోచించి చెప్పలేదు అతడు. మనసులో ఎన్నాళ్లనుండో కదలాడుతూ ఎప్పుడో తీసుకున్న నిర్ణయాన్ని తెలియచేసినట్టు వెంటనే పలికాడు.

"అదేంటి?" విస్మయంగా అడిగాడు తిరుపతి.

అరుణ్ చిన్నగా నవ్వాడు. "ముందు అవకాశం రానివ్వు తిరుపతీ! అనుకున్నది సాధించకుండానే ఆ తర్వాత జరగబోయేది చెప్పడం నాకిష్టం లేదు"

తిరుపతి రెట్టించి అడగలేదు.

ఆ సినిమా చూడడం పూర్తయింది.

అతడు మరో సినిమా క్యాసెట్ ఇన్‌సర్ట్ చేశాడు. ఆ సినిమా చూస్తూ నోట్సులో ఏదో రాసుకుంటున్నాడు.

తిరుపతి మాత్రం యథాలాపంగా సినిమా చూస్తూ అప్పుడప్పుడు అతడికేసి చూస్తే తపస్సు చేసుకుంటున్న మునిలా తనలోకంలో తను మునిగిపోయి కనిపించేవాడు.

బాగా పొద్దుపోయాక, వారిద్దరూ మెస్ కెళ్లి భోంచేసి వచ్చారు.

ఆ తర్వాత మరి కాసేపటికి తిరుపతి నిద్రపోయాడు. అరుణ్‌ని పడుకోమన్నప్పటికీ అతడు సినిమాలు చూస్తూనే ఉండిపోయాడు.

అర్ధరాత్రి ఎందుకో మెలుకువ వచ్చి చూస్తే అరుణ్ అలాగే సినిమా చూడడం కనిపించింది. తిరుపతి అప్పుడు అనుకున్నాడు లక్ష్యం పట్ల ఇంతటి ఏకాగ్రతతో సాగిపోయే వ్యక్తి సాధించలేనిదంటూ ఏదయినా ఉంటుందా? ఉండదుగాక ఉండదు.

అరుణ్ హీరో అవుతానని అంటుంటే అందులో అతడికేదయినా అనుమానం అంటూ ఉంటే అది ఆ క్షణమే అతడిలోంచి తొలిగిపోయింది.

★ ★ ★

షూటింగ్ లంచ్ బ్రేక్‌లో ధనరాజ్ అరుణ్‌తో చెప్పాడు. "మన డైరెక్టర్‌గారి దగ్గరకు కొత్త ప్రొడ్యూసర్స్ వచ్చారు. కొత్త నటీనటులతో ఓ చిత్రం తియ్యాలని ప్లాన్ చేస్తున్నారు"

అరుణ్ ముఖంలో సంతోషం ఉప్పొంగింది. "అయితే నాకు అవకాశం ఉంటుందంటారా సార్?"

"అవకాశం అంటే... ఓ చిన్న క్యారెక్టర్ దొరకడానికి అవకాశం ఉంది. ఎందుకంటే మన డైరెక్టర్‌గారి దృష్టిలో నువ్వూ ఉన్నావు కాబట్టి. అంతేతప్ప 'హీరో' క్యారెక్టర్ దొరకడానికి మాత్రం అవకాశం లేదనుకుంటాను'

కెరటంలా తీరం చేరబోయిన సంతోషం మధ్యలోనే విరుచుకుపడి సాగర గర్భంలో కలిసిపోయిన ఫీలింగ్... అతడు చాలాసే పటి తర్వాత గొంతు పెగల్చుకుని "ఎట్టి పరిస్థితుల్లోనూ 'హీరో' ఛాన్స్ దొరకదం టారా సార్?"

"దొరకదయ్యా" ఖచ్చితంగా చెప్పాడు ధనరాజ్? "ఆ నిర్మాతల దగ్గర ఎమౌంట్ లేదు. వారు ఫైనాన్సియర్స్ మీద ఆధారపడ్డారు. డైరెక్టర్ ఎంత గొప్పవాడయినా అందరూ కొత్తవాళ్ళేనంటే ఫైనాన్స్ దొరకడం కష్టమవుతుంది. అదే ఏ హీరోగారి అబ్బాయినో ఈ చిత్రంతో హీరోగా ఇంట్రడ్యూస్ చేశామనుకో ఫైనాన్సియర్‌ని ఆయనే అరేంజ్ చేస్తాడు. అంటే, ఒక్క హీరో వేషం మాత్రం హీరోగారి అబ్బాయికి వెళుతుంది. మిగతా కేరక్టర్స్ అన్నీ కొత్తవాళ్ళే"

అతడు చిన్నగా నిట్టూర్చాడు.

"అన్నట్టు, రేపటినుంచి మనం ఆ సినిమా స్క్రిప్ట్ వర్క్‌మీద కూర్చోవాలి. డైరెక్టర్‌గారికి నీమీద బాగా నమ్మకం కలిగినట్టుంది. సిట్టింగ్స్‌కి నిన్ను పిలవమని చెప్పాడు."

"అలాగే సార్" చెప్పాడు అరుణ్.

అరుణ్ తన దగ్గరగా వచ్చాక తిరుపతి అడిగాడు, "ఏంటి గురూజీ ఆయన చెప్పేది?"

విషయం వివరించాడు అరుణ్.

అంతా విన్నాక తిరుపతి "పోనీలే గురూజీ! చాలామంది హీరోలు మొదటి చిత్రంలోనే హీరో వేషాలు వెయ్యలేదు. మొదట్లో చిన్నాచితక కేరక్టర్స్ వేసినవారే. ఆ తర్వాతకాలంలో మెగాస్టార్స్ అయిపోయారు. ఏమో ఈ చిత్రంలో కాసేపు కనిపించినప్పటికీ, నీ నటన చూసేసరికి మనవాళ్ళకు మతులుపోతే, ఏ నిర్మాతో వెనువెంటనే మరో చిత్రంలో హీరోగా బుక్ చేసుకోవచ్చుకదా?" అన్నాడు.

అలా జరగడానికి వీలులేదని తను అనడంలేదు. ఈ చిత్ర పరిశ్రమలో ఎలాంటి విచిత్రమయినా జరిగేందుకు అవకాశం ఉంది. చిన్నవేషాల నుండి పెద్ద వేషాలకు ఎగబ్రాకడం కష్టంకాదు. కాని... కాని దగ్గరవుతున్న కాలపరిమితి... కేవలం మరో ఏడు నెలలు మాత్రమే గడువుంది. రాబోయే సంవత్సరం జనవరి ఆరవతేదీ కల్లా... తను తెరమీద హీరోగా కనిపించాలి.

"నీకు క్యారెక్టర్ ఇవ్వడమే కాదు, సిట్టింగ్స్‌కి కూడా రమ్మన్నాడంటే నీ ప్రతిభ డైరెక్టర్‌గారు గుర్తించినట్టే గురూజీ! నేను రెండేళ్ళనుంచి అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేస్తూనే ఉన్నాను. నన్ను మాత్రం ఏ డైరెక్టరూ సిట్టింగ్స్‌కి పిలవడు. యూ ఆర్ లక్కీ గురూజీ..."

తిరుపతి మాటలు వినిపించుకోలేదు అతడు.

పదిరోజుల తరువాత సిట్టింగ్స్ మొదలయ్యాయి.

ఓ గెస్ట్‌హౌస్‌లో డైరెక్టర్, రైటర్, అప్పుడప్పుడూ ప్రొడ్యూసర్... వారందరితో అతడూ.

జీడిపప్పు పకోడీ తింటూ వీడియోలో క్యాసెట్స్ చూస్తూ... రోజులో ఒకటీ-రెండు సీన్లు అనుకోవడం... మర్నాడు ఆ సీన్స్ మార్చిపడేసి కొత్తగా చూసిన మరో సినిమాలోని సీన్స్ మిక్స్ చేయడం... సినిమా స్టోరీ డిస్కషన్స్‌లో కూర్చోవడం అతడికి అదే మొదటిసారి. సినిమా కథ అనే వంటకం ఎలా చేస్తారో అప్పుడే అర్థమయింది.

అయితే ఆ సబ్జెక్ట్ మొత్తంమీద అరుణ్‌కి నచ్చింది హీరో పాత్ర స్వభావం. ఆ సబ్జెక్ట్‌లో హీరో భావుకుడు. మంచి చిత్రకారుడు. అతడు ఓ అమ్మాయిని ప్రేమిస్తాడు. మరో అమ్మాయి అతడిని ప్రేమిస్తుంది. ట్రయాంగిల్ లవ్‌స్టోరీ.

ఆ హీరో క్యారెక్టర్ తన జీవితానికి దగ్గరగా ఉందనిపించింది. ఎందుకో... ఎందుకో తెలియదు. ఈమధ్య అప్పుడప్పుడూ అతడికి హాసిని గుర్తుకువస్తోంది.

★ ★ ★

"ఎలాగయితేనేం ఏదో పాత్ర సంపాదించావన్నమాట"

"నేను సంపాదించాను అనడం కన్నా వారే నాకు ఆఫర్ చేశారనడం బాగుంటుంది" నవ్వాడు అరుణ్. పీతాంబరం కూడా నవ్వాడు.

అరుణ్ తను తీసుకువచ్చిన పళ్లు బెడ్ మీద పెట్టాడు. "తీసుకోండి మాస్టారూ" అన్నాడు ఆప్యాయరిగా.

"ఇవన్నీ ఎందుకు బాబూ"

"నా అభిమానం ప్రదర్శించడానికి మాత్రం కాదు మాస్టారూ! మీ పట్ల నా అభిమానం ప్రదర్శించడమేమిటో మును ముందు జరుగుతుంది. ఆ అభిమానం ప్రదర్శించడం మీరూహించలేనంత భిన్నంగా ఉండబోతుంది"

"నీ మాటలు నాకేం అర్థం కావడంలేదు"

"ఆర్థికంగా మరికాస్త నిలదొక్కుకున్నాక, అర్థమయ్యేలా చేస్తాను మాస్టారూ"

ఆయన వైరాగ్యం ఉట్టిపడేలా నవ్వి "ఇంకా ఏవయినా చెప్పు" అన్నాడు.

"నేను ఇప్పటివరకూ జరిగిన ప్రోగ్రెస్ గురించి మీకు చెప్పాను. ఇప్పుడు మీరే నాకు సలహా ఇవ్వాలి"

"ఎలాంటి సలహా? "

"నేను కోరుకునేది హీరో క్యారెక్టర్. కానీ వచ్చింది మాత్రం నాలుగు నిమిషాలు కనపడే సైడ్ కారెక్టర్. ఈ పాత్రను ఒప్పుకుని అందుకోసం కొంత టైమ్‌వేస్ట్ చేసుకోవడం కన్నా, హీరో కేరక్టర్ కోసం ఇతర డైరెక్టర్ల దగ్గరకు వెళ్ళడం మేలేమో కదా అని"

"వద్దొద్దు... ఆ పని మాత్రం చేయొద్దు" వెంటనే అన్నాడాయన. "చిన్న అవకాశాన్నయినా జారవిడుచుకోవడం మంచిది కాదు. ఓ మెట్టు ఎక్కాక, కింది మెట్టుమీద కాలు తీయడం మంచిది. ఒకేసారి పైకి చేరుకోవడం అసాధ్యం కాకపోయినా- మెట్టుమెట్టుగా ఎక్కే అవకాశం వచ్చినా జాగవిడుచుకోవద్దు"

అతడూ అదే అభిప్రాయంతో ఉన్నాడు. అయినా అనుభవజ్ఞుడిగా ఆయన సలహా కోరాడు అంతే. ఇద్దరి మనసుల్లోని మాట ఒకటే అయ్యాక అప్పుడే నిర్ణయం తీసుకోవడమూ జరిగిపోయింది

ఓ నిర్ణయానికి వచ్చేశాక అతడు అడిగాడు- "మరి నటుడిని కాబోతున్న నాకు అనుభవజ్ఞులుగా మీ సలహాలు చెప్పండి."

"సలహాలా...? నేనా? " నవ్వారాయన. "అన్నివిధాలా ఓడిపోయినవాడిని. నేను నీకేం సలహా చెప్పగలను బాబూ? "

"మీరు జీవితంలో ఓడిపోయివుండొచ్చు కానీ నటుడిగా ఓడిపోలేదుగా? "

అరుణ్ మాటలకు ఆయన కొద్దిగా సంతసించినట్లనిపించింది. ముఖంలో సంతోషం కదలాడుతుండగా చెప్పాడు, "అదే నీ అభిప్రాయం అయితే సలహాలు చెప్పడానికి నాకేం అభ్యంతరం లేదు..."

గురుబోధ వినేందుకు తయారయిన శిష్యుడిలా అరుణ్ చేతులు కట్టుకుని కూర్చున్నాడు.

ఆయన చెప్పడం మొదలుపెట్టాడు.

"నటుడు అంటే ఎవరో సృష్టించిన ఓ పాత్రనో లేక యధార్థ జీవితంలోని ఓ వ్యక్తినో తనలో లీనం చేసుకుని ఆ పాత్ర లేదా ఆ వ్యక్తి తనే అని చూస్తున్నవారిని భ్రమింపచేసేలా చేయగలిగినవాడు... కాబట్టి నేటి నటుల్లా చేతులు తిప్పుతూ, తోచినట్టు హావభావాలు ప్రదర్శించడం కాకుండా ఆ పాత్ర స్వభావం, పరిధి పరిశీలించాలి. ఒకవిధంగా ఆ పాత్ర తనేనేమోనని తనే ఫీల్ కావాలి. అలాగే ఓ పాత్ర

నటించేప్పుడు వ్యక్తిత్వాలు, ఈగోలు ప్రదర్శించకూడదు. బిచ్చగాడి వేషం వేస్తూ, 'చింపిరి బట్టలెలా వేసుకోనండీ... కాస్త కాస్ట్లీ బట్టలు తెప్పించండి' అనే నటులను నేను చాలామందిని చూశాను. నటుడన్నవాడు అలాంటి మాటలు పలకకూడదు"

అతడు శ్రద్ధగా వింటున్నాడు. అయితే అప్పటివరకు ఆయన చెప్పిన మాటలు తనకు అవసరపడవు. తొలి చిత్రంలోనే తను 'ఈగో' వ్యక్తం చేయలేడు. దర్శకుడు చెప్పినట్టు విని తీరవలసిందే.

"...ఆ తర్వాత నటించేటప్పుడు మనం ఎదుటివారి గురించి అస్సలు ఆలోచించకూడదు. దర్శకుడు చెప్పినదానిని ఆకళింపు చేసుకున్నాక, మనముందు ఎవ్వరూ లేరు అనుకోవాలి. చుట్టూ జనం మనల్ని అబ్జర్వ్ చేస్తున్నారని ఫీలయితే చాలు, మనం కొంత బిడియపడవలసివస్తుంది. ఆ బిడియం మనల్ని పాత్రలో లీనం కాకుండా చేస్తుంది..."

ఇది తనకు పనికొచ్చే సలహా అనిపించింది అరుణ్‌కి. అతడు మరింత శ్రద్ధగా ముందుకు వంగాడు. అయితే ఆయన పేషెంట్ కావడంతో అలసట తీర్చుకునేందుకు కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయాడు.

"ఇక నువ్వు నటిస్తున్నంతసేపు ఆ పాత్రనే నీ కనులముందు కదలాడాలి. ఇంకా... ఇంకా గొప్పగా చేస్తే ఎలా ఉంటుందోనని మాత్రమే నువ్వు ఆలోచించాలి. ఒక టేక్‌చేసి, రెండో టేక్‌కి ఇబ్బంది పడిపోతే నువ్వు సక్సెస్‌ఫుల్ నటుడివి కాలేవు. సక్సెస్‌ఫుల్ నటుడివి అయ్యాక మాత్రం చాలా జాగ్రత్తగా ఉండాలి. ముఖ్యంగా అహంకారాన్ని దగ్గరకు రానివ్వకూడదు. ఎంత గొప్ప నటుడయినా కావచ్చు అహంకారం ప్రదర్శిస్తే అతడు అధోగతి పాలవుతాడు. ఇది నేను చెప్పే మాట కాదు. చరిత్ర చెప్పిన నిజం. ఎందరో మహానటులు అహంకారం ప్రదర్శించడంవలననే అధఃపాతాళానికి వెళ్ళిపోయారు..."

అతడు నిజమేనన్నట్టు మెల్లగా తలాడించాడు. ఈమధ్య అతడు చదివిన సినిమా చరిత్ర పుస్తకాలలో అలాంటి మహానటులు ఎందుకు కనుమరుగయ్యారో చూచాయగా తెలియచేయబడింది. ఇప్పుడీయన విపులంగా చెప్పాడు.

"... అహంకారం తర్వాత ఎక్కువమంది మహానటులు తెరమరుగయింది ఏ కారణం చేతనో తెలుసా? "

అతడు తెలియదన్నట్లు తల అడ్డంగా ఆడించాడు.

"...వ్యసనం... తాగుడు, రేసులు, మగువ... ఇలాంటి వ్యసనాలలో చాలా, చాలామంది మంచినటులు తమ ప్రతిభను సంపూర్ణంగా ప్రదర్శించకుండానే కనుమరుగయిపోయారు... వారికీ వ్యసనాలే లేకుంటే మనకు మరింత అద్భుతమయిన నటులు ఎందరో లభించేవారు. కళాఖండాలలాంటి చిత్రాల్ని మనం మరెన్నో చూడగలిగేవారం"

అరుణ్ నిలువుగా తలాడించాడు.

"... ఇప్పటివరకూ నీకు నటన గురించి, వ్యక్తిత్వం గురించి మాత్రమే చెప్పాను. ఇప్పుడు నీకు వాటన్నిటికన్నా గొప్ప సలహా- జీవితాంతం వరకూ నిన్ను సుఖంగా ఉండేలా చేసే సలహా చెపుతాను విను. ఇండస్ట్రీలో నీతిపరులు లేరని కాదు గానీ, వారి శాతం చాలా చాలా తక్కువ. అవినీతి, హిపోక్రసీలతో బతికే ఆ జనం ఒక సక్సెస్‌తోనే నీ చుట్టూ మూగుతారు. నిన్ను ఆకాశానికెత్తేస్తారు. నీ అంత గొప్పవాడు మరొకడు లేడనీ మరొకడు పుట్టడని పొగిడేస్తారు. వారి పొగడ్తలు నిజమని నమ్మకు. ఒక్క ఫెయిల్యూర్, కేవలం ఒకే ఒక్క ఫెయిల్యూర్ నీ చుట్టూ ఉండే జనంలో నిజమైన శ్రేయోభిలాషులెవరో నీకు

తెలియజేస్తుంది. నువ్వు సక్సెస్ బాటలోనో, ధనవంతుడిగానో ఉన్నప్పుడు నీ చుట్టూ తిరుగాడే జనం... నువ్వు వారికేవిధంగానూ ఉపయోగపడవని తేలిపోతే, నిన్ను నడిస ముద్రంలో వదిలేందుకయినా వెనుకాడరు. ఛీటింగ్, ఎక్స్‌ప్లాయిటేషన్, హిపోక్రసీ... ఇవన్నీ మనసుల్లో నింపుకున్న మనుషులు తిరుగాడే పరిశ్రమ అది. అక్కడ జాగ్రత్తగా ఉండు. ముఖ్యంగా నీ డబ్బు నువ్వు జాగ్రత్త చేసుకో. లేకపోతే మహానటుడు చిత్తూరు నాగయ్యలాంటివాడే, లక్షలు సంపాదించి చివరిదశలో దరిద్రంతో చని పోయాడు. చివరిదశలో ఆయన అన్న మాటలు ఏమిటో తెలుసా బాబూ 'ఇతరుల అవసరాలకు ఉపయోగపడడం తప్పు కాదు గానీ, చివరిదశలో నీ అవసరాలకు అంటూ కొంతయినా దాచుకోవాలి' ఆ మాటల వెనుక ఒక జీవితకాల అనుభవం ఉంది. అర్థం చేసుకో..."

ఆయన అప్పటికే చాలా శ్రమపడుతూ మాట్లాడుతున్నట్టు అనిపించింది. "మీరిక ఈరోజుకి రెస్ట్ తీసుకోండి మాస్టారు! నేను మరోరోజు వస్తాను. ముఖ్యంగా నేను మేకప్ వేసుకునే ఓ గంటముందు మీ ముందుకు వచ్చి ఆశీర్వాదం తీసుకుంటాను. ఎందుకంటే- ఈరోజు నేనీ పొజిషన్‌లో ఉన్నానంటే అందుకు కారణం మీరే"

పీతాంబరం ఆప్యాయంగా అతడి భుజం మీద చెయ్యివేసి, "కొద్దిగా గ్లూకోజ్ వాటర్ అందుకో అరుణ్" అన్నాడు.

అతడు గ్లూకోజ్ వాటర్ కలిపి ఆయనకు అందించాడు. అవి తాగడంతో ఆయనకు కొంత శక్తి వచ్చినట్టనిపించిందేమో, తిరిగి మాటలు కొనసాగించబోయాడు.

"ఫర్వాలేదు మాస్టారు. నేను మరోరోజు వస్తానన్నానుగా" అన్నాడు అరుణ్.

"లేదు అరుణ్! రేపు నాలో ఈ మూడ్ ఉంటుందో, ఉండదో. ఆరోజు నేను చెప్పద లుచుకున్న మాటలు పూర్తిగా చెప్పగలనో లేదో... అయినా ఇంకొక్క విషయమే నీకు చెప్పి ముగిస్తాను..."

అతడు చెప్పమన్నట్టు తలాడించాడు.

"... అరుణ్! ఈ కీర్తి అనేది ఉంది చూశావా. అదీ ఓ సర్కస్‌లాంటిదే. మనం మన కీర్తికి ఓ రికార్డు సృష్టించాలను కుంటాం. రేపు మనకన్నా హుషారయిన మరొకడు మన రికార్డును బద్దలు కొడ తాడు. అప్పుడు మన కీర్తి చుట్టు తిరిగి యధాస్థానానికే చేరుకుంటుంది. అలా అని కీర్తికాంక్ష తప్పని నేననడం లేదు. ఎవరో ఒకరు ఏదో ఒక రికార్డు సృష్టించకపోతే, రేపు మరొకరు మరో రికార్డు సృష్టించడం ఎలా సాధ్యం? కీర్తి సాధించడం తప్పు కాదు. కాని ఆ కీర్తితో నువ్వు అటాచ్‌మెంట్ పెట్టుకోకు. నువ్వో ఘనవిజయాన్ని సాధిం చావు. అంతే...! దాన్ని మర్చిపో. వీలయితే అంతకన్నా మరింత గొప్ప విజయాన్ని సాధించేందుకు ప్రయత్నించు. కేవలం ఈ ఇండస్ట్రీలోనే అని కాదు. ఏ రంగంలోన యినా డిటాచ్‌మెంట్‌తో ఉండు. అదే. అదే మన జీవిత ఆఖరిదశలో మనల్ని నిరాశ నుండి దూరం చేసేది... నేను నా కీర్తిపట్ల అటాచ్‌మెంట్ పెంచుకోబట్టే ఆరోజు వారంతా ఈ కేంపస్‌లో షూటింగ్ జరు పుతూ ఒకనాటి మంచినటుడినైన నన్ను పట్టించుకోలేదే అని బాధపడ్డాను. అదే కీర్తి పట్ల డిటాచ్‌మెంట్ కలిగివుంటే, నాకారోజు ఆ బాధ ఉండేది కాదుగదా? "

అరుణ్ నెమ్మదిగా తలాడించాడు. "నేని ప్పటికే మీ సలహాలు పాటిస్తున్నాను మాస్టారూ! అందుకే ఈ రంగంలోకి అడు గుపెట్టకముందే నేనో నిర్ణయం తీసుకు న్నాను. కాని ఆ నిర్ణయం ఇప్పుడే చెప్పను. అనుకున్నది సాధించాక, ఈ రంగంలోని జనమంతా విస్తుపోయేలా ఆ నిర్ణయాన్ని తెలియచేస్తాను...

ఆయనతో మరికాసేపు మాట్లాడాక,

అతడు టి. బి. హాస్పిటల్ నుండి బయటకు నడిచాడు.



ద్వారకానాథ్ చేస్తున్న సినిమా షూటింగ్ పూర్తయింది. ఇక రీ-రికార్డింగ్ మాత్రమే చేయాల్సిఉంది. అదే సమయానికి చేయాల్సిన రెండో సినిమా స్క్రిప్ట్ రెడీ అయింది.

అరుణ్ ఆ సినిమాలో చిన్న కేరక్టర్ చేసేందుకు మెంటల్‌గా ప్రిపేరయ్యాడు. అయితే హీరో కేరక్టర్ కోసం తన ప్రయత్నాలను మాత్రం ఆపుచేయలేదు.

వీలయినప్పుడల్లా ఎందరో డైరెక్టర్ల

చుట్టూ తిరుగుతూనే ఉన్నాడు. ఫలితం మామూలే!

ఈలోగా ద్వారకానాధ్ సినిమా పాటల రికార్డింగ్ జరుగుతోంది.

సినిమా సెట్స్‌మీద కెళ్ళింది కూడా.

ఒక ఫైనాన్షియర్ కొడుకు హీరోగా తొలి సారి నటించబోతున్న ఆ చిత్రం ప్రారంభోత్సవం అట్టహాసంగానే జరిగింది.

ముహూర్తం షాట్‌లో రాష్ట్ర ముఖ్య మంత్రి హీరో హీరోయిన్లమీద క్లాప్ కొట్టగా, మరో ప్రముఖ డైరెక్టర్ కెమేరా స్విచ్చాన్ చేశాడు. ఇండస్ట్రీలోని అతిరథ మహారథు లంతా ఆ చిత్ర ప్రారంభోత్సవానికి విచ్చే శారు.



ప్రారంభోత్సవంనాటిరోజు అతడు కాబోయే నటుడిని అనే ఫీలింగ్ లేకుండా, ఒక అసిస్టెంట్ డైరెక్టర్‌గానే అన్ని పనులూ చేశాడు.

ఆ విషయాన్ని ధనరాజ్ మాత్రమే కాదు, ద్వారకానాథ్ కూడా గమనించారు. ప్రారంభోత్సవం పూర్తయ్యాక అరుణ్ రూమ్‌కి వెళ్ళలేదు. స్టూడియోనుండి రోడ్డెక్కాడు.

అడుగులు ముందుకు పడుతున్నాయి గానీ, ఆలోచనలు మాత్రం గమ్యం తెలియని బాటసారుల్లా ఎటెటో సాగిపోతున్నాయి.

అయిపోయాయి. ఈ రోజుతో ఆరునెలలు అయిపోయాయి. 'విజయం' కనుచూపుమేరలో కనిపించడంలేదు. తనిప్పుడు విజయం సాధించలేకపోతే సిటీలో ఉద్యోగం సంపాదించుకుని బతకచ్చు. అది సమస్య కాదు. కానీ ఆ తరువాత జీవితాంతంవరకూ ఓడిపోయిన వ్యక్తిగా రాజేశ్వరి ముందు తలదించుకునే బతకాలి. ఆమె కోరిక తీరుస్తానంటూ పెద్ద మగాడిలా ఫోజుకొట్టి సిటీకొచ్చి ఏమీ సాధించలేకపోయిన వ్యక్తిగా సిగ్గుపడాలి.

తనింత అసమర్థుడా? లేక సినిమా హీరో కావడం చాలా చాలా గొప్ప విషయమా? అసలింతకీ తనిప్పుడు ఏం చెయ్యాలి? అయితే ఒక్కటి మాత్రం అర్థమయింది. హీరో కావడం అన్నది సమర్థతకు, నటనకు సంబంధించిన విషయం కాదు. దటీజ్ మేటర్ ఆఫ్ మనీ అండ్ బ్యాగ్రౌండ్. ఎంత సమర్థుడయినా, మంచి నటుడయినా హీరో అవకాశం రాకపోవచ్చు. అదే ఓ సినిమా తీయగలిగిన డబ్బు లేదా సినిమా ఇండస్ట్రీకి సంబంధించిన వ్యక్తుల బ్యాక్‌గ్రౌండో ఉండాలి. అలా ఉంటే మాత్రం చాలా సులభంగా సినిమా హీరో అయిపోవచ్చు.

ఇంత తెలిసినా తను విజేతగా నిలవాలనుకుంటున్నాడు. అందుకే ఆఖరిక్షణంవరకూ పోరాడదలచుకున్నాడు. పోరాడుతాడు ఆఖరిక్షణంవరకూ...

కీచుమన్న చప్పుడు.

అతడు అదిరిపడి పక్కకు చూశాడు. తన పక్కనుండే ముందుకు వెళ్ళిన కారు, వెనక్కు వస్తోంది. ఎవరబ్బా? అతడీ లోకంలోకి వస్తూ ఆలోచించాడు.

కారు పక్కనే ఆగింది. హాసిని డ్రైవింగ్ సీట్లోనుండి తొంగిచూసింది. "హాయ్ అరుణ్"

అతడి ముఖం విప్పారింది. "హలో..."

"చుట్టూ ఉన్న జనం గుర్తుపట్టి, చుట్టుముట్టకముందే కారెక్కు..."

అతడికి మనసంతా ఏదోలా ఉంది. ఎవరయినా కంపెనీగా ఉంటే బాగుణ్ణనిపిస్తోంది. అందుకే మారు మాట్లాడక ఫ్రంట్ డోర్ తీసుకుని కారెక్కి కూర్చున్నాడు.

హాసిని చిరునవ్వు నవ్వి కారు ముందుకు పోనిస్తూ, "ఇప్పుడు చెప్పు... ఇటెక్కడికి బయలుదేరావ్? " ప్రశ్నించింది.

అతడు అప్పుడే పరిసరాలను పరిశీలిస్తున్నట్టు చుట్టూ చూశాడు. కారు జూబ్లీహిల్స్ చెక్‌పోస్ట్ దాటి తిన్నగా వెళుతోంది. అప్పుడర్థమయింది అతడికి తను పరధ్యానంలో కృష్ణానగర్‌వైపు వెళ్ళకుండా, జూబ్లీహిల్స్ వైపు నడవడం మొదలుపెట్టాడని.

"సారీ! నేను అటు వెళ్ళాల్సింది. ఏదో ధ్యాసలోఉండి" అతడు వాక్యం పూర్తి చేయలేదు.

"అర్థమయింది. తలదించుకుని మరో లోకానికి వెళ్ళిపోతున్నట్టు సాగిపోతూ ఉంటే మొదట చూసి ఎవరీ భావకవి, సర్వం మరచి సాగిపోతున్నాడే అనుకున్నాను. గుర్తుపట్టడంతోనే సంబరపడ్డాను. అయితే నేను ముందుగా గ్రహించింది నిజమేనన్నమాట" ఆమె నవ్వుతోంది.

అతడూ నవ్వుతూనే ఆమె ముఖంలోనికి చూశాడు. సినిమాలలో అదే నవ్వు ప్రేక్షకు

లను మత్తెక్కిస్తుంది. కాని దగ్గరగా ఉన్న తనకు మాత్రం ఆ నవ్వులో అభిమానం కనిపిస్తోంది.

అరుణ్ బస్టాప్ సమీపిస్తుండడం చూసి, "అయితే కారు ఆచోట ఆపండి. నేను దిగి బస్సులో వెళ్ళిపోతాను" చెప్పాడు.

"వెళ్ళిపోవడమా? ఇప్పుడు నువ్వు మా ఇంటికొస్తున్నావ్"

అతడికి ఇబ్బందిగా అనిపించింది. అలా అనిపించడానికి కారణం ఆ గడ్డం వ్యక్తి. ఆ వ్యక్తి గురించి తను పూర్తిగా విని ఉండడంతో అలా అనిపించి ఉండొచ్చనుకున్నాడు అతడు. అయితే తన ఇబ్బంది ఆమెతో చెప్పడానికి మాత్రం మనస్సంగీకరించడం లేదు.

మూడు నిమిషాల తర్వాత కారు ఓ అధునాతనమైన బిల్డింగ్ ముందు ఆగింది. ఆమె కారు దిగి "రా అరుణ్" అంది ఆప్యాయంగా.

అతడు కాస్త ఇబ్బంది పడుతూనే ఆమె వెనుక అడుగువేశాడు.

"ఈ బిల్డింగ్ సెకండ్‌ఫ్లోర్‌లోనే నేను అద్దెకుండేది"

ఇద్దరూ మెట్లెక్కి సెకెండ్‌ఫ్లోర్ చేరుకున్నారు.

హాలులోకి వెళ్ళేవరకూ అతడికో నమ్మకం ఉంది. ఆ గడ్డం వ్యక్తి ఇంట్లో లేడేమోనని. కానీ అటు చూడడంతోనే అతడు ఉలిక్కిపడ్డాడు. గడ్డం వ్యక్తి హాలులోనే కూర్చుని పేపర్ తిరగేస్తున్నాడు.

"హలో ప్రభు"

ఆ వ్యక్తి పేపర్ పక్కకు తీసి తల వెనక్కు తిప్పి చూశాడు ఆమెను... పక్కనే ఉన్న తనను చూడడంతో ముఖంలో అదోలాంటి భావం కదలాడడం అరుణ్ గమనించాడు. ఆ వ్యక్తి కనుబొమ్మలు చికిలించి చూస్తుండగా ఆమె చెప్పింది, "ప్రభూ! ఇతడు అరుణ్ అని ద్వారకానాథ్ దగ్గర అసిస్టెంట్ డైరెక్టర్..."

ఆమె మాటలు పూర్తికాక ముందే ఆ వ్యక్తి అన్నాడు. "అయితే నేను ఇప్పుడు బైటకు వెళ్ళి గంట తర్వాత రావాలి అంతేనా?"

హాసిని పెదవులు బిగబట్టింది. అంతే! అరుణ్ మాత్రం తుపాకీ శబ్దం విన్న పక్షిలా ముడుచుకుపోయాడు. ఆ వ్యక్తి ఏ ఉద్దేశంతో ఆ మాటలు అన్నాడో అర్థంచేసుకోలేనంత అమాయకుడు కాదు.

అంతలోనే ఆమె సర్దుకుని చిన్నగా నవ్వేస్తూ "అవేం మాటలండీ... అరుణ్ ఈమధ్యనే పరిచయమయ్యాడు. తను చాలా మంచివాడు" ఆ వ్యక్తి దగ్గరకు నడుస్తూ పలికింది.

"ఆగు" అన్నాడా వ్యక్తి సోఫాలోంచి పైకి లేస్తూ. హాసిని ఆగిపోయింది. "మంచి వాడు అంటావ్! అంతేకదా! మంచివాడు కాబట్టే కదా నీకు నచ్చింది. నీకు నచ్చబట్టే కదా అతడు ఇంటికొచ్చింది. అతడు ఇంట్లో కొచ్చాక, మీరిద్దరూ హాలులోనే కూర్చుంటారా? కూర్చోరు. అతడిని తీసుకుని బెడ్‌రూమ్‌లో కెళ్తావ్! అక్కడ మీరిద్దరూ ఒకరి కౌగిలిలో ఒకరు వొదిగిపోయి, వేడి నిట్టూర్పులు వదులుతుంటే నేనిక్కడ ఉండడానికి నీకు అభ్యంతరం లేకపోవచ్చుగానీ, నేను మాత్రం ఉండలేను. నాకాశక్తి...."

"స్టూపిడ్" అరిచిందామె.

ఆ వ్యక్తి మాటలాపేసి ఆమెకేసి నిర్లిప్తంగా చూస్తున్నాడు. ఆమెకు ఆవేశం ముంచుకొస్తోందిగానీ, అణుచుకుంటున్నట్టు రొప్పుతోంది.

అరుణ్ బిగుసుకుపోయి ఉన్నవాడల్లా, ఆ మాటలకు కంగారుపడిపోయి, ఆ తర్వాత అప్పటివరకూ స్థంభించిన తన మెదడు తిరిగి పనిచేయడం ప్రారంభించినట్లు ఫీలయ్యాడు.

'ఒక ఆడదాన్ని... తన నీడలో బతుకుతున్న స్త్రీని ఒక మగవాడు ఇలా...

ఇలాంటి మాటలనగలడా? కళ్ళెదురుగా కనిపిస్తుంటే కాదనడం ఎలా? ముఖ్యంగా ఈ సినిమా ఇండస్ట్రీలో చాలామంది మగాళ్ళకు తాము కట్టుకున్న ఆడది లేదా ఉంచుకున్న ఆడదానిమీద శీలం విషయంలో నమ్మకం ఉండదు. అందుకే తారల వివాహజీవితాలు చాలావరకూ ట్రాజెడీతో నడుస్తాయి, విడాకులతో ముగుస్తాయి...'

అతడికి అక్కడ ఉండాలనిపించలేదు. చప్పున వెనుదిరిగాడు.

"అరుణ్..." వెనుక నుంచి హాసిని గొంతు వినిపించింది.

అడుగు ముందుకు వేసిన అతడు కేవలం తల తిప్పి ఆమెవైపు చూశాడు. ఆ చూపుల్లో బాధలేదు... కోపం లేదు... కేవలం ఆమె పట్ల జాలి మాత్రమే ఉంది. అది ఆమె కూడా గమనించింది.

వెనుక నుంచి ఆ వ్యక్తి మాటలు వినిపిస్తూనే ఉన్నాయి. "ఏమిటే! వాడెళ్ళిపోతుంటే అంత బాధపడిపోతున్నావ్? ఓహో! ఈ రోజు నీ శృంగారానికి నేను అడ్డొచ్చానా? వెళ్ళిపొమ్మంటే వెళ్ళిపోతానే... నీ జీవితం, నీ ఇష్టం. ఏదో మొదటినుంచీ నీకోసం నిర్మాతల చుట్టూ తిరిగాను. నిన్ను పైకి తేవాలని ఎంతో కృషిచేశాను. నాది అనుకున్న వస్తువు మరెవడికో దక్కుతుంటే బాధనిపిస్తుంది. అంతే..."

ఆమె వెక్కివెక్కి ఏడుస్తూ హాలులోనుండి అవతలికి పరిగెత్తడం, అతడేమో మాటలు ఆపకపోవడం... అరుణ్ గమనించలేదు.

మెట్లు దిగి కిందికి వచ్చేశాడు. రోడ్డుమీద నడవసాగాడు. తిరిగి మళ్ళీ ఆలోచనలు... అయితే ఈసారి తన గురించి కాదు... సినిమారంగంలోని ఆడవారి గురించి ఆలోచిస్తున్నాడు.

... మరే రంగంలోనూ లేనివిధంగా ఈ రంగంలోని ఆడవారే మగవాడివైపు నుండి ఎక్కువగా ప్రాబ్లెమ్స్ ఫేస్ చేస్తున్నారు. ఎందుకని? ... అతడి ఆలోచనలు సమస్యను ఎనలైజ్ చేయడం ప్రారంభించాయి.

ఈ ఇండస్ట్రీలో స్త్రీని వీలయినంతవరకూ ఎక్స్‌ప్లాయిటేషన్‌కి గురిచేస్తారు. ఇక్కడ స్త్రీ అన్నిరకాలుగా పతనావస్థకు చేరుకున్నాకే తెరమీదకు చేరుకోవడం రివాజుగా వస్తోంది. పైకొచ్చిన ప్రతి సినీనటీ చెడిపోవడం జరగదు. కానీ ఎక్కువగా జరిగేందుకే అవకాశం ఉంది. అలాంటి రంగంలోని ఆడదాన్ని డబ్బుకోసమో, కీర్తికోసమో, అందంకోసమో ఓ మగాడు పెళ్ళాడినా, ఆ మగాడి మనసులో ఏదో అసహనం కదలాడుతూనే ఉంటుంది. ఆ అసహనం ఏదో సమయంలోఏదో రూపంలో బయటపడటమో లేదా తరుచుగా ఆ మగాడి మనసులో ముల్లులా పొడుస్తూ ఉండడమో జరుగుతుంది. అలా జరిగినప్పుడు ఆ మగాడు బరస్ట్ అవుతాడు... స్త్రీ పురుషుల మధ్య ఉండవలసింది నమ్మకం... ఆ నమ్మకం జంట మధ్య లేనప్పుడు... పరిస్థితి ఇలాగే ఉంటుంది. అందువల్లే కాబోలు సినీతారల వివాహాలు ఎక్కువగా ఫెయిలవుతూ ఉంటాయి.

ఆలోచనల మధ్యనే అరుణ్ కృష్ణానగర్ చేరుకున్నాడు. పరధ్యాసతో మరెటో వెళ్ళిపోకుండా తిన్నగా రూమ్‌కి చేరుకున్నాడు.

తలుపు తీసేఉంది. తిరుపతి ముందుగానే రూమ్‌కి చేరుకున్నట్టుంది అనుకుంటూ అతడు లోపలికి అడుగుపెట్టబోతూ యధాలాపంగా అటు చూసి అడుగు ముందుకు పడక ఆగిపోయాడు.

తిరుపతి బెడ్‌మీద కూర్చుని ఉన్నాడు. అతడి ఎదురుగా ఉన్నారు ఈశ్వరయ్యా, రాజేశ్వరి.

అరుణ్ అసలలాంటి దృశ్యం తనకెదురవుతుందన్నది ఊహించనేలేదు. అయినా సరే, వారి రాక, ముఖ్యంగా ఆరు నెలలు తర్వాత రాజేశ్వరిని చూడగలిగానన్న ఆనందం అతడిని ఉక్కిరిబిక్కిరి చేసింది.

వారు కూడా చప్పుడికి అటు చూశారు. అరుణ్‌ని చూడడంతోనే వారి కన్నులలో వెలుగు కదలాడింది. రాజేశ్వరి బావకేసి తదేకంగా చూస్తుండిపోయింది.

అతడు అడుగు ముందుకేస్తూ "ఎప్పుడొచ్చారు మామయ్యా" అన్నాడు.

"ఈరోజు ఉదయమే ట్రెయిన్‌కి వచ్చాను. స్టేషన్‌దగ్గర లాడ్జిలో దిగాం. ఆ తర్వాత నీకోసం స్టూడియోదగ్గర కెళితే, నువ్వు చేసే సినిమా యూనిట్‌లో ఇదిగో ఈ అబ్బాయి, మేము నీ పేరు చెప్పగానే, తిన్నగా ఇక్కడికి తీసుకొచ్చాడు" ఈశ్వరయ్య చెప్పాడు.

"నేను సినిమాల్లో వర్క్ చేస్తున్నట్టు, మా యూనిట్ ఈ రోజు ఆ స్టూడియోలో ఉన్నట్టు మీకెలా తెలిసింది" అతడు ఈశ్వరయ్య దగ్గరగా నడిచి ఆయన పక్కనే మరో కుర్చీలో కూర్చుంటూ అడిగాడు. ఆ తర్వాత తల తిప్పి రాజేశ్వరికేసి పరిశీలనగా చూస్తుండిపోయాడు. రాజేశ్వరి కూడా అతడికేసి చూసింది. ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి. క్షేమసమాచారాలు కళ్ళే చెప్పుకున్నాయి.

ఈలోపు పక్కనుండి ఈశ్వరయ్య చెప్పాడు. "అదేం పిచ్చి ప్రశ్నరా! మొన్న ఎరువుల కోసం టౌన్‌కొచ్చి రాజీకోసమని సినిమా పత్రికలు కొనుక్కువెళ్ళాను. రాజీ ఆ సినిమా పత్రికలు అక్షరక్షరం చదువుతుందిగదా! ఓ చోట అసిస్టెంట్ డైరెక్టర్‌గా నీ పేరు, ఆ చిత్రం ప్రెస్‌మీట్ అంటూ వేసిన ఫొటోలో ఓ మూలగా నిలబడి ఉన్న నీ ఫోటో చూసింది. అంతే నిన్ను చూడాలంటూ బలవంతంగా హైదరాబాదు బయల్దేరదీసింది. ఈ రోజు ఫలానా స్టూడియోలో సినిమా ప్రారంభోత్సవం అని చదివి ఉండడంతో ఇద్దరం అక్కడికెళ్ళాం... అదీ సంగతి"

అప్పటివరకూ తన మనసులో కదలాడిన నిరాశ, అసంతృప్తి ఆ క్షణం మటుమాయమయ్యాయి. ఆరు నెలలుగా తను పడిన బాధలు, సినిమారంగం గురించిన ఆలోచనలు అన్నీ మరిచిపోయాడు. తన వారి సమక్షంలో తనకు దొరికిన సంతృప్తి అతడు సంపూర్ణంగా అనుభవిస్తూ "చెప్పండి మామయ్య, అమ్మా, నాన్న, అత్తమ్మా... ఇంకా మన వాళ్ళంతా ఎలా ఉన్నారు? " ప్రశ్నించాడు.

"అక్కడ వారంతా క్షేమమే! అంతేకాదు, వారి దిగులు నీ గురించే" నవ్వుతూనే చెప్పారాయన. తన అల్లుడు తను ఊహించిన దానికన్నా త్వరితంగా, కేవలం ఆరునెలల్లో చెప్పుకోదగిన విజయం సాధించాడని ఆయనకు అర్థమవుతూనే ఉంది. ఆ విజయం కలిగించిన సంతృప్తి ఆయన ముఖంలో కదలాడుతోంది.

"నా గురించి దిగులుపడవలసిన అవసరమేముంది? చూస్తున్నారుగా నేనిప్పుడు ఇండస్ట్రీలో ప్రవేశించి ఒక్కో మెట్టు ఎక్కుతున్నాను" అతడు భుజాలెగరేశాడు.

"అది కనిపిస్తూనే ఉంది. కాని..." ఆరు సెకనులు ఆగాక ఆయన అన్నాడు. "పంతం పట్టి సిటీకి వచ్చావనుకో సంవత్సరం వరకూ పల్లెముఖం చూడకుండా ఉండాలా? అక్కడ మీ అమ్మానాన్నలు నీకోసం కలవరించని రోజంటూ లేదు తెలుసా? "

"ఆరోజే చెప్పానుకదా మామయ్యా! నేను 'విజయం' సాధించిన రోజే ఆ పల్లెలో అడుగుపెడతానని"

ఆయన నెమ్మదిగా తలాడించాడు. మనసులో మాత్రం అనుకున్నాడు. 'నేటి వరకూ సాగిన నీ పోరాటం చూశాక ఇంకా నువ్వు ఓడిపోతావని నేను అనుకోగలనా? విజయం సాధిస్తావ్ అరుణ్... నువ్వు విజయం సాధించి తీరుతావ్'

కాసేపటి తర్వాత అరుణ్ ఈశ్వరయ్యను తీసుకుని హోటల్‌వరకూ వెళ్ళి లగేజీ తీసుకుని వచ్చేశాడు.

ఆ రాత్రి పదిగంటలవరకూ పల్లె గురించిన విశేషాలు చెప్పుకున్నారు ఆ ముగ్గురూ. తిరుపతి తను ఫ్రెండ్ రూమ్‌కి వెళ్తానంటే, వద్దని అతడిని తమతోపాటే ఉంచేశాడు అరుణ్.

మాటలమధ్య ఈశ్వరయ్య, రాజేశ్వరి షూటింగ్ చూడాలని చాలా ఆసక్తితో ఉన్నారని, ఓ వారం పదిరోజులు హైదరాబాద్ లోనే ఉండి సిటీ మొత్తం చూసేలా ఉన్నారనీ అతడికి అర్థమయిపోయింది.

ద్వారకానాథ్ సినిమా షూటింగ్ ప్రారంభమయింది.

ప్రారంభోత్సవం రోజు ప్రముఖుల సమక్షంలో తీసే సీన్ సాధారణంగా ఆ తర్వాత పిక్చర్‌లో ఉంచడం జరగదు. అది పేరుకు తొలిషాట్ అంతే.

ప్రారంభోత్సవం జరిగిన మర్నాటినుండే రెగ్యులర్ షూటింగ్ ప్రారంభమయిన ఆ చిత్రానికి హీరో హీరోయిన్‌లమీద సీన్స్ పిక్చరైజ్ చెయ్యాలనుకున్నారు.

షూటింగ్ స్పాట్‌కి వచ్చిన అరుణ్ తను ఆ చిత్రానికి అసిస్టెంట్ డైరెక్టరన్నది గుర్తున్నందున క్లాప్ బోర్డ్‌వైపు వెళ్ళబోతుంటే, ధనరాజ్ అడిగాడు. "అటెక్కడికోయ్"

"క్లాప్‌బోర్డ్ పట్టుకురావాలని...!"

ఆయన ఆప్యాయంగా అతడి భుజంమీద చెయ్యివేసి "ఇంకా నువ్వు క్లాప్ కొట్టడమేమిటోయ్. ఈ చిత్రంతో నీకు ప్రమోషన్ వచ్చింది. పేరుకు అసిస్టెంట్ డైరెక్టర్‌వే గానీ, అసోసియేట్ డైరెక్టర్ స్థాయి వాడివి. అందులోనూ ఈ చిత్రంలో ఓ ముఖ్య పాత్ర పోషించబోతున్నావ్. నువ్విక ఆ పని చెయ్యక్కర్లేదు. ఆ హీరోగారికి డైలాగ్స్ చదివి వినిపించు. అతడి డైలాగ్ డెలివరీ కరక్ట్‌గా ఉండేలా చూసుకో"

అతడు తలాడించి స్క్రిప్ట్ పేపర్స్ తీసుకుని, అందులో హీరోగారి పోర్షన్ సపరేట్‌గా రాసుకుని అటువైపు వెళ్ళాడు.

ద్వారకానాథ్ సెట్‌లో ఓ మూల కూర్చుని కన్నులు మూసుకుని, ఏదో దీర్ఘాలోచనలో మునిగిపోయి ఉన్నాడు. ఆయనకు నాలుగడుగుల దూరంలోనే మరో కుర్చీలో కూర్చుని ఉన్నాడు హీరో. అతడి ఎదురుగా హీరోయిన్. వారిద్దరూ నవ్వుతూ తుళ్ళుతూ మాట్లాడుకుంటున్నారు.

అతగాడికి పాతికేళ్ళు ఉండొచ్చు పేరు నరేంద్ర. ఆరడుగుల ఎత్తు, చక్కని రూపం ఉంది. అయితే ఎక్స్‌ప్రెషన్స్ పలుకుతాయో లేదో ఇప్పుడే చెప్పడం కష్టం అనుకున్నారు ప్రారంభోత్సవం రోజు వారంతా. అయినా దర్శకుడు ద్వారకానాథ్ కాబట్టి రాతిశిల్పం లోనుంచయినా నటనను రాబట్టగలడని అందరి నమ్మకం.

హీరోగారివైపు అడుగులేస్తున్న అరుణ్ నాలుగడుగులు ముందుకు వేసి ఆగిపోయాడు. అప్పుడు చూశాడు అతడు. నరేంద్ర చేతిలో ఎర్రగా కాలుతోంది సిగరెట్. అతడు కళ్ళింతలు చేసుకుని చూశాడు. నో డౌట్! అది సిగరెట్.

ద్వారకానాథ్ సినిమాను సినిమా అన్నట్టు కాకుండా ఒక కళగా భావించి, ఆ కళకోసం తపస్సు చేసే వ్యక్తి. ఆయన షూటింగ్‌లో నాన్ వెజిటేరియన్ ఉండదు. అలాగే సిగిరెట్, మందు లాంటివి ఆయన కంట పడనివ్వరెవ్వరూ. అలాంటి ద్వారకానాథ్ దగ్గర ఉండగానే, హీరో అయితే కావచ్చు నటనలో ఓనమాలు కూడా తెలియని వ్యక్తి సిగరెట్ తాగడం చూసి ఆశ్చర్యమనిపించింది అరుణ్‌కి. ఒక సినిమాకు లైట్‌బాయ్ దగ్గరనుండి, హీరోవరకూ అందరూ అవసరమే. ఏ ఒక్కరు లేకపోయినా ఆ చిత్రం షూటింగ్ జరపడం సాధ్యం కాదు. అయితే ఏ చిత్రానికయినా దర్శకుడు కెప్టెన్‌లాంటివాడు. యూనిట్‌లోని ప్రతి ఒక్కరూ కెప్టెన్ లాంటి దర్శకుడిని గౌరవించాలి. అతడి మాట విని

తీరాలి.

బహుశ నరేంద్రకు ద్వారకానాథ్ గురించి తెలియదేమో అనుకున్నాడు అరుణ్. అందు వల్లే దగ్గరగా వెళ్ళాక చెప్పాడు. "సార్! డైరెక్టర్ దగ్గరే ఉన్నారు"

హీరోయిన్‌కి ప్లేబాయ్ జోక్‌లు చెబుతున్న తనను డిస్టర్బ్ చేసిన అతడికేసి సీరియస్‌గా చూశాడు నరేంద్ర

"ఉంటే? " వెంటనే ప్రశ్నించాడు.

హీరోగారికి సినిమా ఇండస్ట్రీ గురించీ, అందులోనూ డైరెక్టర్ స్థానం గురించి ఏమీ తెలియదనుకున్నాడు అరుణ్. కేవలం డబ్బు అన్నది బేక్‌గ్రవుండ్‌గా వచ్చేవారి ప్రవర్తన ఇలాగే ఉంటుంది అనిపించింది. అప్పటికీ ఓపికగా పలికాడు "మన డైరెక్టర్ గారికి సిగిరెట్ వాసన పడదు. ఆయన ఏకాగ్రతను డిస్టర్బ్ చేసేలా మీరింత దగ్గరగా కూర్చుని హీరోయిన్‌గారితో కబుర్లు చెప్పడమూ బాగోలేదు"

నరేంద్ర ముఖం ఎర్రగా కందిపోయింది. అందులోనూ ఎదురుగా హీరోయిన్ ఉండేమో, అతడి మాటలు ఇన్సల్ట్‌గా ఫీలయి, చప్పున లేచాడు.

"రేయ్! నువ్విక్కడ డైరెక్షన్ డిపార్ట్‌మెంట్‌లో ఉన్నావో లేక మరేదయినా డిపార్ట్‌మెంట్‌లోనో నాకు తెలియదు. అయినా చెబుతున్నాను విను! ఇది మా ఫాదర్ పెట్టుబడి పెడితే తీసే సినిమా. అంటే ఇది నా సినిమా. ఇక్కడ పనిచేసే వారందరూ నా దయాదాక్షిణ్యంమీద బతుకుతున్నారు. మీరు ఇలా ఉండాలి అని చెబితే వినాల్సిన ఖర్మ నాకు లేదు. నేనీ షూటింగ్ స్పాట్‌లో సిగిరెట్ తాగుతాను. ఆడపిల్లలతో బూతు జోకులేస్తాను... నా ఇష్టం"

అరుణ్ కొన్ని క్షణాలపాటు నిర్ఘాంతపోయాడు. నరేంద్ర మరీ అంతగా రియాక్ట్ అవుతాడని ఊహించలేదు అతడు. ఒకసారి తలతిప్పి చుట్టూ చూశాడు. యూనిట్‌లో వారంతా తమతమ పనులు ఆపేసి హీరోమీదే దృష్టి కేంద్రీకరించారు. అరుణ్ కళ్ళు చప్పున డైరెక్టర్‌గారికోసం వెదికాయి. ద్వారకానాథ్ తనవైపే చూడడం కనిపించింది. ఇప్పుడు తానేదో మాట్లాడాలి అన్నట్టుగా మాటలకోసం ప్రయత్నించాడు. అంతలో ద్వారకానాథ్ గొంతు వినిపించింది.

"ధనరాజ్!"

"సార్...!"

"ఈ రోజుకి షూటింగ్ పేకప్ చెప్పండి"

ద్వారకానాథ్ వెంటనే లేచి సెట్‌లోనుండి బయటికి వెళ్ళిపోయాడు. ఆయన్నే చూస్తున్న నరేంద్రకి నోట మాటలు రావడంలేదు.

యూనిట్‌లోని ఒక్కొక్కరూ మెల్లగా పక్కకు తప్పుకుని వెళ్ళి పోతుంటే, చివరికి ఆ చోట తను ఒక్కడే మిగిలిపోతానని తెలిసి కాబోలు నరేంద్ర కుడికాలితో కసిగా నేలకు కొట్టి, తిట్టుకునే పదాలు బయటకు వినిపించకుండా జాగ్రత్తపడుతూ... బయట కెళ్ళిపోయాడు.

మొదటి రోజే షూటింగ్ కాన్సిలయిపోయింది.



స్టూడియో నుండి నేరుగా రూముకి వచ్చేశాడు అరుణ్. అతడితో పాటే వచ్చేసిన తిరుపతి ఈశ్వరయ్యతో మాటలు కలి

పాడు. షూటింగ్ ఆగిపోవడానికి గల కారణాన్ని ఆయనకు సవివరంగా విశదీకరించాడు.

ఆయనకు కాస్త ఆశ్చర్యం కలిగింది. సాధారణంగా ఏ విషయంలోనూ, ఎట్టి పరిస్థితిలోనూ తొందరపడే మనిషి కాడు అరుణ్. అలాంటి వాడు హీరోని ఏదో అనడం... అందు వలన షూటింగ్ కాన్సిల్ కావడం... ఇదంతా ఆయనకు కాస్త ఆందోళన కూడా కలిగించింది. ఈ రోజు ఇతడి వలననే షూటింగ్ కేన్సిలయిందన్నది మనసులో పెట్టుకుని రేపు ఇతడిని ఆ సినిమా నుంచే తప్పిస్తే!? ఏదో ఒక మెట్టు పైకెక్కాడనుకుని సంబరపడేంతలో తిరిగి ఈ సంఘటన...! ఈ సంఘటన ఎన్ని పరిణామాలకు దారితీస్తుందో కదా!!

మధ్యాహ్నం రూమ్‌లో నలుగురూ కలిసి భోంచేశాక, అరుణ్ అల్మైరాలో ఉన్న పేపర్ షీట్స్ కొన్ని తీసుకుని బయలుదేరుతున్నట్టు కనిపించగానే రాజేశ్వరి అడిగింది. "ఎక్కడకి బావా? "

"పాతబస్తీలో ఇలాంటిబొమ్మలు అమ్మేదుకాణం ఒకటుంది. ఈ మధ్య నాకు రిఫరెన్స్ పుస్తకాలు, కేసెట్స్ కోసం డబ్బు చాలకపోతే ఇదిగో ఈ బొమ్మలు వేసి అమ్ముతున్నాను"

"అయితే పాతబస్తీ వెళుతున్నావ్‌గా! అక్కడే కదా చార్మినార్, మ్యూజియం అవన్నీ ఉండేది. నేనూ నీతో వస్తాను!"

ఆమెతో కలిసి కాసేపలా తిరిగిరావడం వలన తనకూ కొంత మనశ్శాంతి లభిస్తుందనిపించింది అతడికి. అందువల్లే సంతోషంగా 'అలాగే' అన్నాడు.

ఈశ్వరయ్యను కూడా తనతో రమ్మంటే తనకు కాస్త బడలికగా ఉంది రానన్నాడు. ఆయన అలా ఎందుకన్నాడో అర్థం చేసుకోలేనంత అమాయకులు కాదు వారు.

కృష్ణానగర్ నుంచి బస్సులోనే వారు పాతబస్తీ చేరుకున్నారు. అతడు తన పెయింటింగ్స్ అమ్మే షాపులోకెళితే, షాపు యజమాని సాదరంగా ఆహ్వానించాడు.

"క్యా సేఠ్‌జీ! నాబొమ్మలుఎలా అమ్ముడు పోతున్నాయి? " అడిగాడు అరుణ్.

"మీరు తీసుకొచ్చాక ఇలా తగిలిస్తే చాలు, అలా తీసుకెళ్ళిపోతున్నారు" చెప్పాడా సేఠ్.

అరుణ్ తన చేతిలోనిబొమ్మలుఆయనకు అందించి ఆయన ఇచ్చిన డబ్బు లెక్కపెట్టుకున్నాడు. "ఏమిటీరోజు కొంత ఎక్కువిచ్చినట్టున్నారు? "

"మాకు పదిరూపాయలు లాభం వస్తుంటే, అందులో మీకో ఐదు ఇవ్వడానికి కష్టమేముంది సాబ్" చెప్పాడావ్యక్తి.

డబ్బులు తీసుకున్నాక ఇద్దరూ బయటకొచ్చారు.

"ఎక్కడికెళ్దాం? " అడిగాడు అరుణ్.

"నీఇష్టం బావా? నువ్వు ఎక్కడికి తీసుకువెళితే అక్కడికి వస్తాను"

ముందు, ఇటుగా కొంతదూరం వెళితే చార్మినార్ వస్తుంది. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన చారిత్రాత్మక కట్టడం అది... అక్కడే జుమ్మామసీదు కూడా ఉంది. అవి చూశాక మనం తిన్నగా మ్యూజియంకి వెళ్దాం!"

ఆమె తలాడించింది. ఇద్దరూ రోడ్డు అంచునే నడవసాగారు.

తమముందు నడుస్తున్న కుర్రాళ్ళు అప్పుడప్పుడు తల వెనక్కు తిప్పి రాజేశ్వరికేసి చూడడం గమనించిన అరుణ్ మనసులోనే నవ్వుకున్నాడు.

మోడ్రన్ డ్రసుల్లో, విపరీతమైన మేకప్‌తో లేకపోవచ్చుగానీ మల్లెపువ్వులా స్వచ్ఛమైన అందంతో ఆకర్షించే రాజేశ్వరిని ఎవరయినా సరే, తలవెనక్కు తిప్పి మరోసారి చూడకుండా ముందుకు వెళ్ళలేరు. అది తనకు ఎప్పుడో తెలుసు.

వారు చార్మినార్ చేరుకున్నారు.




కాసేపు అక్కడే నిలబడి చూశాక, అతడు ఆమెతో చెప్పాడు "మనం త్వరగా మ్యూజియంకి వెళ్ళడం మంచిది. లేకపోతే దాన్ని మూసివేసే అవకాశం ఉంది"

ఆమె తలాడించింది. చార్మినార్, మసీదులు చూడడం ముగించుకుని ఆటో ఎక్కారు. మ్యూజియంలో మాత్రం క్లోజింగ్ టైమ్ వరకూ తిరిగారు.

బయటకొచ్చాక ఇద్దరూ కొద్దిదూరం నడిచి, ఇమ్లీబన్ ఎదురుగా ఉండే రెస్టారెంట్‌లోకి వెళ్ళారు.

"చెప్పు ఏం తీసుకుంటావ్?"

"నువ్వేం ఇప్పిస్తే అది" నవ్విందామె.

సప్లయర్ రాగానే "ఒక చికెన్ బిరియానీ, ఒక చిల్లీ చికెన్" చెప్పాడు అరుణ్. ఆర్డర్ తీసుకుని సప్లయర్ వెళ్ళిపోయాక ఆమెవైపు తలతిప్పి అడిగాడు.

"చెప్పు రాజీ! సిటీకి వచ్చాక ఈ రెండురోజుల్లో నీకెలా ఉంది. ఈ సిటీ లైఫ్ చాలా అందంగా, విలాసవంతంగా, అద్భుతంగా కనిపిస్తుంది కదూ?"

"ఇంతవరకూ నాకు అందంగా, అద్భుతంగా మాత్రం కనిపించలేదు. నీ మిత్రుడు తిరుపతి నుంచి నేను తెలుసుకున్న దాన్నిబట్టి సిటీలైఫే కాదు. సినిమారంగంకూడా అంత అద్భుతమైన అనుభవాల ఫీల్డ్‌కాదు అని తెలుస్తోంది"

అతడు నవ్వాడు "ఇంకా?" అన్నాడు.

"అదో మేడిపండు లాంటి రంగం అనీ... దూరానికి మాత్రమే అందంగా కనిపించే ఓ కుళ్ళు ప్రపంచమని అన్నాడు"

"హైదరాబాద్ వచ్చి చాలా తెలుసుకున్నావే"

ఆమె అతడి మాటలకు చిరునవ్వు నవ్వి ఊరకుండిపోయింది. మనసులో మాత్రం ఏవో ఆలోచనలు రేగినట్టు ఆమె ముఖాన్నే చూస్తున్న అరుణ్ గ్రహించాడు. అయినా అతడేం అడగదలచుకోలేదు.

సప్లయర్ ఐటమ్స్ తెచ్చి టేబిల్‌మీద పెట్టాడు. తిన్నాక కాసేపు ఆ చోటే కూర్చుని ఇద్దరూ బయటకు నడిచారు. బస్సులో కృష్ణానగర్ చేరుకున్నారు.

★ ★ ★

షూటింగ్ నాలుగురోజుల పాటు సాగింది.

తాను ఫైనాన్సియర్ కొడుకుననే ఈగోని నరేంద్ర అప్పుడప్పుడూ కనపరుస్తూనే ఉన్నాడు. అది ద్వారకానాథ్‌కి అర్థమవుతూనే ఉంది. అయినా ఒక చిత్రం 'ఈగోల' కారణంగా ఆగిపోకూడదని ఆయన అడ్జస్ట యిపోతున్నాడు.

అయితే ఆరోజు మాత్రం ఆయనిక ఓర్చుకోలేకపోయాడు.

సీన్‌లో భావుకుడయిన హీరో ఓ పెయింటింగ్ గీసి హీరోయిన్‌కి 'బర్త్‌డే' కానుకగా సమర్పిస్తాడు. ఆ చిత్రం చూసి హీరోయిన్ హీరోలోని కళాకారుడిని గుర్తిస్తుంది. అది వారి ప్రేమకు నాంది అవుతుంది.

ఆ సీన్‌ని ఓ గొప్ప సీన్‌గా చిత్రీకరించాలనుకుంటున్న ద్వారకానాథ్, ఆ సీన్‌లో కనపడే చిత్రం కోసం చాలామంది ఆర్టిస్ట్‌ల చిత్రాలను తెప్పించాడు. అయితే ఆయనకివేవీ తృప్తినివ్వలేదు. అలాంటి సమయంలో నరేంద్ర తన ఇంటినుండి ఓ చిత్రంతెప్పించి "ఇదిగొండి సార్! ఇది వాడండి" అన్నాడు హుందాగా.

ఆ బొమ్మ చూసి ద్వారకానాథ్ పెదవులు చప్పరించేశాడు. "ప్చ్ వద్దయ్యా! ఇంతకన్నా మంచి లుక్ ఉండాలి. అది బొమ్మేఅయినా సరే... అందులో జీవకళ తొంగిచూడాలి"

"ఇది బాగానే ఉంది కదా సార్!"

"బాగోలేదు"

ఈలోపు ధనరాజ్ కల్పించుకుని చెప్పాడు. "పాత బస్తీలో పెయింటింగ్స్ అమ్మే ఓ దుకాణం ఉందని విన్నాను. మీరు నా వెంట రాగలిగితే మనం అక్కడ మంచి పెయింటింగ్‌ని సెలెక్ట్ చేసి తెచ్చుకోవచ్చు"





ద్వారకానాథ్ తలాడించాడు. వారిద్దరూ కారులో ఎక్కుతుండగా సహాయంగా ఉంటాడన్న ఉద్దేశ్యంతో ధనరాజ్ అరుణ్ వైపు చూసి చెప్పాడు "అరుణ్! నువ్వూ మాతో రా"

అరుణ్ వెళ్ళడానికి తటపటాయించాడు. అయితే ధనరాజ్ మరోసారి పిలవడంతో కారులో కూర్చోక తప్పలేదు. ఇరవై నిమిషాల తర్వాత కారు పాతబస్తీలోని ఓ షాపు ముందు ఆగింది.

ధనరాజ్ ద్వారకానాథ్‌లు కారు దిగారు. అరుణ్ కారు ఆ షాపు ముందే ఆగుతుందని అనుకోలేదు. అది... అది తాను పెయింటింగ్స్ అమ్మమని ఇచ్చే షాపే. దిగడానికి సందేహిస్తున్న అరుణ్‌ని చూసి ధనరాజ్ "లోపలికి వెళ్దాం రా అరుణ్!" అన్నాడు.

ఇక కారు దిగక తప్పలేదు అతడికి. ముగ్గురూ షాపులోపలికి వెళ్ళారు. అయితే అరుణ్ చప్పున ముందడుగేశాడు.

షాపులోని సేఠ్ మిగిలిన ఇద్దర్నీ పట్టించుకోలేదు. అరుణ్‌ని చూస్తూ "నమస్తే భయ్యా! కొత్త ఆర్ట్‌లు ఏమయినా..." అతడి వాక్యాన్ని పూర్తిచేయనివ్వలేదు అరుణ్. చప్పున మాటలందుకున్నాడు.

"ఈయన మా సినిమా డైరెక్టర్‌గారు. ఓ ఆర్ట్ అవసరపడి కొనుక్కోవాలని వచ్చారు" అన్నాడు ద్వారకానాథ్‌ని చూపిస్తూ.

సేఠ్ ద్వారకానాథ్ వైపు చూశాడు. రెండు చేతులూ జోడించి "నమస్తే సాబ్! ఆయియే! ఆయియే!" అన్నాడు పళ్ళు బయటపెట్టి. ద్వారకానాథ్ హలో అన్నట్టుగా తల పంకించి అరుణ్‌వైపు తిరిగి ఏదో అడగబోయాడు. ఇంతలో ధనరాజ్ గొంతు విప్పడంతో ఆగిపోయాడు.

"సేఠ్‌జీ! మీ వద్ద ఉన్న పెయింటింగ్స్ మొత్తం చూపించండి. కాస్త టైం పట్టినా ఫరవాలేదు"

"జరూర్ సాబ్! ఇదిగో ఇటువైపు రండి" పిలిచాడు. ద్వారకానాద్, ధనరాజ్‌లు ఆవైపు నడిచారు. అరుణ్ మాత్రం ముందుకు అడుగువేయలేదు.

మనసులో హఠాత్తుగా ఏదో ఫీలింగ్ ఇదీ అని చెప్పలేని ఫీలింగ్... ఏదో... ఏదో... ఏదో జరగబోతోంది. ... ఏం జరగబోతుందో అర్థంకావడంలేదు.

షాపు యజమాని మాటలు వినిపిస్తున్నాయి.

"ఇవిగోండి సార్! ఇవన్నీ వాటర్ కలర్ పెయింటింగ్స్ ఇవి ఆయిల్ పెయింటింగ్స్!"

కొద్దిక్షణాలు నిశ్శబ్దం... ద్వారకానాథ్ పెయింటింగ్స్‌ని పరిశీలిస్తున్నట్టుంది.

హఠాత్తుగా వినిపించింది. "ఎక్సలెంట్! ఇదే ఇదే నాకు కావలసింది" ద్వారకానాథ్ గొంతులో ఎగ్జయిట్‌మెంట్ స్పష్టంగా తెలుస్తోంది.

"ఏది సార్... ఏది? " ధనరాజ్ కంటే ముందుగా సేఠ్ పలికాడు. ద్వారకానాథ్ సూచించిన పెయింటింగ్ వంక చూసి అన్నాడు, "నాకు తెలుసు సార్! ఈ ఆర్ట్ మీకే కాదు ఎవరికయినా వెంటనే నచ్చితీరుతుంది. నిన్న అరుణ్ భయ్యా ఇచ్చి వెళ్ళాక కస్టమర్స్ ఎవరూ రాలేదుగానీ, లేకపోతే ఈ సరికి ఆ ఆర్ట్ ఎప్పుడో అమ్ముడుపోయి ఉండేది..."

ద్వారకానాథ్ కాస్త కన్‌ఫ్యూజింగ్‌గా అడిగాడు. "అరుణ్‌భయ్యా అంటే ఎవరు? ఎక్కడుంటాడు? "

సేఠ్ కాస్త ఆశ్చర్యపోతూ, "అదేంటి సార్! మీ వెంట వచ్చిన అరుణ్ భయ్యా పేరే మీకు తెలియదా? ఆయనేకదా అరుణ్ భయ్యా" అరుణ్‌వైపు చేయి చూపిస్తూ చెప్పాడు.

ద్వారకానాథ్ అరుణ్‌వైపు తిరిగాడు. ఒక నమ్మలేని నిజాన్ని ప్రత్యక్షంగా చూస్తున్నట్టు విభ్రాంతితో ఆయన కళ్లు పెద్దవయ్యాయి. ఊపిరి పీల్చడమూ మరచిపోయాడేమో!

మరుక్షణం ఆయన ఒకేమాట అన్నాడు... "ఆ పెయింటింగ్ ప్యాక్ చేయండి"

ధనరాజ్ బిల్లు చెల్లించాక ముగ్గురూ షాపులోంచి బయటికి నడిచారు.

కారు కొద్దిదూరం సాగేవరకూ ఎవ్వరూ మాట్లాడలేదు. అరుణ్‌కి మాత్రం వారిద్ద రిలో ఎవరయినా మాట్లాడితే బాగుణ్ణనిపిం చింది. ఆ గాఢమైన నిశ్శబ్దాన్ని భరించడం కష్టమనిపించసాగింది.

పది నిమిషాల తర్వాత ద్వారకానాథ్ పెదవి విప్పాడు. "నీలో ఇంత మంచి కళా కారుడు దాగి ఉన్నాడని ఎవ్వరూ... ఎవ్వరూ ఊహించలేరు తెలుసా"

అతడు మాట్లాడలేదు. అయితే ద్వారకా నాథ్ తన మాటలతో నిశ్శబ్దాన్ని భగ్నంచే యడం మాత్రం సంతృప్తినిచ్చింది.

"గొప్పవారి కుంచెల్లో కనిపించే రమణీ యత నీ కుంచెలోనూ కనిపిస్తోంది నాకు. ఆ కళమీదనే నువ్వు కాన్‌సన్‌ట్రేషన్ చేస్తే... చాలా చాలా గొప్ప చిత్రకారుడివ వుతావనిపిస్తోంది. అయినా నువ్వీ సినిమా రంగంలోకి ఎందుకొచ్చావో..." అసంపూ ర్ణంగా వాక్యాన్ని ఆపి ద్వారకానాథ్ కళ్లు మూసుకున్నాడు.

ఆయనకు తన పరిస్థితి విప్పి చెప్పాలని పించింది అరుణ్‌కి. అయిష్టంగానే ఇండస్ట్రీకి రావడం, రేపు సినిమా హీరో అయ్యాక తీసుకోబోతున్న నిర్ణయం అన్నీ... అన్నీ మనసులోని మాటలన్నీ ప్రవాహంలా బయ టకు తీసుకురావాలని ఉంది. కాని... కాని... ఆగిపోయాడు అతడు.

"ఆల్‌రైట్... ఇప్పటివరకూ జరిగిందేదో జరిగిపోయింది. ఈ సినిమా పూర్తయ్యాక ఎక్కువకాలం బొమ్మల మీదనే కాన్‌సన్‌ట్రే షన్ చెయ్యి. సరేనా?" ద్వారకానాథ్ చెప్పడం ముగించిన క్షణంలోనే కారు స్టూడియో చేరింది.

సెట్ బయట యూనిట్ సభ్యులంతా గుమికూడి ఏదో చర్చించుకుంటున్నారు. కారు దిగుతున్న డైరెక్టర్‌గారిని చూడగానే వారంతా చేష్టలుడిగినట్లు నిలబడిపో యారు. ద్వారకానాథ్ వారి ముఖాలకేసి పరిశీలనగా చూశాడు. వాడిపోయినట్లుగా ఉన్నాయి. అంతా ఏదో ఇబ్బంది పడుతు న్నట్టు కనిపించింది... ఆయన భృకుటి ముడివడింది. ఏమయింది? ఏం జరి గింది...?

తిరుపతి వడివడిగా కారు దగ్గరకి వచ్చి చెప్పాడు."తాను సజెస్ట్ చేసిన పెయింటిం గ్‌ని మీరు నిరాకరించారని హీరోగారికి కోపం వచ్చింది. అందుకని..."

"అందుకని?" ధనరాజ్ అడిగాడు గట్టిగా.

"ఈరోజు షూటింగ్ కాన్సిలంటూ ఆయన వెళ్ళిపోయారు"

ధనరాజ్‌కి నోట మాట రాలేదు. డైరెక్టర్ గారి వంకచూశాడు. ఆయన చూపులు తీక్ష ణంగా ఎటో చూస్తున్నాయి. ఆయన మౌనం వెనుక చాలా తీవ్రమైన ఆలోచనలు కదలాడుతున్నాయని ధనరాజ్‌కి అర్థమ యింది.

అరనిమిషం తర్వాత ఆయన తిరిగి కారులో కూర్చుంటూ ధనరాజ్‌తో అన్నాడు, "ధనరాజ్‌గారు! ఈ సినిమాకి మరో డైరెక్ట ర్‌ని చూసుకోమని ప్రొడ్యూసర్లకి చెప్పండి"

కారు ముందుకు వెళ్ళిపోయింది.

అక్కడ గాఢనిశ్శబ్దం మిగిలింది.

★ ★ ★

"అతను ఫైనాన్సియర్ కొడుకే కావచ్చు పెట్టుబడిలో అర్థభాగం ఆ వ్యక్తిదే కావచ్చు అంత మాత్రాన డబ్బు ఉందికదాని క్రియేటి విటీని నిర్లక్ష్యం చేయడం మంచిపనికాదు. నాకంటూ ఒక టేస్ట్ ఉంది. నా టేస్ట్‌కి అను గుణంగా హీరో నటించాలి. అంతేతప్ప మిగిలిన విషయాల్లో జోక్యం చేసుకోవడం




నేను భరించలేను"

ఆ నిర్మాతలిద్దరూ ద్వారకానాథ్ వైపు చూస్తున్నారు. ఆయన మాటలు ఆపడంతో నెమ్మదిగా తలాడించారు.

"నిజమేనండీ! కాని... మాది కూడా మరేమీ చేయలేని పరిస్థితి అయిపోయింది''

ఆ ఇద్దరిలో ఒక వ్యక్తి చెప్పాడు.

"నిజానికి మేము చాలా తక్కువ పెట్టుబడితో సినిమా తియ్యాలని వచ్చాం. మా దగ్గర కొద్ది డబ్బే ఉండడంతో ఫైనాన్సియర్‌ని అడిగితే, తన కొడుకుని హీరోగా పెట్టాలనే డిమాండు పెట్టాడు. మాకూ తప్పలేదు" మరో వ్యక్తి చెప్పాడు.

"మా పరిస్థితి గురించి మీరూ ఆలోచించాలి. ఇప్పటికే హీరోయిన్‌నుండి టెక్నీషయన్స్‌వరకూ అడ్వాన్స్‌ల రూపంలోనే ఐదారు లక్షలు ఖర్చుచేశాం. ఇప్పుడిలా అర్థాంతరంగా..."

మొదటి వ్యక్తి మాటలను కట్ చేస్తూ ద్వారకానాథ్ అన్నాడు. "ఈ విషయంలో నేను మీకు చేయగలిగిన సహాయం ఒక్కటే- నాకిచ్చిన అడ్వాన్స్‌తోపాటూ ఇప్పటివరకూ మీరు నా డిపార్ట్‌మెంట్‌కి చెందిన వ్యక్తులకు ఇచ్చిన అడ్వాన్స్‌లన్నీ తిరిగి ఇప్పించేస్తాను..."

"అంతమాట అనకండి. మేము ద్వారకానాథ్‌లాంటి క్రియేటివ్ డైరెక్టర్‌తో సినిమా తియ్యాలని కృతనిశ్చయంతో ఉన్నాం"

ద్వారకానాథ్ కొద్దిక్షణాలు మౌనంగా ఉన్నాడు. ఆ తరువాత చెప్పాడు.

"మీరొక మంచి కథతో నా దగ్గరకొచ్చాక, ఆ సబ్జెక్ట్‌మీద నమ్మకంతో మీ దగ్గర పూర్తి డబ్బులున్నాయా లేవా అని చూడకుండానే, హీరో ఎవరన్నది పట్టించుకోకుండానే మీ సినిమా తీసి పెట్టడానికి ఒప్పుకున్నాను"

"అది మాకూ తెలుసు ద్వారకానాథ్ గారూ... ఇప్పుడు కూడా ఆ సబ్జెక్ట్‌ని మీతోనే తీయించాలని, మరే డైరెక్టరూ, ఆ సబ్జెక్ట్‌కి న్యాయం చేయలేడనీ అనుకుంటున్నాం..."

"కానీ నేను... నేనేం చేయగలను?"

"ఇప్పుడు మమ్మల్నీ సమస్యనుండి గట్టెక్కించదలచుకున్నా, మరేదయినా చేయదలచుకున్నా మీరే చేయాలి"

ద్వారకానాథ్ ఆలోచనల్లో పడ్డాడు. నిజానికి ఆ ఫైనాన్సియర్ కొడుకుతో సమస్యనే గానీ, నిర్మాతలు చాలా మంచివారేనని ఆయన ఏనాడో గ్రహించాడు. "నేను ఏం చేయగలనో చెప్పండి"

వారు కొద్దిక్షణాలు మౌనంగా ఉన్నారు. ఒకరి ముఖంలోకి మరొకరు చూసుకుంటూ కళ్లతోనే మాట్లాడుకున్నారు. ఒకతను అన్నాడు- "మేము ఆ హీరోనీ, ఆ ఫైనాన్సియర్‌నీ వదిలేస్తాం..."

వారేం చెప్పదలచుకున్నారో ఆయనకు అర్థమయింది. వారి దగ్గరున్న అతికొద్ది పెట్టుబడిని దృష్టిలో ఉంచుకుని, మిగిలిన డబ్బును ఫైనాన్స్ చేయించడం తను బాధ్యతగా తీసుకోవాలి. ఒకవిధంగా ఈ సినిమా తన రిస్క్‌తో మొదలుపెట్టాలి. ఆయన ఆలోచించడం మొదలుపెట్టాడు.

సబ్జెక్ట్ తనకు అంతగా నచ్చకపోతే, అసలు ఆలోచించాల్సిన అవసరమే ఉండేది కాదు. ఆ సబ్జెక్ట్ తన టేకింగ్‌కి సరిగా సరిపోయింది. తనకు మంచి పేరు తెచ్చే అవకాశమూ ఉంది. అందుకే ఇంత ఆలోచన. తను ఆ హీరోతో చిత్రం తియ్యలేడు. కానీ ఆ సబ్జెక్ట్ తనకు కావాలి.

ఇప్పుడు వారి చిత్రం బాధ్యత తన నెత్తిన వేసుకోవడం అంటే, తనే ఒకవిధంగా చిత్ర నిర్మాతగా మారడం అవుతుంది. ఆ రిస్క్ ఫేస్ చేయడం అవసరమా? సబ్జెక్ట్ మీద నమ్మకమే కాదు, ఆ హీరోమీద కోపమూ ఒక అడుగు ముందుకు వేసేలా చేశాయి.

"ఆల్ రైట్! నేను మీకు సినిమాను తీసి పెడతాను. ఇప్పుడు ఈ చిత్రానికి కావలసిన మిగిలిన పెట్టుబడి నేనే పెడతాను... బట్

ఆన్ వన్ కండిషన్..."

ఆయన అలా అనేసరికి వారి ముఖాలలో వెలుగు నిండిపోయింది. ఆయన వన్ కండీషన్ అన్నప్పటికీ వారు ఎన్ని కండిషన్స్ కయినా ఒప్పుకోవాలనే అనుకుంటున్నారు. "చెప్పండి సార్" అన్నాడు ఒక నిర్మాత.

"ఈ సినిమాకు హీరోని మీరు సజెస్ట్ చేయకూడదు"

సినిమా ఇండస్ట్రీలో సక్సెస్‌ఫుల్ నిర్మాతగా నిరూపించుకున్న ఎవరయినా సబ్జెక్ట్‌ని, హీరోని ముందు సెలక్ట్‌చేసి ఆ తరువాత ఓ దర్శకుడికి సినిమాతీసే బాధ్యత అప్పగిస్తారు. అదే కొత్త నిర్మాత అయితే సబ్జెక్ట్, ఆర్టిస్టుల సెలక్షన్ లాంటివన్నీ దర్శకుడిమీదే ఉంచేస్తాడు. కాబట్టి హీరోని సజెస్ట్ చేయడమన్నది వారి మనసుల్లోనే లేదు. అందువల్లే వారు సంతోషంగా "ఒక్క హీరో విషయంలోనేకాదు, ఈ సినిమాకు సంబంధించి మరే విషయంలోనూ మేము వేలుపెట్టం. షూటింగ్ జరిగినంతసేపూ మేము ప్రేక్షకులం" చెప్పారు వారు.

ద్వారకానాథ్ సంతృప్తిగా నవ్వాడు.

అదేక్షణం ఆయన కన్నులు మూసుకున్నాడు.

'హీరో... హీరో ఎవరు? '

ఒక భావుకుడు, చిత్రకారుడయిన ఆ పాత్రకు తగిన వ్యక్తి ఎవరు?

నిజజీవితంలో తనను మెప్పించిన ఓ చిత్రకారుడు ఆయన కళ్లముందు నిలిచాడు.

ద్వారకానాథ్ పెదాలమీద చిరునవ్వు ఉదయించింది.

★ ★ ★

కారు రూమ్ ముందు ఆగిన శబ్దం కావడంతో ముందుగా ఈశ్వరయ్య తొంగి చూసి, "అరుణ్! ఎవరో మనింటికే వస్తున్నట్టున్నారు" అన్నాడు.

అరుణ్ పుస్తకం చదువుకుంటున్నవాడల్లా లేచి అటు చూసి స్థాణువయిపోయాడు.

ద్వారకానాథ్ కారుదిగి లోపలికి వస్తూ ఉన్నాడు. ఆయన వెనకే తిరుపతి కూడా.

అతడు తల విదిలించుకుని ఈ లోకంలోనికి వచ్చి ఒక అంగలో ఆయనకు ఎదురుగా వెళ్ళి "రండి... రండి సార్" అన్నాడు. అంతలో తిరుపతి "నేను ఆఫీసు కెళ్లగానే డైరెక్టర్‌గారు మన రూమ్ చూపించమన్నారు" అన్నాడు.

అరుణ్ తిరుపతి మాటలు వినిపించుకోలేదు. ఆయనకు కుర్చీ చూపించాడు. ద్వారకానాథ్ అతడు చూపించిన కుర్చీలో కూర్చున్నాక మంచినీళ్లు తెస్తానంటూ తిరుపతి లోపలికి వెళ్ళాడు.

డైరెక్టర్‌గారు డైరెక్ట్‌గా తన రూముకి ఎందుకొచ్చారో అరుణ్‌కి అర్థం కావడంలేదు. అతడు ద్వారకానాథ్‌వైపు తిరిగి, "ఈయన మా మామయ్యగారు సార్" అని చెప్పాక ఈశ్వరయ్యతో చెప్పాడు, "మామయ్యా! ఆయన డైరెక్టర్ ద్వారకానాథ్‌గారు..."

ఆ వచ్చిన వ్యక్తి ఎవరో తెలియడంతో ఈశ్వరయ్య ఆశ్చర్యపోయాడు. 'అంత గొప్ప డైరెక్టర్ తన మేనల్లుడి రూమ్ వెదుక్కుంటూ ఎందుకొచ్చినట్టు? '

పరస్పర నమస్కారాలయ్యాయి.

ద్వారకానాథ్ చూపు రాజేశ్వరి మీద నిలిచింది.

"ఈమె... మామయ్యగారమ్మాయి..."

ఆమె బుగ్గల్లోని సిగ్గు గమనించాక, ద్వారకానాథ్ నవ్వాడు. "అంతేనా? లేక..."

ఈసారి అరుణ్ కూడా సిగ్గుపడినట్టు తలొంచుకున్నాడు.

"ఆల్ రైట్! నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి. నాతో రాగలవా? "

డైరెక్టర్‌గా ఆజ్ఞాపించడమే విని ఉన్న అరుణ్‌కి, ఆయన అభ్యర్థన ఆశ్చర్యంగా అనిపించింది. "తప్పకుండా సార్" అన్నాడు

ఆశ్చర్యాన్ని అణుచుకుంటూ.

అతడు తనవారికి చెప్పి ఆయన వెంట బయటకు నడిచాడు. ఇద్దరూ కూర్చున్నాక కారు కదిలింది.

కారు కొద్దిదూరం సాగాక ఆయన అన్నాడు, "మనం ఆపేసిన సినిమా నిర్మాతలు రాత్రి నన్ను కలుసుకున్నారు అరుణ్"

ఆయన ఆ విషయం తనకి ఎందుకు చెబుతున్నారో అర్థం కానట్టు అయోమయంగా ఆయనకేసి చూశాడు అతడు.

..." సినిమా పూర్తిచేసే బాధ్యత పూర్తిగా నాపైనే పెట్టేస్తున్నారు. ఆ హీరోని, ఫైనాన్షియర్‌ని తప్పించడానికి ఒప్పుకున్నారు. ఇప్పుడు నేను నాకు నచ్చిన వ్యక్తిని హీరోగా పెట్టుకోవచ్చు ప్రస్తుతం నేను ఆ అన్వేషణ లోనే ఉన్నాను"

అతడు మౌనంగా వింటూ ఉన్నాడు.

"నాకు ఆ సబ్జెక్ట్ చాలా బాగా నచ్చింది. ఓ భావుకుడయిన చిత్రకారుడు అంతా తెలిసీ తెలియనట్టే నడుచుకునే వ్యక్తిత్వం... ఓ లక్ష్యంపట్ల దీక్షగా సాగిపోయే మనస్తత్వం... అంతా నీ గుణాలతోనే ఆ రచయిత ఆ కేరక్టర్‌ని రూపుదిద్దినట్టుంది కదూ అరుణ్..."

అతడు ఉలిక్కిపడి ఆయనకేసి మరింత తదేకంగా చూశాడు.

"ఏంటలా చూస్తున్నావ్ అరుణ్? " అతడి చూపులు గమనించి అడిగాడు ద్వారకానాథ్.

"ఏమీలేదు సార్" అతడు చూపులు మరల్చుకున్నాడు. కారు గమ్యం లేకుండా ముందుకు పోవడం గమనించాడు. ఆయన డ్రైవర్‌కి ముందుగానే చెప్పివుంచినట్లుంది.

కొద్దిక్షణాలు మౌనంగా గడిచాక ఆయన అన్నాడు. "నేనిప్పుడు నా సినిమాకు హీరో గురించే అన్వేషిస్తున్నాను. కోరుకున్న కొన్ని లక్షణాలు, రూపం ఉన్న వ్యక్తి తారసపడ్డాడుగాని, నేను కోరుకునే పూర్తి లక్షణాలు అతడిలో ఉన్నాయో లేదో నాకు తెలియడం లేదు..."

అతడికి ఏదో అర్థమయీ కానట్టుగా ఉంది.

ద్వారకానాథ్ అడుగుతున్నాడు, "సినిమా పూర్తయ్యాక కాదు. షూటింగ్ జరుగుతున్నంత సేపూ దర్శకుడికి, హీరోకి మధ్య సంబంధం ఎలా ఉండాలంటావ్ అరుణ్"

అతడు జవాబు చెప్పాడు. "దర్శకుడు క్రియేట్ చేసేవాడు. ఆయన ఒక సీన్‌ని లేదా రూపాన్ని ఊహించుకుంటాడు. నటుడనేవాడు ఆయన ఊహల్లోనే చిత్రాన్ని తనూ ఊహించుకుని ఆ రూపంలో తను ఇమిడిపోవాలి. కాబట్టి దర్శకుడిని షూటింగ్ జరుగుతున్నంతసేపూ గురువుగా తలచినా తప్పులేదు"

"గుడ్" అన్నాడాయన. "అయితే ఇది పర్సనల్ క్వశ్చన్. నువ్వు సహజంగానే చిత్రకారుడివికదా? మరి స్టోరీ డిస్కషన్స్‌లో హీరో కేరక్టర్‌కి సంబంధించిన కొన్ని సలహాలు చెప్పావే తప్ప, నువ్వు చిత్రకారుడివని చెప్పలేదెందుకని? "

"అలా చెప్పుకోవడం నాకిష్టం ఉండదు"

"అదే ఎందుకని అని? "

అతడు కొద్దిసేపు ఆలోచించుకుంటున్నట్లు మౌనంగా ఉండిపోయాడు. ఆ తర్వాత గొంతు మంద్రస్థాయిలో పలికింది. "నా దృష్టిలో కళ అనేది ఆత్మ తృప్తికోసం ఒక మనిషి అభ్యసించదగినది. ఆ కళలో పరిపూర్ణత సాధిస్తే అనుకోకుండా గుర్తింపు, డబ్బు, పేరు ప్రతిష్టలు రావచ్చు అయితే నాకు సంబంధించినంతవరకూ నేను నా కళలో విద్యార్థినే. విద్యార్థిగా ఉన్న వ్యక్తి తన గురించి తాను గొప్పలు చెప్పుకోకూడదు"

అప్రయత్నంగానే అన్నాడాయన. 'శభాష్"

వెంటనే నవ్వి ప్రశ్నించాడు.

"మరి ఒక కళలో పరిపూర్ణత సాధించకుండానే, మరో కళపట్ల ఆకర్షితుడివై రావడం ఎంతవరకూ సబబు? "

"నేను ఈ రంగంవైపు ఆకర్షితుడనై రాలేదు. తప్పనిసరై వచ్చాను."

"అంటే? " ఆయన అతడివైపు ఆశ్చర్యంగా చూశాడు.

అరుణ్ కొద్దిగా తటపటాయించాడు. ఇక తప్పనిసరి పరిస్థితి. అందుకే అతడు పల్లెలోనుండి ఎటువంటి పరిస్థితుల్లో తను సినిమారంగంవైపు రావలసివచ్చిందో పూర్తిగా వివరించాడు.

అతడు చెప్పడం పూర్తయ్యేసరికి కారు అగమ్యంగా పది కిలోమీటర్లు తిరిగి ఉండొచ్చు.

అతడి కథ మొత్తం విన్నాక ద్వారకానాథ్ కొద్దిక్షణాలు మాటలే రానట్టు మౌనంగా ఉండిపోయాడు. అతడి కథ ఆయనను బాగా ఇంప్రెస్ చేసింది. చాలా సేపటి తర్వాత ఆయన గొంతు పెగల్చుకుని "అయితే... అయితే నువ్వు ఒక్క సినిమా... ఒకే ఒక్క సినిమాలో హీరోగా చేసి తిరిగి పల్లెకు వెళ్ళిపోతావా? " అడిగాడు.

"అవును సార్! ఒకే ఒక సినిమా... ఒకే ఒకసారి హీరోగా... అంతే"

"కాని నేను నమ్మను అరుణ్" ఈసారి ఆయన గొంతులో అధికారం కన్నా, ఆప్యాయత ధ్వనించడం గుర్తించాడు అరుణ్.

"...ఈ ఇండస్ట్రీలో దొరికే లగ్జరీస్, వద్దన్నా వచ్చిపడే డబ్బు, పాపులారిటీ... ఇవన్నీ ఒకసారి అనుభవంలోకి వచ్చాక ఏ వ్యక్తయినా ఈ ఇండస్ట్రీని వదిలి దూరంగా పోవడం అసలు జరగదేమో! అలా వదిలేస్తామని స్టేట్‌మెంట్స్ గుప్పించిన ఎందరో ప్రముఖులు మళ్ళీ ఈ రంగంలోకే రావడం జరిగింది..."

"అదీ నిజమే సార్! ఈ రంగంలో అద్భుతమైన ఆకర్షణ ఉంది. చాలామంది ఈ ఇండస్ట్రీని వదిలివెళ్ళి మళ్ళీ తిరిగివచ్చేశారు. కాదనను. కాని నేను మాత్రం ఈ ఇండస్ట్రీలో ఉండను. ఒక్క సినిమా... ఆ సినిమా జయాపజయాలతో సంబంధం లేకుండా నేను నా పల్లెకు వెళ్ళిపోతాను... ఇది ఈరోజువరకూ ఎవ్వరికీ చెప్పని నా మనసులోని మాట"

"నేను నమ్మలేకున్నాను"

"నేను మనిషికి అన్నింటికన్నా ముఖ్యం ఆత్మతృప్తి అని నమ్మేవాడిని"

"కాని ఒక హీరోకి దొరికే అసంఖ్యాక ప్రజాదరణ..."

ఆయన మాటలు మధ్యలోనే కట్ చేశాడు అతడు. "...అటువంటి ఆదరణ, అభిమానం చాలావరకూ క్షణికావేశానికి చెందిన అంశాలే! ఒక నటుడికి ఎంతో మంది అభిమానులు ఉన్నప్పటికీ ఒక్కొక్కసారి అతడి చిత్రం అనూహ్యంగా పరాజయం పొందుతుంది. ఎందుకని? ఆ నటుడిమీద ఉన్నది నిజమయిన అభిమానమే. అయితే కథ, కథనాలతో సంబంధం లేకుండా అతడి సినిమాలు చూడాలికదా? అలాగే ఒక మహానటుడు రాజకీయాల్లోకి వస్తే ఒకసారి అపూర్వమైన మెజారిటీతో గెలిపించిన ప్రజలు, రెండోసారి పరాజితుడిని చేశారు. అక్కడ అభిమానానికి ఉన్న విలువేమిటి? సో! ఒక వ్యక్తిపట్ల ఇతరులు పెంచుకునే అభిమానం, ఆప్యాయతలకు చాలా కారణాలు అనుకూలిస్తాయి. ఆ అనుకూలతలు, ప్రతికూలతలయితే అందరూ దూరమైపోతారు. అందుకనే నాకు ఇతరుల అభిమానం కోసం ప్రాకులాడక, ఆత్మతృప్తితో బతకాలనిపిస్తుంది..."

అప్పటికే ద్వారకానాథ్ ఒక నిర్ణయానికి వచ్చినవాడిలా డ్రైవర్‌తో చెప్పాడు. "మన ఆఫీసుకి పోనివ్వికా"

కారు ఆఫీసు దారిపట్టింది.




ఆఫీసు చేరుకోగానే ద్వారకానాథ్ కెమేరా, మేకప్‌మేన్‌లకు ఫోన్ చేశాడు.

అరుణ్‌కి జరిగేదంతా కలలా ఉంది. ఏడు నెలల పోరాటం నిజం కాబోతుందన్న విషయం కొద్దికొద్దిగా అర్థం కాసాగింది.

స్క్రీన్‌టెస్ట్ జరిగింది.

మరోగంట తర్వాత ద్వారకానాథ్ అతడి చేతిలో పాతికవేలు పెడుతూ చెప్పాడు, "ఇది హీరోగా నీకిస్తున్న అడ్వాన్స్ మాత్రమే. ముందు ఆ రూమ్ ఖాళీచేసి ఓ మంచి పోర్షన్‌కి షిఫ్ట్ అయిపో! నా సినిమాలో హీరో మరీ సింగిల్‌రూంలో ఉండడం నాకు అంత బాగుండదు."

అతడు కలలో ఉన్నట్టుగానే ఆ అమౌంట్ అందుకున్నాడు.

★ ★ ★

ఆ వార్త వినడంతోనే ఈశ్వరయ్య సూట్‌కేస్ సర్దుకుని పల్లెకు బయల్దేరాడు.

"అదేమిటి మామయ్యా! ఇప్పుడు మీరు ఊరెళ్తే ఎలా?"

"ఈ వార్త మనవారందరికీ చెప్పాలిరా. ముఖ్యంగా మీ అమ్మానాన్నల ముఖంలో కదలాడే వెలుగు చూడాలి. పల్లెలో ఈవార్త చెబితే, జనమంతా మన ఇళ్లముందే తిరుగాడుతారు తెలుసా?"

ఆయనకు మేఘాలలో తేలిపోతున్నట్టుగా ఉంది. అరుణ్ ఇంత త్వరగా అంత గొప్ప స్థాయికి చేరుకోగలడని ఏనాడూ ఊహించలేదు. ద్వారకానాథ్‌లాంటి డైరెక్టర్‌తో సినిమాలో హీరో ఛాన్స్ అంటే ఇక అవకాశాలు వెతుక్కుంటూ వచ్చేస్తాయి. అనుమానం లేదు అన్నది ఆయనకు తెలుసు.

"మామయ్యా! మనం ఇప్పుడు ఇల్లు మారాలి. ఈ సమయంలో మీ అవసరం మాకు చాలా ఉంది. మీరు రెండురోజుల తర్వాత వెళ్ళొచ్చుకదా?"

"అవునుకదూ!" ఆయన ఆలోచనలోపడి ఆరు సెకనుల తర్వాత చెప్పాడు. "సరయితే నేను రెండురోజుల తర్వాతే వెళతాను"

మర్నాడే తిరుపతి ఓ మంచి ఇల్లు ఉందని తీసుకెళ్ళి చూపించాడు. ఆ ఇల్లు అందరికీ నచ్చింది. అదేరోజు ఆ ఇంట్లోకి మారిపోయారు. తిరుపతిని కూడా తమ తోనే ఉండమన్నాడు అరుణ్.

ఇల్లు ఒక తీరుకు వచ్చాక ఈశ్వరయ్య మళ్ళీ బయలుదేరాడు. రాజేశ్వరిని తయారవమంటే ఆమె బుంగమూతి పెట్టి "నాన్నా! ఇంకో నాలుగురోజులు ఉండాలనిపిస్తోంది" అంది.

ఈశ్వరయ్య మరేదో చెప్పబోతుంటే అరుణ్ అందుకుని చెప్పాడు. "అయితే ఒక పని చేయండి మామయ్యా! మీరు పల్లెవరకూ వెళ్ళి మీ పనులు చక్కబెట్టుకుని మన వాళ్ళందరికీ ఈ విషయం చెప్పి వెంటనే తిరిగి వచ్చేసెయ్యండి"

తలూపక తప్పలేదు ఈశ్వరయ్యకు. అదే రోజు ఆయన పల్లెకు వెళ్ళిపోయాడు.

★ ★ ★

ప్రెస్‌మీట్‌లో ద్వారకానాథ్ అరుణ్‌ని అందరికీ పరిచయం చేశాడు.

ఎలాంటి పరిస్థితుల్లో నరేంద్రను తప్పించవలసివచ్చిందో చెప్పకుండా, అనివార్య కారణాలవలన అదే సబ్జెక్ట్‌తో మరో నూతన నటుడితో తీస్తున్నట్టు ప్రకటించాడు.

ఏనాడూ తన చిత్రం జయాపజయాల గురించి ముందుగా ప్రకటించని ద్వారకానాథ్ తన ఈ చిత్రం సూపర్‌హిట్ అవుతుందని హామీ ఇచ్చాడు.

సినిమా పత్రికలన్నింటిలోనే కాక, దినపత్రిక సినిమా పేజీలు ఈ వార్తని మర్నాడు ప్రముఖంగా ప్రచురించాయి.

ఆరోజే నరేంద్ర ప్రెస్‌మీట్ ఏర్పాటు చేశాడు. అలాంటి సబ్జెక్ట్‌తోనే మరో చిత్రం తియ్యబోతున్నట్టు టెక్నీషియన్స్ వివరాలు త్వరలో ప్రకటించబోతున్నట్టు తెలిపాడు.

ఈ వార్త ఇండస్ట్రీలో సంచలనం కలిగించింది.

ఇంచుమించు ఒకే విధమైన సబ్జెక్ట్‌లతో రెండు చిత్రాలు! ఇలాంటి సంఘటనలు సినిమారంగానికి కొత్తకాదు. గతంలో ఒకే సబ్జెక్ట్‌తో యోధానుయోధుల్లాంటి నటులు చిత్రాలు తీసి ఒకేరోజు విడుదల చేసిన సంఘటనలున్నాయి.

సంఘటన రిపీట్ కావచ్చు కాని ఉత్సుకత సహజం.

ఇండస్ట్రీ మొత్తం ఆ రెండు చిత్రాలకేసి దృష్టి నిలిపింది.

అయితే ఎక్కువమంది ఎక్స్‌పెక్టేషన్స్ ద్వారకానాథ్ చిత్రం మీదనే ఉన్నాయి. అందువల్లే ఎక్కువమంది ఆ చిత్రం హీరో అరుణ్ ఎవరా అని ఆరా తీయడం మొదలుపెట్టారు.

అదే సమయంలో ద్వారకానాథ్ సినిమా షూటింగ్ మొదలుకావడం జరిగింది. ప్రారంభోత్సవం లేదు. ప్రముఖులు స్విచాన్ చేయడం, క్లాప్ కొట్టడం లాంటి ఫార్మాలిటీస్ కూడా పాటించలేదు. అది తొలిరోజు కాదేమో, రెగ్యులర్ షూటింగేమో అనిపించేలా మొదలయిందా షూటింగ్.

సాధారణంగా ద్వారకానాథ్ ఏ సీన్‌ని 'ఫస్ట్ టేక్'లో ఓ. కే. చేయడం జరగదు. కాని అరుణ్ ఫస్ట్ సీన్‌లో నటిస్తుంటే కొద్ది క్షణాలు 'కట్' చెప్పడం కూడా మరచిపోయాడు. తేరుకుని కట్ చెప్పాక ధనరాజ్ అడిగాడు. "మరో టేక్ చేద్దామా సార్?"

ద్వారకానాథ్ మరో లోకంలో ఉన్నట్టు తల అడ్డంగా ఆడిస్తూ, నిద్రలో నడిచే మనిషిలా అడుగులేస్తూ అరుణ్‌ని సమీపించాడు. అతడి ముఖంలోనికి చూస్తూ ప్రశ్నించాడు. "చెప్పు! ఇంతకుముందు నీకు నాటకానుభవం చాలా ఉంది కదూ!"

ఆయన ఏమన్నాడో కొద్దిక్షణాలు అర్థంకాలేదు. అర్థమయ్యాక "మీరేమంటున్నారు సార్?" అడిగాడు ఆశ్చర్యంగా.

ద్వారకానాథ్ తన ప్రశ్నను రిపీట్ చేశాడు.

"నేను ఇంతకుముందు చిన్న నాటికలో కూడా నటించలేదు"

"నేను నమ్మను"

అతడికి మరేం చెప్పాలో తోచలేదు.

అంతలో ఆయనే అన్నాడు. "ఎంతో అనుభవం ఉన్న నటులు, ఎన్నో సినిమాల్లో నటించిన వారు కూడా ఒక్కోసారి పాత్ర పరిధిని అర్థంచేసుకోకుండా తప్పుగా నటించడం, టేకులమీద టేకులు తినడం నాకు తెలిసిన విషయం. ఇక కొత్త నటుడు అంటే ఈ లైటింగ్, చుట్టూ చాలామంది గమనిస్తున్నారంటే తడబడిపోతాడు. అందులోనూ మొదటి సీన్ అన్నది కనీసం పది టేకులు తీసుకోవడం సహజం. అలాంటిది మొదటి రోజు, మొదటిసీన్, మొదటిటేక్‌లో ఓ. కే. కావడం అంటే... నటించడం నీకు ఇదే మొదలని నేను నమ్మలేకపోతున్నాను..."

అతడు మౌనంగా ఉండిపోయాడు.

ద్వారకానాథ్ చేత మొదటి టేక్‌ని ఓ. కే. అనిపించగలగడం యూనిట్‌లోని వారందరికీ కూడా ఆశ్చర్యం కలిగించింది.

ఆ మధ్యాహ్నంవరకూ తీసిన సీన్స్‌లో చాలావరకూ ఫస్ట్‌టేక్‌లోనే ఓ. కే. కావడం యూనిట్‌వాలాలను మరింత చకితుల్ని చేసింది. వారిలో చాలామంది లంచ్ బ్రేక్‌లో అరుణ్‌ని కలిసి తమ అభినందనలు అందజేశారు.

ధనరాజ్ అయితే అతడిని కౌగిలించుకున్నంత పని చేసి "నీలో ఇంత గొప్ప నటుడు దాగి ఉన్నాడని నాకింత కాలం తెలియదు. అరుణ్! నేను చెబుతున్నాను... ఇండస్ట్రీకి మరో గొప్ప నటుడు దొరికాడు. ఈ నటుడు చరిత్ర సృష్టిస్తాడు. అది నిజం!' చెప్పాడు.

అరుణ్‌కి సంతోషం కలగలేదు. అదో లాంటి నిర్లిప్తత కలిగింది.

ఇప్పుడు తను పొగడ్తలకు మురిసిపో వడం మొదలుపెడితే, రేపీ పొగడ్తలే తన ఆలోచనలు పక్కదారి పట్టేలా చేస్తాయి. తను అనుకున్నది చేయకుండా ముందరి కాళ్ళకు బంధమయ్యేది ఈ పొగడ్తలే!

తొలిరోజు షూటింగ్ పేకప్ అయ్యాక, తను కారెక్కబోతుంటే 'అరుణ్' అన్న పిలుపు వినిపించి అతడు తిరిగి చూశాడు.

రమేష్!

అతడు కారెక్కడం మాని, ఆవైపు నడిచాడు.

అరుణ్‌ని మేకప్‌లో చూస్తుంటే, రమేష్‌కి ఓ అద్భుతాన్ని చూసినట్టు తోస్తున్నది. ఆ ఆశ్చర్యం అతడి కన్నులలో ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. అతను హీరో కాగలడనీ, అనుకున్నది సాధించగలడనీ అతడు ఏనాడూ కలలో కూడా ఊహించలేదు. అందుకే ఆ విస్మయం!

ఒకప్పుడు తన జేబులో పదిపైసలు కూడా లేనప్పుడు అతడు ఎలా నిర్లక్ష్యం చేశాడో, నిర్దయ ప్రదర్శించాడో అరుణ్ మనసులో మెదలాడింది. అయినా చిరునవ్వు పెదాలమీదకు, ఆప్యాయత నాలుకపైకి తెచ్చుకుని పలకరించాడు "హాయ్! రమేష్! ఏమిటీ హఠాత్‌దర్శనం? "

"నాది దర్శనమా? భలేవాడివే... అనుకోకుండా నిన్న పేపర్ తిరగేస్తుంటే నీ పేరు కనిపించింది. నువ్వు సినిమా హీరోవయ్యావని తెలిసి మనసు ఊరుకోక, ఈరోజు ఉదయం ఈ స్టూడియోలో షూటింగ్ మొదలని తెలిసివచ్చాను. సెక్యూరిటీ లోపలికి రానివ్వలేదు. ఉదయం నుండి పడిగాపులు పడితే ఇప్పటికి వారికి జాలికలిగి నన్ను లోపలికి పంపించారు"

"అలాగా" మరేమనాలో అర్థంకాక అన్నాడు అతడు.

"అప్పటికీ చెప్పాను. ఆ సినిమా హీరో నా ఫ్రెండయ్యా బాబూ అని! వాళ్ళు నా ముఖంకేసి చూసి, 'నీ ముఖానికి హీరోగారు ఫ్రెండు కూడానా. స్టూడియోలో కెళ్ళడానికి ఇదోసాకా? ' అనుకుని గెంటేసారు గురూ!"

అతడితో కాసేపు మాట్లాడి పంపేశాడు అరుణ్.

మనిషి కష్టాలలో ఉన్నప్పుడు ఆదుకొనని వ్యక్తులు కూడా సుఖపడేప్పుడు వెంటపడతారు. అలాంటి వారిని దగ్గరకు తీయడం తలనొప్పి. అందుకే రమేష్‌ని వీలయినంత తక్కువగా మాట్లాడి పంపాడు.

రమేష్ వెళ్ళిపోయాక అరుణ్ కారులో కూర్చుని డ్రైవర్‌కి చెప్పాడు. "టి. బి. హాస్పిటల్‌కి పోనివ్వు"

కారు ముందుకు కదిలింది.

పది నిమిషాలు తర్వాత అతడు కారు దిగి, హాస్పిటల్‌వైపు నడిచాడు. మెట్లెక్కి రెండో అంతస్తు చేరుకుని ఆ రూమ్‌లోకెళ్ళాడు.

పీతాంబరం బెడ్‌మీద వెల్లకిలా పడుకుని ఉన్నాడు. ఆయన మునుపటికన్నా మరింత నీరసంగా ఉన్నాడు. మనిషి చావుకు బాగా దగ్గరవుతున్నట్టుంది.

అతడు రూమ్‌లో కెళ్ళగానే మొదట చేసిన పని ఆయన పాదాలకు నమస్కరించడం.

ఆ స్పర్శకు పీతాంబరం ఉలిక్కిపడి కన్నులు విప్పాడు. అతడిని చూసి ముఖం విప్పార్చుకుని 'అరుణ్' అన్నాడు ఆప్యాయంగా.

"అవును అరుణ్‌నే! మీరు చూపించిన దారిలో వెళ్ళి లక్ష్యం చేరుకున్న అరుణ్‌ని"

ఆయన ముఖంలో కాంతి.

"లక్ష్యం... లక్ష్యం... అంటే నువ్వు..."

అతడు నిబువుగా తలాడించాడు. "ద్వారకానాథ్‌గారి సొంత సినిమాలాంటి దాన్లో నేను హీరోని"

ఆయనకు అంత శక్తిఎలా వచ్చిందో తెలియదు. ఒక్క ఉదుటున లేచి అతడిని కౌగిలించుకున్నాడు.

"నాకు తెలుసు నువ్వు అనుకున్నది సాధిస్తావని! నీ కళ్ళలో ఆ పట్టుదల నేనెప్పుడో గమనించాను!"

అతడు ఆరోజు జరిగిన విషయాలన్నీ ఆయనకు వివరించాడు. "ఈరోజు ముఖానికి మొదటిసారి మేకప్ వేసుకోగానే మొదట మీ దగ్గరకే రావాలనుకున్నాను. కాని డైరెక్టర్‌గారు ఒప్పుకోలేదు"

"ఫర్వాలేదు అరుణ్! మేకప్‌లో ఉన్న నిన్ను ఎలాగో చూడగలిగాను. అంతే చాలు" అని ఆగి చెప్పాడు. "ఈరోజు నీకు చాలా పొగడ్తలు లభించాయని చెప్పావు చూడు. ఆ పొగడ్తలని మాత్రం మనసులోకి రానివ్వకు. అవే మనిషిని అహంకారపూరితుడిని చేస్తాయి. ఆ అహంకారమే పతనమనే దిగుడు బావికి మొదటిమెట్టు! అంతే కాదు. ఈరోజు నీ చుట్టూ మూగారు చూడు... వారందరూ నిజమైన శ్రేయోభిలాషులు అనుకోకు. తీపి చుట్టూ చీమలు చేరినట్లే, విజయం చుట్టూ మనుషులు మూగుతారు. ఎప్పుడయితే నువ్వు విజయానికి దూరమౌతావో అప్పుడే ఆ మనుష్యులూ నిన్ను వదిలేస్తారు. అది గుర్తుంచుకో"

అతడు తలాడించాడు.

కొద్దిసేపు మాట్లాడాక తన జేబులో నుండి ఓ నోట్లకట్ట తీసి ఆయనకు అందించి వచ్చేశాడు అరుణ్.

'కృతజ్ఞత'... ఈ సినిమారంగంలో అరుదుగా కనిపించే విషయం అది.

★ ★ ★

ఆ రోజు షూటింగ్ గ్యాప్‌లో అరుణ్ రాజేశ్వరి కూర్చుని ఉన్నవైపు నడుస్తుంటే, ద్వారకానాథ్ పిలిచాడు.

"అరుణ్"

అతడు తలతిప్పి ఆయనవైపు చూసి అటుగా నడిచాడు.

ఆయన కుర్చీలో కూర్చుని ఉన్నాడు. పక్కనే మరో రెండు కుర్చీలలో నిర్మాతలు కూర్చుని ఆయన వైపుకు వంగి ఏదో వింటున్నారు. అతడు ఆయన దగ్గరగా వెళ్ళి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

"ఏమిటి సార్?"

"ఈరోజు పేపర్ చూశావా?" అడిగాడు.

"చూడలేదు సార్" చెప్పాడు అతడు. "ఏమిటి సార్ విశేషం?"

"నరేంద్ర సినిమాకి ఈరోజే ప్రారంభోత్సవం"

"అలాగా సార్"

అతడు ఆ సినిమాను జనవరి నెలలో రిలీజ్‌చేస్తానని అనౌన్స్ చేశాడు.

అతడు అది తనకు సంబంధించిన విషయం కాదన్నట్టు మౌనంగా ఉండిపోయాడు.

"మనం మన సినిమాను ఫిబ్రవరిలో రిలీజ్ చెయ్యాలనుకున్నాం. కాని మనం మరింత త్వరగా పూర్తిచేసి జనవరిలోనే రిలీజ్ చెయ్యాలనుకుంటున్నాం"

"మీ ఇష్టం సార్"

"మన ప్రొడ్యూసర్స్ డేటు కూడా ఫిక్స్ చేసుకున్నారు. జనవరి ఆరున మన సినిమా రిలీజ్ చేద్దామని నిర్ణయించేసాము"

'జనవరి ఆరు...

అతడు కొద్దిక్షణాల మాటలే రానట్టు నిలబడిపోయాడు. జనవరి ఆరు... సినిమా హీరో అవుతానని తాను పందెంకాసిన రోజు! సరిగ్గా సంవత్సరం తరువాత అదే రోజున తన సినిమా రిలీజ్‌కావడం యాధృచ్ఛికమే కావచ్చుగానీ, అపరిమితానందం కలిగించే విషయం అది! తాను సంపూర్ణంగా విజయం సాధించానని చెప్పేందుకు బావుటా ఎగరవేయడంలాంటిది... జనవరి ఆరున తన చిత్రం విడుదల కావడం... అంటే!

"మాట్లాడవేం అరుణ్?" అడిగాడు ద్వారకానాథ్.

ఆనందం అర్ణవమైతే మాటలెలా




వస్తాయి! అయినా గొంతు పెగల్చుకుని అతడు పలికాడు "జనవరి ఆరునే రిలీజ్ చేయండి సార్"

ద్వారకానాథ్ తలాడించాడు. సినిమా రిలీజ్ డేట్ నిర్ణయించుకునేది నిర్మాత, దర్శకులు. హీరోకి ఆ డేట్‌తో అవసరం లేదు. అయినా అలా చెప్పడం తమ ధర్మంగా భావించడం ఇండస్ట్రీలో వస్తున్న ఆచారం.

అక్కడ కూర్చున్న నిర్మాతలలో ఒకతను అన్నాడు "అరుణ్! ఈరోజు పేపర్‌లో మీగురించి కూడా రాసి ఉంది. ప్రతి సీన్ ఫస్ట్ టేక్‌లోనే ఓకే కావడం చూసి సినిమాజనం మరో మహానటుడు ఇండస్ట్రీకి దొరికాడు అనుకుంటున్నట్టు రాశారు. మరో పది పదిహేను రోజులలోనే మీకు చాలా అవకాశాలొచ్చేస్తాయి"

అరుణ్ మాట్లాడలేదు. నవ్వి ఊరుకున్నాడు. ఆ క్షణం ద్వారకానాథ్ అతడి ముఖంలోనికి చూశాడు. ఆయనకు అతడి 'మనసులోని మాట' తెలుసు. అయినా గంభీరంగా ఉండిపోయాడు.

అరుణ్ లేవబోతుంటే, ద్వారకానాథ్ చెప్పాడు "అరుణ్: రేపటినుంచి హాసిని కాంబినేషన్‌తో తీయబోయే సీన్స్ ఉంటాయి. ఆమె ఆర్టిస్టులని డామినేట్ చేసేలా నటిస్తుందని చాలా మంది అంటుంటారు. ఆమె పక్కన నటించడం అంటే మిగతా సీన్స్‌లో నటించడంలా కాదు. చాలా... చాలా జాగ్రత్తగా ఉండాలి"

అరుణ్ మౌనంగా తలాడించాడు. ఆ క్షణం అతడి కన్నుల ముందు హాసిని కదలాడింది. చాలాకాలం తర్వాత రేపు తిరిగి ఆమెను చూడబోతున్నాడు.

హాసిని... తనలో హీరోని చూసిన మొదటి వ్యక్తి! తనను ఆప్యాయంగా పలకరించి ఆ ఆప్యాయత ప్రదర్శించినందుకు తను బాధపడిన వ్యక్తి... ఆరోజు ఆమె ఇంటికెళ్ళి వచ్చాక తిరిగి ఆమెను చూడడం కూడా కుదరలేదు. ఆమెను రేపు తిరిగి చూడబోవడమే కాదు, ఆమెతో కలిసి నటించబోతున్నాడు.

ఎందుకో తెలియదు... గానీ రేపు చాలా థ్రిల్ ఎదురుకాబోతుందనిపించింది అతడికి.

అతడు వారిదగ్గరనుంచి లేచి రాజేశ్వరి వైపు నడిచాడు.

గత రెండు రోజులుగా రాజేశ్వరి షూటింగ్ చూస్తానంటే, ఆమెను వెంటపెట్టుకు వస్తున్నాడు. షూటింగ్ స్పాట్‌లో రాజేశ్వరి ఓ మూలగా కుర్చీలో కూర్చుని అతడి నటన గమనించేది.

అతడు ఆమె దగ్గరకువెళ్ళి కుర్చీలో కూర్చుని చెప్పాడు, "నేను నా అపజయం గురించి కొంత భయపడుతూ ఉన్నాను. కాని ఈ రోజు ఆ అపజయం గురించి అసలు ఆలోచించనవసరం లేకపోయింది"

"ఏమంటున్నావ్ బావా? "

"సరిగ్గా మన పందెం గడువు ముగిసే రోజు... జనవరి ఆరవ తారీఖునే ఈ సినిమా రిలీజ్ కాబోతోంది. అదే జరిగితే నేను సంపూర్ణ విజయం సాధించినట్టు... నేను గెలుస్తాను!"

అది షూటింగ్ స్పాట్ కాకుండా, తమ చుట్టూ కనీసం మనుషులు లేకున్నా ఆ క్షణం ఆమె అతడికి ఓ మంచి బహుమతి అందించి ఉండేది.

అతడు మాత్రం కుర్చీలో వెనక్కువాలి కళ్ళు మూసుకున్నాడు. ప్రశాంతమైన ఆ ముఖం చాటున ఎన్నెన్ని ఆలోచనలో? !

మర్నాడు...

హాసిని కారు దిగి సెట్‌లో అడుగుపెట్టడంతోనే నలువైపులా చూసింది.

రాజేశ్వరి పక్కనే కూర్చుని ఉన్న అరుణ్ ఆమెను చూడడంతోనే చిరునవ్వుతో లేచాడు.



హాసిని అతడివైపు అడుగువేయబో యింది. కానీ... ఓ చెయ్యి తనను పట్టి ఆపడంతో తలతిప్పి చూసింది. ఆ వ్యక్తి... ప్రభూ!

హాసిని అడుగు ముందుకు వేయలేకపో యింది.

రాజేశ్వరి తన బావకేసి, హాసినికేసి మార్చిమార్చి చూసింది. హాసిని అంటే ఆమెకు అసలు సదభిప్రాయమేలేదు. ఇలాంటి వారి గురించి తను ఎంతో విని ఉంది. అలాంటి ఆమె తన బావకేసి చూసిన చూపులు ఆమె గమనించింది.

ద్వారకానాథ్ హాసినిని రిసీవ్ చేసుకు న్నాడు. ఆమె మేకప్ రూమ్‌లోకెళ్ళిపో యింది.

ధనరాజ్ అరుణ్ దగ్గరగా వచ్చి సీన్ వివరించడం మొదలుపెట్టాడు. "హాసిని ఓ వ్యభిచారి. ఆమె హీరో వేసే పెయింటింగ్స్ చూసి అతడిని ఇష్టపడుతుంది. ఈ సీన్‌లో అతడిని గట్టిగా కౌగలించుకుని 'ఐ లవ్‌యూ రాజా' అంటుంది. హీరో ఆమెను విదిలించుకుని 'నీలాంటి ఆడది నన్ను ముట్టుకుంటే నాకు తేళ్ళూ, జెర్రులు పాకిన ట్టుంది' అంటాడు..."

అరుణ్ సీన్‌ని శ్రద్ధగా విన్నాడు. ఆ తర్వాత కళ్ళు మూసుకుని మరోలోకంలోకి వెళ్ళిపోయినట్టు కాసేపు మౌనంగా ఉండిపో యాడు.

అతడు ఆ పాత్రలోకి పరకాయప్రవేశం చేస్తున్నట్టు అర్థంచేసుకుంది రాజేశ్వరి. ఆ సమయంలో అతడిని డిస్టర్బ్ చేయడం ఇష్టంలేకపోయింది. లేకపోతే 'హాసిని నిన్ను గట్టిగా కౌగలించుకోవడం నాకేదోలా ఉంది బావా' అని చెప్పాలనిపించింది. తను దూరంగా ఉండి ఏవేవో ఊహించుకుంది గానీ ఇక్కడ హీరోలు ఇష్టమున్నా లేకపో యినా అవసరపడితే ఎలాంటి ఆడదాన్న యినా కౌగలించుకోవాలి. అది నటనే కావచ్చు మరొకడి కాళ్ళకు నమస్కరిం చాలి... తన బావ అలాంటి పనులు చేయడం ఇప్పుడిప్పుడే ఆమె మనసులో వ్యతిరేకత చూపుతోంది.

హాసిని మేకప్ చేసుకుని వచ్చాక షూటింగ్ మొదలయింది.

అరుణ్ కేన్వాస్‌ముందు నిలబడి ఉన్నాడు. కెమెరా హాసినినే క్లోజప్‌లో చూస్తోంది. ఆమె అడుగులో అడుగువేసు కుంటూ అతడివైపు నడిచింది. అప్పుడు తిరి గింది కెమెరా అతడివైపు... ఇప్పుడు ఇద్దరూ కెమెరా వ్యూలోనే ఉన్నారు.

హాసిని అతడి వెనుకగా వచ్చి మెడ చుట్టూ చేతులువేసి తల అతడి మెడ వంపులో దాచుకుంది. అతడు కొద్ది క్షణాలు ఆమె స్పర్శను కూడా గమనించనంత ఏకా గ్రతలో ఉన్నాడు.

ఆ తర్వాత రంగులు కలుపుకోవడం కోసం కొద్దిగా వంగిన అతడికి మొదటిసా రిగా స్పర్శ తెలిసిందేమో, అదిరిపాటుతో ఆమెవైపుకు తిరిగి ఆమెనుండి దూరంగా రెండడుగులు వెనక్కువేశాడు.

"కట్" అన్నాడు ద్వారకానాథ్. "ఓ.కే! నెక్స్ట్ షాట్ రెడీచెయ్యండి!"

కెమెరా యాంగిల్ మార్చాక సీన్ కంటిన్యూ అయింది.

"రాజా!... నేను నిజంగా నిన్ను ప్రేమిస్తు న్నాను రాజా" ఆమె రెండడుగుల దూరాన్ని చప్పున అధిగమించి అతడిని ఎదుటినుంచి కౌగిలించుకుంది.

అరుణ్ తన పాత్రలో జీవించి ఉన్నాడు గానీ, అతడు కాసింత గమనించి ఉంటే ఆమె నటనలోని 'ఎమోషన్' అర్థమయి ఉండేది. ఒకవేళ ఆ ఎమోషన్ అర్థమ యినా అతడు నటన అనుకుని ఉండేవా డేమో! అది కూడా చెప్పలేం.

ఆమె ఆర్తిగా అతడిని కౌగిలించుకుంది. "ఐ లవ్ 'యూ రాజా... రియల్లీ ఐ లవ్ యూ..." ఆమె కళ్లలో నీళ్ళు సుడులు తిరు

గుతున్నాయి. ఆమె బలంగా మరింత బలంగా అతడి గుండెలలో ఒదిగిపోవాలన్న తాపత్రయం కనపరుస్తూ... అతడిని నలిపేస్తుంటే...

రాజేశ్వరి మాత్రం ఆ సీన్ చూడలేక తల తిప్పుకుంది.

"కట్" అన్నాడు డైరెక్టర్.

అయినా ఆమె అతడిని వదల్లేదు. ఎమోషన్‌నుండి ఇంకా బయటకు రాలేదేమో అనుకున్నారు యూనిట్ లోని వారంతా.

"మేడమ్... మేడమ్..." యూనిట్‌లోని వారంతా తమవైపే చూస్తుండడంతో ఆమె వడివడిగా గడ్డం వ్యక్తివైపు నడిచింది.

అరుణ్ రాజేశ్వరి దగ్గరగా వెళ్ళాడు.

అతడు ఆమె దగ్గర కూర్చున్నాక "బావా! అది... అది నిన్ను మరీ అంత గట్టిగా కౌగిలించుకుంటుందేమిటి? " అసహనంగా అడిగింది రాజేశ్వరి.

"ఈ ఇండస్ట్రీలో ఇలా కౌగిలించుకోవడమే కాదు. అవసరపడితే ముద్దులు కూడా పెట్టుకోవాలి" నవ్వుతూ అన్నాడు అతడు.

ఆమె మనసులో అదోలాంటి ఇబ్బందికరమైన ఫీలింగ్ మొదలయింది అప్పుడే. ఆ ఫీలింగ్ మునుముందు పెరిగిపెద్దదయి తనను మరింత బాధపెడుతుందని ఆమెకు ఆక్షణమే అర్థమైంది.

★ ★ ★

అదే రోజు,

అర్ధరాత్రివేళ చప్పుడయితే రాజేశ్వరి వెళ్ళి తలుపు తీసింది.

ఎదురుగా హాసినిని చూసి అదిరిపడింది. మనసులో ఆమె పట్ల ఏ భావమయినా ఉండొచ్చుగానీ, అదే వ్యక్తి ఎదుటపడితే ఆ మనసులోని భావాన్ని ప్రదర్శించడం సాధ్యం కాదు.

"మీరు... మీరు..."

"నన్ను ముందు లోపలికి రానివ్వు. ఆ తర్వాత అన్ని విషయాలూ చెబుతాను" హాసిని కంఠం వణికిపోతోంది. అప్పటికే ఆమె శరీరమంతా స్వేదం అలముకుని ఉంది.

రాజేశ్వరి విస్మయంగా చూస్తూ అప్రయత్నంగానే వాకిలికి అడ్డం తొలిగింది.

చప్పుడు వినిపించి మెలకువ రావడంతో తిరుపతి, అరుణ్‌లు పడకలమీదనుండి లేచి హాలులో కొచ్చారు.

అప్పటికే ఆమె హాలులోని సోఫాలో కూర్చుని రొప్పుతోంది.

అరుణ్ ఆమెకు దగ్గరగా వెళ్ళికాసింత దూరంలో కూర్చుని "హాసినీ! ఈ వేళప్పుడు... ఇలా... అసలేమయింది? " మెల్లగా ప్రశ్నించాడు.

ఆమె చప్పున తల పైకెత్తింది. "ఇప్పుడు నన్నేం అడగొద్దు అరుణ్! ప్లీజ్ కాసేపు ప్రశాంతంగా పడుకోనివ్వండి... ప్లీజ్"

అరుణ్ మరేం మాట్లాడలేదు. మౌనంగా రాజేశ్వరికేసి చూశాడు. ఆమె ముఖంలో అనీజీనెస్ గమనించాడు. తిరుపతికేసి చూస్తే అతడిముఖంలో హాసినిపట్ల, జాలి కదలాడుతోంది.

నెమ్మదిగా లేస్తూ అరుణ్ పలికాడు "ఆల్ రైట్ హాసినీ! నువ్వు... అదిగో ఆ బెడ్‌రూమ్‌లోకెళ్ళి పడుకో"

హాసిని వడివడిగా అటు వెళ్ళిపోయింది.

అక్కడ కొద్దిక్షణాలు నిశ్శబ్దం! గాఢమైన నిశ్శబ్దం...

వారిద్దరూ మరేం మాట్లాడేలా లేరని గ్రహించి అతడే తిరుపతిని అడిగాడు "హాసిని ఇంతరాత్రివేళ ఇలా ఎందుకొచ్చినట్టు? "

"వాడి హింస తట్టుకోవడం కష్టమయి ఉంటుంది. ఇంట్లోంచి బయటకొచ్చేసాక, మరెక్కడికెళ్ళాలో అర్థంకాక తిన్నగా ఇక్కడికి వచ్చి ఉండొచ్చు"

అప్పటివరకూ రాజేశ్వరికి హాసిని పరిస్థితి ఏమిటో తెలియదు. తిరుపతి మాటలు విన్నాక ఆమె అనుమానంగా "హాసిని పరి

స్థితి ఏమిటి? " అడిగింది.

అరుణ్ మౌనంగా ఏదో ఆలోచించు కుంటూ ఉండిపోతే, తిరుపతి హాసిని గురించి తనకు తెలిసినదంతా చెప్పాడు. అతడి మాటలు వింటున్నకొద్దీ ఆమె ముఖంలో రంగులు మారసాగాయి. ఆమె ఊహించుకుంటున్న హాసిని వేరు, ఇప్పుడు తెలుసుకుంటున్న హాసిని వేరు... అంటే చూపులతో కవ్వించి, వొళ్ళంతా చూపించి సొమ్ముచేసుకుంటుందన్న హాసిని వెనుక ఇంత వ్యధ ఉందా? ... అదో నమ్మలేని నిజంలా అనిపించిందామెకు.

వారంతా కొద్దినిముషాల పాటు హాలు లోనే కూర్చుండిపోయారు.

"సరే ఇక పడుకుందాం" అరుణ్ అన్నాడు. మిగిలిన ఇద్దరూ తలలాడించారు.

తిరుపతి తన గదివైపు వెళ్ళిపోయాడు.

రాజేశ్వరి తన రూమ్ వైపు వెళ్ళబోతూ యధాలాపంగా అటు చూసింది. హాసిని తనగదికి లోపల గడియవేసుకోలేదు. ఆమె అటువైపుగా వెళ్ళి తలుపు దగ్గరగా లాగ బోతూ, ఆమె నిద్రపోయిందో లేదోనని అటుగా చూసింది.

ఒక్కక్షణం... తనువంతా కదలిపోగా తన కళ్ళను తానే నమ్మలేనట్టు విభ్రాంతితో అటు చూసింది. ఏం చేయాలో తోచలేదు. తనకు తెలిసిన నిజం మనసును పిప్పిచేస్తోంది. ఆమె వెళ్ళి అరుణ్ గది తలుపు తట్టింది.

అప్పుడే బెడ్‌మీదకు చేరి దుప్పటి కప్పుకోబోతున్న అరుణ్, ఆ శబ్దానికి తల తిప్పి చూసి "ఏంటి రాజీ? " ప్రశ్నించాడు.

"బావా!... నువ్వు... నువ్వొక్కసారి ఇలా వస్తావా? "

అతడు ఆమెను ఓసారి అదోలా చూసి ఆమెను అనుసరించాడు. రాజేశ్వరి అతడి చెయ్యి పట్టుకుని హాసిని పడుకుని ఉన్న రూమ్‌వైపు నడిపించింది.

ఆ బెడ్‌రూమ్ చేరుకున్నాక ఆమె ఆవైపు చూపుడువేలు చూపించింది. అతడు అటు చూశాడు. మొదట కళ్ళు పెద్దవయ్యాయి. ఆ తరువాత ఆసరాకోసం తలుపును పట్టుకోవలసి వచ్చింది.

అరుణ్ ముఖంలోని ఫీలింగ్స్ చూసింది రాజేశ్వరి. అతడి నడుముచుట్టూ చేయిపోనిచ్చి బలవంతంగా వెనక్కు తిప్పుతూ "పద బావా" అంది. అతడు వెనుదిరిగాడు.

ఇద్దరూ హాలులోకొచ్చి కూర్చున్నారు.

"పాపం!... ఆమె వంటినిండా ఆ వాతలు... దెబ్బలతో కమిలిపోయి... ఇదంతా ఆమెను ఉంచుకున్న వ్యక్తే చేసి ఉంటాడు కదా బావా? "

అతడు నెమ్మదిగా తలాడించాడు.

"మరి ఈమేమో లక్షలు సంపాదిస్తుంది. ఒక విధంగా అతడిని పోషించేది కూడా ఈమేనట కదా? మరి అతడు ఈమెనిలా హింసపెడుతుంటే ఎలా భరిస్తోంది? ఈమెకాఅవసరం ఏమిటి? అతడిని వదిలించుకోవచ్చు కదా? "

అతడి కళ్ళముందు మాత్రం అదే దృశ్యం కదలాడుతోంది. రెండు నిమిషాలక్రితం తను చూసిన ఆ దృశ్యం... హాసిని చీర పిక్కలపైదాకా తొలిగిపోయి ఉంది. తెల్లని ఆమె శరీరరంపైన సిగిరెట్ పీకలతో కాల్చిన మచ్చలు, దంతక్షతాలు... అందరినీ కవ్వించే, కైపెక్కించే హాసిని వెనుక ఎంత విషాదం దాగిఉందో పూర్తిగా తెలిసిన క్షణాలవి!

"ఏమిటి బావా ఆ ఆలోచనలు? నేనడిగిన దానికి సమాధానం చెప్పవేం? "

అతడు విషాదంగా నవ్వాడు. "తెరమీద మెరిసిపోతూ కనిపించే తారల వెనుక కనిపించని చీకటి జీవితాల గురించి కొద్దిగా కూడా తెలియని దానివి... వద్దు! నీకున్న ఆ భ్రమనే నిన్ను సంతోషపెడుతూ ఉంటే, ఆ భ్రమలోనే ఉండిపో... తెలుసుకుంటే

బాధ తప్ప మరేం మిగలదు..."

అతడు చప్పున లేచి తన గదిలోకి వెళ్ళిపోయాడు. ఆ గది తలుపు మూసుకుపోయింది. రాజేశ్వరి హాలులో మిగిలిపోయింది.

...ఇదో విచిత్రప్రపంచం. దూరానికే అద్భుతంగా కనిపించింది. దగ్గరగా వచ్చాకే ఈ రంగంలోని వాస్తవమేమిటో అర్థమవుతుంది.. తెర వెనుక బతుకులోని అసలైన కష్టాలేమిటో ఇప్పుడిప్పుడే తెలుస్తున్నాయి. మేడిపండులాంటి ఈ రంగంలోకి తనకుతానుగా బావను పంపించింది... వీల్లేదు. బావను వెనక్కు తీసుకువెళ్ళిపోవాలి! కృత్రిమ విలువలతో నిరంతరం ద్వంద్వ ప్రవృత్తితో బతికే ఈ మనుష్యులకు దూరంగా, నిర్మలమైన మనసులతో, ఆప్యాయత రంగరించి మాట్లాడే వాళ్ళున్న ఆ పల్లెకే తన బావను తీసుకువెళ్ళాలి'

రాజేశ్వరి మెల్లగా తన రూమ్‌లో కెళ్ళి బెడ్‌మీద వాలిపోయింది. కాని నిద్రమాత్రం ఎంతకీ రాలేదు. పక్కమీద అటు ఇటు ఎంతోసేపు పొర్లింది.

తెల్లవారు ఝామున ఇక నిద్రపట్టదని తెలిసిపోయాక తన గదిలోనుండి హాలులోకి వచ్చింది రాజేశ్వరి. సోఫాలోకూర్చుని తల వెనక్కు వాల్చింది. అప్పుడు... అప్పుడు ఆమె చూపు అటు ప్రసరించింది. కొద్దిక్షణాలు కన్‌ఫ్యూజింగ్‌గా అనిపించింది. రాత్రి హాసిని రూమ్‌కి తలుపు దగ్గరగా లాగినట్టు గుర్తు.. మరిప్పుడు ఆ గది తలుపు బార్లా తెరిచి ఉంది... ఆమె అపనమ్మకంగానే అటువైపు నడిచింది.

తలుపు దగ్గరగా వెళ్ళాక చూస్తే హాసిని బెడ్ ఖాళీగా కనిపించింది. ఆమె గదిలో నుండి బయటకు నడవబోతూ చివరిసారిగా బెడ్‌వైపు చూస్తే కనుపించిందా కాగితం! దిండు కింద ఉండినా, కనిపించేలా పెట్టబడి ఉంది. వణికే చేతులతో ఆ ఉత్తరం అందుకుంది. మెల్లగా మడతలు విప్పింది.

"డియర్ అరుణ్."

రాజేశ్వరి కళ్ళు పెద్దవయ్యాయి. ఆమె కళ్ళు అక్షరాల వెంట వేగంగా పరిగెత్తడం మొదలుపెట్టాయి.

ఈ ఉత్తరం నీ చేతిలో పడేసరికి బహుశా నేను ఈ లోకాన్ని వదిలి ఉండొచ్చు. కొన ఊపిరితో కాకుండా నేను శాశ్వత నిద్రలోకి వెళ్ళిపోయాకే ఈ ఉత్తరం నీ కంటపడాలని కోరుకుంటున్నాను.

నీకు తెలుసా అరుణ్! వయసొచ్చాక సినిమా పత్రికల్లో సినిమా హీరోయిన్లను చూసి నేను వారిలా కీర్తిప్రతిష్టలు సంపాదించుకోవాలని కలలుకనడం మొదలుపెట్టాను. అతికష్టంమీద ఈ ఇండస్ట్రీ దగ్గరగా వచ్చాకే నాకు ఈ ఇండస్ట్రీలోని ఎక్స్‌ప్లాయిటేషన్, ఆడదాన్ని కేవలం ఓ అందమైన బొమ్మలా, అనుభవానికి పనికొచ్చే వస్తువులా చూడడం అర్థమయింది. అప్పటికే నేను ముందడుగు వేసి ఉండడంతో వెనకడుగు వేయడం ఇష్టంలేక అవకాశం కోసం సర్వం సమర్పించడానికి సిద్ధమయ్యాను. ఈ శరీరంతో ఎంతోమంది ఎన్నోరకాలుగా ఆడుకున్నారు, వాడుకున్నారు. చివరికి ఈ ఇండస్ట్రీలో మగాడి తోడు లేకుండా బతకడం కష్టమని తెలిసి ఓ మగాడిని నమ్ముకున్నాను. కాని ఈ ఇండస్ట్రీలోని ఆడవారి మీద అందరికీ ఉండే అభిప్రాయమే ఉంచుకున్న వాడికీ ఉంటుంది. తనదీ అనుకున్న వస్తువు అందరి చేతులు మారిందని తెలిస్తే ఏ మగాడూ భరించలేడు. సినిమా తారల బతుకులు బండలయ్యేది ఈ అంశంలోనే తెలుసా అరుణ్.

ఈమధ్య కాలంలో నేను ఎన్నో కష్టాలు అతడివలన ఎదుర్కోవలసి వచ్చింది. మాటలతో మానసికంగా హింసించేవాడు. ఇదిగో నిన్న.. నీతో కలిసి నటిస్తూ నన్ను నేను మరచిపోతే అడ్డమైన మాటలు అనడంతో నేను ఎదురు తిరిగాను. నన్ను అన్నాడని

కాదు అరుణ్! నిన్ను గంజాయివనంలో తులసిమొక్కలా కనిపించే నిన్ను అన్నాడనే ఎదిరించాను. ఫలితంగా సిగరెట్ పీకతో వళ్లంతా గాయాలు చేశాడు. రేపు మేకప్ సమయంలో ఈ గాయాలు బయటపడుతాయి. అందరి జాలి చూపులూ నేను భరించాలి.. భరించొచ్చు కానీ నేనింకా బతకడం అవసరమా? నేను బతికి ఎవరిని ఉద్ధరించాలి? అందుకే... ఈ నిష్క్రమణ! ఈనా నిష్క్రమణవలన నీ తొలి చిత్రానికి ఏ ఇబ్బందీ రాదు. నా వంతు షూటింగంతా దాదాపు అయిపోయింది.

ఇదంతా నీకే ఎందుకు చెపుతున్నానో తెలుసా అరుణ్... చెప్పానుగా గంజాయివనంలో తులసి మొక్కలా నువ్వు కనిపించావని"

ఆ తర్వాత ఇక చదవలేకపోయింది రాజేశ్వరి. ఒక్క అంగలో అరుణ్ గది దగ్గరకు చేరి తలుపు తట్టింది. అతడు తలుపు తీయగానే తన చేతిలోని ఉత్తరం అతడి చేతిలో పెట్టింది.

ఒకటీ... రెండు మూడు నిముషాలు. అతడు చదవడం పూర్తిచేసి ఉత్తరం జేబులో పెట్టుకుంటూ దీర్ఘంగా నిట్టూర్చాడు. ఆ తర్వాత ఒక్కక్షణం... ఒక్క క్షణం మాత్రమే ఆలోచించి వెళ్లి తిరుపతిని నిద్రలేపాడు. "ఏమిటి గురూ! ఏమయింది? "

"విషయం తర్వాత.. ముందు హాసిని ఇంటికి వెళ్దాంపద"

"హాసిని ఇక్కడే కదా పడుకుం..."

అతడిమాటలు మధ్యలోనే కట్ చేస్తూ "వెళ్లిపోయింది" అంటూ బయటకు నడుస్తుంటే తిరుపతికి అనుసరించక తప్పలేదు.

ఇద్దరూ గేటు దాటి రోడ్డుమీదకు వచ్చారు.

"నీకు హాసిని ఇంటి ఫోన్ నెంబర్ తెలుసా? "

"తెలుసు"

"నేనిప్పుడు ఫోన్ చెయ్యాలి"

"అదిగో... ఆ సెంటర్‌లోనే యస్‌టిడీ బూత్ ఉంది"

అరుణ్ ఆవైపు వడివడిగా నడిచాడు. తిరుపతి నెంబర్ చెబుతుంటే డయల్ చేశాడు.

అవతలివైపు ఫోన్ ఎంగేజ్... మరో నిముషం ఆగాక చేస్తే.. అదే పరిస్థితి.

అప్పుడొచ్చిందతనికి ఆ అనుమానం... ఆమెముందు జాగ్రత్తతో రిసీవర్ తీసి పక్కనపెట్టేసిందా? ఆ ఆలోచనే అతడిని భయపెట్టింది.

అతడు రిసీవర్ హుక్‌మీద పెట్టేసి బయటకొచ్చాడు. చుట్టూ చూస్తే ఎక్కడా ఆటో కూడా కనిపించలేదు. "ఫాలోమీ" అనేసి అతడు ముందుకు పరిగెడుతుంటే వెనుక తిరుపతి కూడా పరిగెత్తక తప్పలేదు.

ఇంచుమించు ఒక కిలోమీటరు పరుగెత్తాక వారిద్దరికీ అలసట వచ్చింది. తిరుపతి "గురూజీ! కాసేపు కూర్చుని వెళ్దాం" ఓ చోట రోడ్డుమీదనే కూర్చుంటూ అన్నాడు.

"అయితే నువ్వు అలసట తీర్చుకున్నాక హాసిని ఇంటికి వచ్చెయ్యి. ఈ లోగా వెంటనే పోలీసులకు ఫోన్ చేసి హాసిని ఇంటికి రమ్మను"

తిరుపతి తలూపాడు.

అరుణ్ ముందుకు పరుగెత్తాడు.

హాసిని ఇంటికి చేరుకునేసరికి మరో పది నిముషాలయ్యాయి.

గేటు తెరిచే ఉంది. అతడు వేగంగా మెట్లెక్కి పై పోర్షన్‌లోకెళ్లాడు.

ముందుగది తలుపు వేసిఉంది. కాలింగ్ బెల్ నొక్కాడు. చప్పుడు లేదు. అలాగే కాలింగ్‌బెల్ మీద చెయ్యి ఉంచాడు.

తలుపు తీస్తున్న చప్పుడయింది. ఎదురుగా చూస్తే పనికుర్రాడు.

ఆ వేళప్పుడు ఏదో కొంప మునిగిపోయినట్టు వచ్చిన అతడిని చూసి "ఏం కావాలి




సార్" అడిగాడు పనికుర్రాడు కాసింత ఆశ్చర్యంగా, మరికొంత విసుగుతోనూ.

"మీ అమ్మగారెక్కడ? " సూటిగా అడుగుతూనే చుట్టూ చూశాడు. బెడ్‌రూమ్ ఎక్కడుందో అతడికి తెలుసు. ఆ గది తలుపు మూసి ఉంది.

"అమ్మగారు గంట క్రితమే ఎక్కడినుంచో వచ్చారు. ఆ బెడ్‌రూమ్‌లో ఉన్నారు"

"మీ అయ్యగారు? "

"ఆయన గంటక్రితం వరకూ హాల్లోనే ఉన్నారు. అమ్మగారు వచ్చాక ఎక్కడికెళ్లావంటూ ఆమెను తిట్టి తన గదిలోకి వెళ్లిపోయారు"

అరుణ్ ఒక్క ఉదుటున ఆమె బెడ్‌రూమ్ దగ్గరకి వెళ్లి తలుపు నెట్టాడు. లోపల గడియవేసి ఉంది. తలుపు మీద దబదబ చప్పుడు చేశాడు.

అప్పుడే తిరుపతి అక్కడికి చేరుకున్నాడు. ఆ వెనుకే పోలీస్ జీప్‌వచ్చింది. అందరూ అక్కడ కనిపించిన దృశ్యం చూసి కాస్త అయోమయానికి గురయ్యారు.

అరుణ్ ఆమె బెడ్‌రూమ్ తలుపుమీద పిచ్చిపట్టిన వాడిలా కొడుతూ "హాసినీ! ప్లీజ్! తలుపు తియ్యి" అంటూ అరుస్తున్నాడు.

తిరుపతి అతడి దగ్గరగా వచ్చి భుజం మీద చెయ్యివేసి అడిగాడు "అరుణ్ ఏమైందసలు? "

పనికుర్రాడు చూపుల్లోనూ అదే భావం. అయితే ఆ కుర్రాడు అడిగే ధైర్యం చేయలేక ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

ఆ చప్పుడుకి మెలుకువచ్చింది కాబోలు గడ్డం వ్యక్తి తలుపు తీసుకుని హాలులోకి వచ్చాడు. అరుణ్ చేస్తున్న పనిని చూసి "ఏయ్ మిస్టర్! ఏం చేస్తున్నావ్? ఏమైంది నీకు? " అరిచినట్టుగా అన్నాడు.

అప్పటి వరకూ మనసులో దాచుకున్న ఆతృత ఆవేశంగా రూపుదిద్దుకుంది కాబోలు, అరుణ్ చప్పున అతడివైపు తిరిగి షర్ట్ పట్టుకుని గుంజేస్తూ చెప్పాడు.

"నువ్వు...నువ్వు పెడుతున్న చిత్రహింసను తట్టుకోలేక హాసిని తను ఆత్మహత్య చేసుకోబోతున్నట్టు ఉత్తరం రాసిందిరా ఆమె ఆ గదిలో బతికి ఉందోలేదో కూడా తెలీదు"

ఆ వ్యక్తి ముఖం వెలవెలా బోయింది.

ఆ మాటలు వినడంతోనే తిరుపతి వంట గదిలోకి వెళ్లి రోకలిబండ తీసుకువచ్చి పోలీసులకేసిచూశాడు. మరుక్షణం గడియ ఉన్న దగ్గర బలంగా నాలుగు దెబ్బలు వేసేసరికి తలుపుకు చెయ్యి పట్టేంత కన్నం ఏర్పడింది. ఆ సందులో నుండి చెయ్యిపెట్టి తిరుపతి గడియతీశాడు.

అందరూ ఒక్కసారిగా లోపలికి అడుగు పెట్టారు. అప్పటికే ఆలస్యమయిపోయింది.



ఎర్రని అగ్నికీలలు...

ఒక అపురూప సౌందర్యాన్ని తమలో లీనం చేసుకుంటున్నాయి.

అతడి మనసులో బాధలేదు.

అలా అని హాసిని మరణం అతడిని కదిలించక పోనూలేదు.

అతడు విపరీతంగా చలించిపోవడం వలననే బాధను మించిన స్థబ్దత అతడిని ఆవరించిందేమో!

అతడు దహనస్థలిలో నిశ్శబ్దంగా నిలబడి ఉన్నాడు.





చుట్టూ సమాధులు...!

ఏ సమాధికి మాటలొచ్చినా ఎన్నో జీవి తసత్యాలు చెప్పగలవు.

ఎంత గొప్పవాడయినా స్వర్ణతల్పం మీద పవళించగల కోటీశ్వరుడైనా ఆ చోట నేలలో పడుకోవలసిందే.

నిన్నటి వరకూ అతి సున్నితంగా చూసుకున్న శరీరం, నేలలో చీకిపోయి శిథిలం కావలసిందే.

మరి కీర్తి మాత్రం? శాశ్వతమా? కొద్ది రోజులు తలుచుకుంటారు, మహా అయితే చరిత్ర పుటల్లో ఘనకీర్తి కలవాడిగా కొద్ది తరాలు స్మరించవచ్చు. తరతరాలూ గుర్తుపెట్టుకోరుకదా!

అంతెందుకు... నీ సంపాదనను, కీర్తిని వారసత్వంగా చేసుకుని అనుభవించే సతీసుతులే నీ వెంట స్మశానం వరకూ వస్తా

రంతే.

ఇంత తెలిసీ ఓ మానవుడా! ఎందుకు నీకింత ఆరాటం.. కీర్తి, కనకాలకోసం పోరాటం..

మరణించాకే తెలిసిన నిజాన్ని సమాధులు తనకు చెపుతున్నట్టుగా అనిపించింది అరుణ్‌కు.

ఆకాశంమీద చీకటి పరదా వాలుతోంది.

ఉండడంతో ఏం చేయాలో దిక్కుతోచని దర్శకులు బెంబేలు పడడంతో ఏర్పడిన కుదుపు అది.

ఆ మరణంతో తర్వాత ఏమిటని అందరూ ఆలోచించారు తప్ప ఆమె శవాన్ని చూసేందుకు కూడా ఏ ప్రముఖుడూ రాలేదు.

ద్వారకానాథ్ మాత్రం ఆమె శవాన్ని దహన సంస్కారాలను పిక్చరైజ్ చేశాడు. ఆ హడావుడి తప్ప ఆమె మరణయాత్ర చాలా సాధారణంగా సాగిపోయింది.



దూరంగా నిలబడిన కాటికాపరి అతడి కేసే అదోలా చూస్తున్నాడు.

హాసిని మరణవార్త సినిమా ఇండస్ట్రీని ఓ కుదుపు కుదిపింది.

అయితే అది ఆమె పట్ల విపరీతమైన ప్రేమాభిమానాలతోకాదు ఆమెకు అడ్వాన్సులు ఇచ్చిన నిర్మాతలు, ఆమె మీద అప్పటికే కొన్నిసీన్లు తమ సినిమా కోసం తీసి

శవదహనం తర్వాత అందరూ వెళ్లిపోతూ అరుణ్‌ని రమ్మంటే అతడు వారి వెంట వెళ్లలేదు. అభిమానించి తనను దగ్గరవాడిగా తలచిన ఆమెకు అందించే చివరి వీడ్కోలు అంత త్వరగా ముగించుకుని వెళ్లిపోవాలనిపించడంలేదు.

పెళపెళారావాలతో మండే ఆ మంటల వెనుక కాలిబూడిదయ్యే తన నేస్తం భౌతిక కాయానికి తోడుగా ఉన్నట్టు అతడు చాలా చాలాసేపటి వరకూ ఈ లోకాన్ని మరచి అక్కడే ఉండిపోయాడు.

"బాబూ..."

అతడు ఈ లోకంలోకి వచ్చి తల తిప్పి చూస్తే పక్కనే కాటికాపరి. ఎన్నో వందల శవాలను చూసి కూడా జీవితం పట్ల ఆశ చంపుకోని మానవజీవి.

"చాలా పొద్దుపోయింది. శ్మశానంలో మరింతసేపు ఉండడం మంచిది కాదు బాబూ!"

అతడు నెమ్మదిగా తలాడించాడు. వెను తిరిగేందుకు మనసొప్పక పోయినా, వెనుదిరగక తప్పలేదు.

అప్పుడే... అప్పుడే అతడి కంటినుండి రెండు కన్నీటిబొట్లు బుగ్గల మీదుగా నేలకు జారాయి. ఆ అశ్రువులే విడిపోయిన తన నేస్తానికి తోడు అనుకున్నాడు అతడు.

★ ★ ★

హాసిని మరణం రాజేశ్వరిని కూడా ఎక్కువగానే కదలించింది. 'సినీతారల జీవితాల ముగింపు ఇంత దారుణంగా ఉంటుందా?' అనుకుంది. హాసిని గురించి అప్పటివరకూ చెడుగా ఊహించుకున్నందుకు పశ్చాత్తాపపడడం తప్ప మరేం చేయలేనని బాధపడింది.

ఈశ్వరయ్య హైదరాబాద్ వచ్చాక అతడితో ఆమె పల్లెకు వెళ్ళిపోయింది. అప్పటికే ఆమెకు ఇండస్ట్రీ గురించిన ఎన్నో నిజాలు తెలిశాయి.

నిన్నటివరకూ తమ మధ్య తిరుగుతూ, తమ చిత్రాల విజయానికి దోహదపడిన ఓ నటి కనుమరుగు కావడం ఇండస్ట్రీలోని ఏ ఒక్కరినీ కదిలించలేదు. మర్నాటినుండే వారందరూ ఎవరి పనుల్లో వారు బిజీ అయిపోయి, హాసిని అన్న పేరే మరచిపోయారు.

ద్వారకానాథ్ సినిమా షూటింగ్ నిర్విరామంగా సాగిపోతోంది. హాసిని మరణంతో కథ కొద్దిగా మారింది, అంతే! భావుకుడయిన హీరోని ప్రేమించి అతడిచే తిరస్కరింపబడిన ఆమె, ఆత్మహత్య చేసుకుంటుంది.

ఆమె మరణంరోజు తీసిన సన్నివేశాలు యధాతధంగా చిత్రంలో జోడించదలచుకున్నారు. ఆ సన్నివేశాలు తమ చిత్రానికి మరింత ప్లస్ అవుతాయని నిర్మాతలు లోలోపలే ఆనందపడ్డారు కూడా!

మరోవైపు నరేంద్ర సినిమా పోటీగా నిర్మాణం జరుపుకొంటోంది.

అందరూ జనవరి ఆరు ఎప్పుడు వస్తుందా- ఆ రెండు చిత్రాలలో ఏ చిత్రం విజయం సాధిస్తుందా? అని ఎదురుచూస్తున్నారు.

అరుణ్ కూడా ఆ రోజుకోసమే ఎదురు చూస్తున్నాడు. అయితే అతడు ఎదురుచూసేది తన సినిమా సక్సెస్ గురించి వార్తలు తెలుసుకోవడం కోసం మాత్రం కాదు.

జనవరి ఐదు.

సినిమా రిలీజ్‌కి ఒకటి రెండు రోజుల ముందు ఇండస్ట్రీలోని ప్రముఖుల కోసం ప్రివ్యూ వేయడం సాధారణంగా జరిగే విషయం.

ఆరోజు ద్వారకానాథ్ ప్రివ్యూ ఏర్పాటు చేశాడు.

★ ★ ★

ఇండస్ట్రీలోని వారందరికీ ఆహ్వానాలు పంపాడు. ప్రముఖ నిర్మాతలు, దర్శకులు, టెక్నీషియన్స్, ఫైనాన్షియర్స్, డిస్ట్రిబ్యూటర్లు, జర్నలిస్టులు ఆ ప్రివ్యూకు విచ్చేశారు.

సినిమా ప్రదర్శనలో తెరమీద విశ్రాంతి కార్డు పడ్డాక అందరికీ స్నాక్స్, కూల్‌డ్రింక్స్ అందాయి.

ఇద్దరు ముగ్గురు నిర్మాతలు, ఒకరిద్దరు దర్శకులు ద్వారకానాథ్‌ని చుట్టుముట్టి అభి

నందిస్తూ అన్నారు. "నో డౌట్! మీ టేకింగ్ అద్భుతం. ఆ నటుడెవరోగానీ చాలా... చాలా బాగా యాక్ట్ చేశాడు"

ఆ తరువాత మళ్ళీ సినిమా మొదలయింది.

సినిమా పూర్తయ్యాక ఓ ప్రముఖ నిర్మాత ద్వారకానాథ్‌ని అడిగాడు "హీరోగారు ఎక్కడ? "

"తాను ఈ ప్రివ్యూకి రావడం లేదని చెప్పాడు"

"మీరు అతడి అడ్రస్ ఇవ్వగలరా? "

"ఎందుకు? "

"నిజం చెప్పమంటారా? " నవ్వుతూ అడిగాడు నిర్మాత.

"చెప్పండి" అన్నాడు ద్వారకానాథ్.

ఆ నిర్మాత చెప్పాడు "మీ సినిమా రిలీజయ్యాక కేవలం పది రోజుల్లోనే అరుణ్ కాల్షీట్స్ దొరకడం కష్టమౌతుంది. అందుకే ముందుగానే నేను అతడి డేట్ కోసం ప్రయత్నించదలచుకున్నాను"

ద్వారకానాథ్ కూడా నవ్వి "ఆ విషయం నాకూ తెలుసు. కాని..." ఆయనకు అరుణ్ చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. అయితే అరుణ్ ఇకపై సినిమాలలో నటించడన్న విషయం తాను చెప్పి ఎదుటివ్యక్తిని ఆశ్చర్య పరచడంకన్నా మౌనంగా ఉండిపోవడం మంచిదనిపించింది.

ద్వారకానాథ్ ఆ నిర్మాతకు అరుణ్ అడ్రస్ ఇచ్చాడు.

అదేరోజు- ఆ నిర్మాత అరుణ్ ఇంటికెళ్ళాడు. ఆ ఇంటికి తాళంవేసి ఉంది.

కింది పోర్షన్‌లోని హౌస్‌ఓనర్‌ని అడిగితే 'ఆయన ఈ ఉదయమే ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయారని' సమాధానం వచ్చింది.

"ఎక్కడికెళ్ళాడు"

"వాళ్ళ ఊరు వెళ్లిపోతున్నాడని చెప్పాడు'

ఆ నిర్మాత తెల్లమొహం వేశాడు.

★ ★ ★

జనవరి ఆరు.

ఈశ్వరయ్య, రఘురామయ్య, రుక్మిణమ్మ... ఇంకా ఆ పల్లెలోని చాలామంది ఉదయం బస్సుకే దగ్గరలోని టౌన్‌కి బయల్దేరి వెళ్ళిపోయారు.

'అరుణ్ ఇల్లుదాటి అడుగు బయటకు పెట్టలేదు. తన గదిలో కిటికీ దగ్గరే నిలబడి అందమైన ఆ ప్రకృతిని చూస్తూ ఉన్నాడు. చాలాకాలం తర్వాత తన తల్లి ఒడిలో పడుకుంటే కలిగే సంతృప్తి ఆ క్షణాలలో అతడికి కలిగింది.

వాకిలి దగ్గర చప్పుడయింది. అతడు తల తిప్పి చూశాడు.

రాజేశ్వరి!

ఆమె అతడి దగ్గరగా వచ్చింది.

"నువ్వు అందరితోపాటు టౌన్‌కి వెళ్ళలేదా? "

"ఎందుకు? "

"నీ బావ హీరోగా నటించిన సినిమా ఈరోజేగా రిలీజయింది. మనవాళ్ళంతా ఆ సినిమా చూసేందుకు వెళ్ళారు"

"నాకు ఆ సినిమామీద ఇంట్రస్ట్ లేదు" నవ్వుతూ అంది రాజేశ్వరి.

"ఎందుకని? " అతడు ఆశ్చర్యపోయాడు.

"అన్న మాటను నిలబెట్టుకునేందుకు పట్టుదలతో శ్రమపడి విజయాన్ని సాధించిన నా బావ నా ఎదురుగా ఉంటే సినిమాలో నటనతో మాత్రమే మెప్పించే ఆ అరుణ్ నాకెందుకు? "

"కాని ఆ హీరో నీ బావ! నువ్వు చూడాని కలలుకన్న సినిమా హీరో అతడు"

"తెలిసీ తెలియని తనంతో నా బావను సినిమా హీరోగా చూడాలనుకున్నానుగానీ నాకు ఆ హీరో వద్దు... ఈ హీరోనే కావాలి"

ఆమె అతడి కౌగిలిలో ఒదిగిపోయింది. అతడు ఆమెను అపురూపమైన వస్తువును పట్టుకున్నంత జాగ్రత్తగా పొదివి పట్టుకున్నాడు. ★










# రెండు కాళ్ళ కుక్క!

రైలు ప్రమాదంలో రెండు కాళ్ళు పోగొట్టుకున్న ఈ కుక్కగారికి సర్జరీ చేసి బ్రతికించారో డాక్టర్. దీన్నిపుడు 'అంగవికలుర కేంద్రం'లో ఆత్మవిశ్వాసంతో బ్రతకటం ఎలా? అనేందుకు ఉదాహరణగా అక్కడే పెంచుకుంటున్నారు.

# చతుర కథలు

## డిస్కౌంట్

రఘునాధరావుగారు ఇలా హాల్లో అడుగుపెట్టారో లేదో అలా పరుగెత్తుకొచ్చి, "డాడీ! ఇదుగో చూడండి స్పోర్ట్స్ గూడ్స్‌పై 20% డిస్కౌంట్ ఇస్తుంటే ఈ షెటిల్ బ్యాట్స్, కాక్స్ తీసుకొన్నాను. బాగున్నాయి గదా!" ఆనందంగా అన్నాడు వారి చిన్నబ్బాయ్.

"గుడ్" అంటూ, మరి నీవేం తీసుకోలేదా, ఏంటోయ్?" నవ్వుతూ భార్యతో అన్నారాయన.

"ఏం మీ పిల్లలకేగాని, తీసుకోడం నాకు చేతకాదా ఏం? చూడండి, 40% డిస్కౌంటులో ఈ కిచెన్ సెట్ కొన్నా. ఎంత చవకో ఎంత బాగున్నాయో!" కించిత్ గర్వంగా అన్నది భార్యామణిగారు.

"అహా! అలాగా! అయితే వినండి. నేను



"ఓ! వెరీగుడ్" అన్నారాయన సోఫాలో కూర్చొంటూ.

"మరేం! నాన్నగారూ! నేను షాపింగ్ చేసి 30% డిస్కౌంట్‌పై, ఈ డ్రస్‌లు తీసుకొన్నాను. బాగున్నాయా" అంది అమ్మాయి అపర్ణ అవి చూపిస్తూ!

"చాలా బాగున్నాయమ్మా" అంటుండగా నే...

"ఇదుగోండి, నాన్నగారూ! నా షూస్ పాడయినాయి గదా 10% డిస్కౌంట్‌లో వీటిని కొన్నాను" చూపాడు పెద్దవాడు, అరుణ్!

50% డిస్కౌంటుతో మంచి బేరం కుదుర్చుకొని మీతో చెబ్దామని ఉత్సాహంగా వచ్చాన్లెండి! అదేంటో చెప్పుకోగలరా?" అన్నారు రఘునాధరావుగారు.

"50% డిస్కౌంటే! మైగాడ్! ఏంటి డాడీ కూలరా?" అన్నాడు చిన్నబాబీ.

"ఊహూ" అన్నాడాయన.

"వీసీఆర్‌నా?" అనడిగాడు పెద్దవాడు.

"మేం చెప్పలేం ప్లీజ్ నాన్నగారూ"



అన్నారు మిగతావారు.

"మురిపించక అదేంటో చెప్పండి" అన్నారు భార్యామణి.

"అదేనోయ్ 50% డిస్కౌంటుతో ఆమధ్య వచ్చిన ఇంజనీర్ అల్లుణ్ణి కుదుర్చుకొని వచ్చాను" అన్నారాయన.

"నిజమా? వాళ్ళు పది లక్షలన్నారు కదండీ?" ఆశ్చర్యపోయారామె.

"నిజమేగానీ, వాళ్ళంతగా వాళ్ళు కబురు చేసి 'మీ పిల్ల మాకు నచ్చింది. మా పిల్లకి కూడా సంబంధం సెటిల్ అయింది. కట్నాల దేముంది? ఆ అయిదు లక్షలే ఇవ్వండి' అన్నారు. సరేనని ఏర్పాట్ల గురించి కూడా మాట్లాడేసి మరీ వచ్చాను" అన్నారాయన తృప్తిగా.

"మరి ఏదో వస్తువు కొన్నట్టులా, అన్నారేం? నాన్నగారూ" సిగ్గుతో, రోషంతో అంది అపర్ణ.

"అక్కయ్యకి జాబ్ వచ్చిన సంగతి వాళ్ళకి తెల్సిఉంటుంది నాన్నగారూ. అందుకే ఈ స్పెషల్ డిస్కౌంట్"

అరుణ్ మాటలకు అంతా ఘొల్లున నవ్వారు.

-ఎ. విశాలాక్ష్మి

## ప్రశ్నలు మూడే

పెళ్ళిచూపులు అయ్యాక జంటని ఒంటరిగా వదిలి పక్కకు తప్పుకున్నారందరూ!

పెళ్లికొడుకు పరాత్పరరావు చివరగా ఇలా అన్నాడు.

"నాకు ప్రతీదీ ముక్కుసూటిగా మాట్లాడటం అలవాటు. అబద్ధాలాడటం సహించలేను. నా ప్రశ్నలకు మీరు సమాధానం ఇస్తే సంతోషిస్తాను"

పెళ్లికూతురు జలజాక్షి "అడగండి" అనేసింది.

"నేను నెలకొకసారి హెయిర్‌డై వాడతాను. నాకు సొంతంగా డై వేసుకొనే అలవాటు లేదు. జెంట్స్‌పార్లర్‌కి వెళితే యాభై రూపాయలు ఖర్చు. పెళ్లయిన తర్వాత ఆ ఖర్చు తగ్గించుకోడానికి నాకు హెయిర్‌డై వేసేందుకు మీకేమైనా అభ్యంతరం వుందా? " మొదటి ప్రశ్న వదిలాడు పరాత్పరరావు.

"నాకు అభ్యంతరం ఎందుకండీ!" చిరుమందహాసంతో జవాబిచ్చింది జలజాక్షి.

"నేను ఒంటరిగా ఉంటూ జాబ్ చేస్తున్నాను. నన్ను చూడటానికి మధ్య మధ్య మా ఊరునించి మా అమ్మా... నాన్న... చెల్లి... వచ్చి నా దగ్గర ఓ వారంరోజులు ఉండి వెళుతుంటారు. అన్నయ్య... వదిన... వాళ్ళ ఇద్దరు పిల్లలు కూడా అడపాదడపా వచ్చి పదిరోజులుండి వెళుతుంటారు. అలాగే మా పిన్ని, బాబాయ్, మేనత్త, మేనమామ కూడా వచ్చి వెళుతుంటారు. మర్యాద భారతీయుల సంప్రదాయంకదా. ఈ విషయంలో మీరు నొచ్చుకోకుండా విసుక్కోకుండా వాళ్లడిగినవి చేసిపెడుతుండాలి. అఫ్‌కోర్స్... ఇది మీకు కష్టం కాదనుకుంటాను" పరాత్పరరావు ఆత్రుతగా జలజాక్షి మొహంలోకి చూశాడు.

"ఇల్లన్న తర్వాత చుట్టాలంటూ రాకుండా ఎలా ఉంటారు? ఇంటికి నలుగురు వస్తే సంతోషించేదాన్నే. కాని విచారించే రకాన్ని కాను. నలుగురూ వచ్చిపోతుంటేనే కాలక్షేపంగా ఉంటుంది" స్వచ్ఛమైన స్వరంతో మృదువుగా సమాధానం ఇచ్చింది జలజాక్షి.

పరాత్పరరావు చిరునవ్వుతో మూడో ప్రశ్న వేశాడు.

"ప్రతి ఆదివారం ఓ ముగ్గురు మిత్రులు ఇంటికి వస్తారు. బైటికి వెళ్ళకుండా ఆ ఒక్క రోజూ విసుగు పుట్టేలా పేకాడుకుంటుంటాం. దానికి అభ్యంతరం చెప్పకూడదు. ఈ విషయంలో కూడా మీకు అభ్యంతరం లేకపోతే నాకు మిమ్మల్ని పెళ్ళాడటం

ఇష్టమే"

"నాకు ఎటువంటి అభ్యంతరమూ లేదు" సిన్సియర్‌గా జవాబిచ్చింది జలజాక్షి.

పెళ్ళిచూపుల్లో ఇలా మూడు ప్రశ్నలు వేయటం... చివాట్లు తింటం... పెళ్ళిచూపులు తప్పిపోవటం... చాలాసార్లు పరాత్పరరావు జీవితంలో జరిగింది. అదేమి అదృష్టమో... ఈ దఫా మాత్రం అమ్మాయి నచ్చింది. అతని కోరికలకి అనుకూల సమాధానమూ లభించింది.

"మీక్కూడా ఏమైనా కోరికలు ఉండి ఉండవచ్చు అడగండి. నా తాహతుకి మించనివైతే మీ కోరికలు తీరుస్తానని

ఇద్దరు మనుషులకయితే వంట చెయ్యగలనుగానీ నలుగురు మనుషులొస్తే కష్టం. కనుక మీ అమ్మా... నాన్న... చెల్లి వచ్చే ముందు వాళ్లు లెటర్ రాస్తే నేను వెంటనే టెలిగ్రాం ఇప్పించి మా అమ్మా... నాన్న... చెల్లిని నాకు వంటలో సాయంగా పిలిపించుకొంటాను. అలాగే మీ తరపు చుట్టాలు రాగానే నా తరపు చుట్టాలొచ్చి చక్కగా మర్యాదలు చేస్తారు. రుచికరంగా వంటలు కూడా వాళ్లే చేస్తారు. మీ వాళ్లటు వెళ్లంగానే మా వాళ్ళిటు వెళ్ళిపోతారు. నో ప్రాబ్లం!"

"ప్రతి ఆదివారం రోజంతా మీరు పేకా



మాట ఇస్తున్నాను" అన్నాడు గొప్పగా.

"సంసారమనే బండి సాఫీగా నడవాలంటే ఎచ్చులకి పోకూడదు. బండి నడక సమానంగా ఉండాలి" అంటూ జలజాక్షి తన కోరికలు చెప్పసాగింది.

"నెలకోసారి మీ హెయిర్‌డై బాటిల్‌తో పాటు నాకూ ఒకటి తెచ్చిపెట్టాలి. మీరు ఒక్కనెల మానేసినా నా తల కట్టు అసహ్యంగా ఉంటుంది. అందుకని హెయిర్‌డై బాటిల్ తప్పనిసరి"

"తరచు మీ వాళ్లు ఎవరో ఒకరు వచ్చి పదిరోజులు తిష్టవేసి పోతుంటారన్నారు.

డుతూ కూర్చుంటే నేను గోళ్లు గిల్లుకొంటూ కూర్చోటం మహాబోర్. ఆ ఆట నాక్కూడా బాగానే వచ్చు మీ ముగ్గురు స్నేహితులతో నేనూ ఆడతాను. మీ హ్యాండ్ లక్కీ అయితే మీకు డబ్బులు రావచ్చు నా హ్యాండ్ లక్కీ అయితే నాకు డబ్బులు రావచ్చు ఇటు కాలక్షేపంగానూ ఉంటుంది. అటు డబ్బు వస్తుందిగదా" అంటూ చిరునవ్వుతో తన మూడు కోరికలూ బయటపెట్టింది జలజాక్షి.

–కురుమద్దాలి విజయలక్ష్మి

# పక్కవాడి పెళ్లాం

రాధను చూడ్డానికి వచ్చిన పెళ్ళివారి అభిప్రాయం కనుక్కోడానికి మధ్యవర్తి అవధాని గారు వాళ్ళింటికి వెళ్లారు.

"అంతా బాగానే ఉందండి. కానీ ఆ అమ్మాయి పక్కన ఉంది చూసారూ, కాఫీ లవీ పట్టుకొచ్చిందీ పాటపాడమని బలవంతం పెట్టిందీ... పేరేమిటన్నారు?" ఆగేరు రాఘవయ్యగారు.

"లలిత, రాధ అక్కయ్య''

"ఆ, ఆ అమ్మాయి బావుందండీ, ఆ అమ్మాయి నిస్తారేమో కనుక్కోండి''

"అబ్బే అలా ఎలా కుదురుతుంది? ఆ అమ్మాయికి కట్నం లేకుండా ఒక ఇంజనీరుతో సంబంధం నిశ్చయమయిపోయిందనీ, పై నెలలోనే పెళ్ళనీ చెప్పాం కదా!" అన్నారు అవధానిగారు.

"ఏమోనండీ, మా కదంతా ఏమీ తెలీదు. మాకు ఆ అమ్మాయే నచ్చింది. ఆ పెళ్ళికూతురు బిగుసుకుపోయి కూర్చుంటే, ఈ అమ్మాయే చలాకీగా అటు ఇటూ తిరుగుతూ ఉంది. మా వాడికే కాదు, మా ఆడవాళ్ళక్కూడా ఆ అమ్మాయినే చేసుకోవాలని ఉంది. కట్నం మాకూ అక్కర్లేదు. వాళ్ళకేం చెప్పుకొంటారో ఏమో నాకు తెలియదు. ఆ తర్వాత మీ యిష్టం" అని ముగించేరు పెళ్ళికొడుకు తండ్రి రాఘవయ్యగారు.

ఇంటికి వచ్చిన అవధాని గార్ని చూసి "ఏమన్నారండీ మగపెళ్ళివారు?" అంటూ పలకరించేరు పెళ్ళి కూతురు మేనమామ సుందర్రావుగారు.

"అంతా మీరు చెప్పినట్టే జరిగిందండి. రాధ అక్కర్లేదు. లలిత అయితే కట్నం అక్కర్లేకపోయినా చేసుకొందామనుకుంటున్నారు'' అన్నారు అవధానిగారు.

"నే చెప్పలా! హ్యూమన్ మెంటాలిటీయే అంత. అందుబాటులో ఉన్నదానిమీద మోజుండదు. అందనిదానికి ఆరాటం హెచ్చు. అందుకే అలా చెప్పమన్నాను''



"బాగానే ఉందిరా! లలితకి సంబంధం కుదిరిందిగానీ మరి రాధ మాట ఎలాగరా?" అంది ఆయన తల్లి.

"నువ్వేం భయపడకమ్మా. రేపు లలితకి పెళ్ళి చూపులుగదా! రాధని తోడుగా పెట్టి, దానికి సంబంధం నిశ్చయమైపోయిందని చెప్తేసరి'' అన్నారు సుందర్రావుగారు తేలిగ్గా నవ్వేస్తూ.

-ఎమ్బీయస్ ప్రసాద్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78